# గ్రామీణ తెలంగాణ

## సామాజిక, ఆర్థిక దృశ్యం









ందరయ్య విజ్ఞాన కేంద్రం

తెలంగాణ రైతు సంఘం

తెలంగాణ వ్యవసాయ కార్మిక సంఘం







ప్రచురణ సంఖ్య : 1403

ప్రథమ ముద్రణ : సెప్టెంబర్, 2016

వెల : ₹ 90/-

ప్రతులకు : నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్
ఎమ్.హెచ్. భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్
ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ -20
ఫోన్ : 040 - 27660013

బ్రాంచీలు : నవతెలంగాణ బుక్‌హౌస్ బ్రాంచీలు
హైదరాబాద్ - చిక్కడపల్లి, బాగ్‌లింగంపల్లి (ఎస్.వి.కె.), ఇ.సి.ఐ.ఎల్.
నల్గొండ, హన్మకొండ, కరీంనగర్, ఖమ్మం, నిజామాబాద్

ప్రజాశక్తి బుక్‌హౌస్ బ్రాంచీలు
విజయవాడ, గుంటూరు, విశాఖపట్నం, తిరుపతి, ఒంగోలు, నెల్లూరు

ముద్రణ . నవతెలంగాణ డైలీ ప్రింటింగ్ ప్రెస్, హైదరాబాద్

# గ్రామీణ తెలంగాణ - సామాజిక ఆర్థిక దృశ్యం


**విశ్లేషకులు**

సి. సాంబిరెడ్డి

వై. సిద్ధయ్య

కె. వీరయ్య

జె. బాబూరావు

ఇ. బీరయ్య

కె. శంకర్

# కృతజ్ఞతలు

సర్వే విధి విధానాలు, ప్రశ్నావళి రూపకల్పన, విశ్లేషణలో పాల్గొని సూచనలు, సలహాలతో ప్రోత్సహించిన హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం ఆచార్యులు శ్రీ వకుళాభరణం వంశీ, శ్రీ పురేంద్రప్రసాద్‌లకు ప్రత్యేక కృతజ్ఞతలు.

సర్వే సమాచారాన్ని క్రోడీకరించి విశ్లేషించడానికి అవసరమైన సాఫ్ట్‌వేర్, డేటాబేస్‌ను రూపొందించి సహకరించిన ఫ్రీ సాఫ్ట్‌వేర్ ఉద్యమ కార్యకర్తలు (స్వేచ్ఛ) ప్రమోద్, సంధాని తదితరులకు ధన్యవాదములు.

# విషయసూచిక

# పరిచయం

**సుం**దరయ్య విజ్ఞాన కేంద్రం అధ్వర్యంలో రాష్ట్రంలోని 22 గ్రామాలలో వ్యవసాయ సంబంధాల అధ్యయనం కోసం సర్వే జరిగింది నీటి వనరుల స్థాయిని బట్టి సర్వే గ్రామాలను మూడు భాగాలుగా విభజించడం జరిగింది సర్వే గ్రామాలలోని రెండు మాగాణి పంటలు పండే గ్రామం ఒక్కటి కూడా లేదు మొత్తం 22 గ్రామాలలో 4 గ్రామాలు ఒక పంట పండే మాగాణీ వున్న గ్రామాలు, 13 గ్రామాలు కొంత భూమిలో ఒక మాగాణి పంట, మిగతా భూమి మెట్ట వున్నాయి. పూర్తి మెట్ట భూమి గ్రామాలు 5 వున్నాయి మొదటి విడత డిశంబరు 2013లో సెన్సెస్ సర్వేతో ప్రారంభమై, 2014 జూన్ నాటికి శాంపిల్ మీద ఆధారపడ్డ క్షేత్రస్థాయి తుది దఫా సర్వే ముగిసింది

ఇంతకు ముందు కూడా గ్రామ సర్వేలు అనేకం జరిగాయి అవి ప్రధానంగా అకడమిక్ పరిశోధకుల ఆధ్వర్యంలో జరిగాయి ఒకటి రెండు గ్రామాలకు పరిమితం అయిన పరిశోధనలు జరిగాయి కానీ ఇప్పటి సర్వే విస్తృతంగా జిల్లాలు, ప్రాంతాల్లో వ్యవసాయ పద్ధతులను పరిగణనలోకి తీసుకుని జరిగింది అంతేకాక విషయ జ్ఞానం కోసమే పరిమితం కాకుండా గ్రామీణ ప్రాంత ఉద్యమాలకు తోడ్పడేందుకు ఈ సర్వే ఉద్దేశించింది అందుకే సర్వే ప్రక్రియలో అన్ని దశల్లోనూ ఉద్యమ కార్యకర్తలు భాగస్వాములు అయ్యారు సుందరయ్య విజ్ఞాన కేంద్రంతో పాటు అఖిల భారత వ్యవసాయ కార్మిక సంఘం, అఖిల భారత కిసాన్ సభ కార్యకర్తలు అన్ని దశల్లోనూ భాగస్వాములు అయ్యారు ఉద్యమ శ్రేయోభిలాషులు అయిన మేధావులు ఈ కృషికి ప్రత్యక్షంగా, పరోక్షంగా

తోడ్పడ్డారు అనుభవజ్ఞులైన మేధావుల నైపుణ్యం, కార్యకర్తల క్షేత్రస్థాయి పరిజ్ఞానం మేళవింపబడటం ఈ సర్వే విశేషమే కాక సర్వే ఫలితాలు మరింత ప్రయోజనాత్మకంగా ఉండేందుకు తోడ్పడింది విశ్లేషణ ఫలితాలను పరిశీలించిన వారెవరైనా ఈ విషయాన్ని గమనిస్తారు విశ్లేషణ అంతా సమగ్రంగా పూర్తి అయ్యాక అన్ని అంశాలతో కూడిన లోతైన ప్రచురణను ఒకేసారి తీసుకు రావటం కొంత సమయం తీసుకుంటుందని భావించి దశల వారీగా విశ్లేషణ ఫలితాలను పాఠకుల ముందుంచాలని పరిశోధన సమన్వయకులు భావించి సెన్సెస్‌కు సంబంధించిన గ్రామాలవారీ విశ్లేషణ పత్రాలను ప్రస్తుత పుస్తకంలో పొందుపర్చారు

ఈ పుస్తకంలో దక్షిణ తెలంగాణలో తొమ్మిది, ఉత్తర తెలంగాణలో 13, మొత్తం 22 గ్రామాలకు సంబంధించిన సెన్సెస్ విశ్లేషణ పత్రాలు ఉన్నాయి సాగునీటి వసతిని బట్టి వీటిల్లో నాల్గు మాగాణి, ఐదు మెట్ట, 13 మిశ్రమ గ్రామాలు ఉన్నాయి ఈ గ్రామాలు హైదరాబాద్, రంగారెడ్డి మినహా అన్ని తెలంగాణ జిల్లాల్లో ఉన్నాయి

వ్యవసాయంలో కుటుంబ పనిదినాలు, కూలికి పోయిన పనిదినాల మొత్తానికి, కుటుంబ పనిదినాలు, కూలికి పెట్టుకున్న పనిదినాల మొత్తానికి నిష్పత్తి కట్టగా వచ్చిన దాన్ని శ్రమనిష్పత్తిగా నిర్వచించడం జరిగింది (కు ప ది+కూలికి పోయిన దినాలు/ కు ప.ది+కూలికి పెట్టుకున్న దినాలు×100) కమతాలను వర్గీకరించడానికి శ్రమ నిష్పత్తుల మోతాదులను బట్టి 20శాతం లోపు భూస్వాములుగా, 50 లోపు ధనికరైతుగా, 90వరకు మధ్యతరగతి రైతుగా, ఆపైన చిన్న సన్నకారు రైతులుగా, అనంతం వుంటే వ్యవసాయ కార్మికులుగా గుర్తించడం జరిగింది ఆచరణాత్మకంగా వుండేందుకు వీలుగా శ్రమనిష్పత్తి ప్రాతిపదికతో పోల్చి స్థూలంగా సరిపోయే భూప్రాతిపదికను నిర్ణయించడం జరిగింది 40 ఎకరాలు పైబడిన భూపరిమితి భూస్వామికి, 20-40 పరిమితి ధనిక రైతుకి, 10-20 మధ్యతరగతి రైతులకు, 5-10 చిన్నకారు, 1 5-5 సన్నకారు, 1 25 లోపు వ్యవసాయ కార్మికులకు ఖరారు చేయడం జరిగింది.

వివిధ రకాల నీటివనరుల భూములను సమం చేసేందుకు రెండు పంటల మాగాణి 5 ఎకరాలు, ఒక పంట మాగాణికి రెండున్నర ఎకరాల మెట్టకు సమాన మోతాదుగా తీసుకొని వ్యవసాయ కమతం యొక్క భూవిస్తీర్ణాన్ని లెక్కించడం జరిగింది ఈ పరివర్తన మోతాదును 4 ఎకరాలు, రెండు ఎకరాలుగా తీసుకొని లెక్కించి వివిధ

తరగతుల భూపరిమితిని నిర్ణయించి కూడా సమాచారాన్ని విశ్లేషించడం జరిగింది రెండు పద్ధతులను వినియోగించి విశ్లేషించినపుడు 40 ఎకరాల భూపరిమితి (భూస్వామికి) పద్ధతిని వినియోగించడం మరింత శాస్త్రీయంగా వుంటుందని భావించడం జరిగింది

22 గ్రామాల సెన్సెస్ విశ్లేషణలు పరిశీలిస్తే రాష్ట్ర వ్యవసాయ ముఖ చిత్రాన్ని అర్థం చేసుకోవటానికి పనికొచ్చే కొన్ని సాధారణ విషయాలను మనం గమనించవచ్చు సెన్సెస్, శాంపిల్ సర్వేల్లోని కొన్ని ముఖ్యాంశాలు పరిశీలించి నిర్ధారించిన కొన్ని ప్రాధమిక విశ్లేషణలను దిగువన పేర్కొంటున్నాము

1 రాష్ట్రంలో వ్యవసాయేతర కార్యకలాపాలపై ఆధారపడి జీవించే కుటుంబాలు గణనీయమైన సంఖ్యలో వున్నాయి. సుమారు 20 శాతం ఈ కోవకు చెందుతాయి వ్యవసాయేతర కుటుంబాలు ఉత్తర తెలంగాణలో ఎక్కువగానూ, దక్షిణ తెలంగాణలో తక్కువగానూ వున్నాయి

2 వ్యాపారం, ఉద్యోగం మీద ఆధారపడ్డ కుటుంబాలు దక్షిణ తెలంగాణ కన్నా ఉత్తర తెలంగాణలో ఎక్కువగా ఉన్నాయి

3 సంపూర్ణంగా దోపిడీకి గురవుతూ వ్యవసాయ, వ్యవసాయేతర పనులపై ఆధారపడి శ్రమను అమ్ముకుని బ్రతికే తరగతులు మూడు 1 వ్యవసాయ కార్మికులు 2 వ్యవసాయేతర కార్మికులు 3. మిశ్రమ శ్రామికులు

4 వ్యవసాయేతర శారీరక శ్రమ చేసుకు బ్రతికే కుటుంబాలు దక్షిణ తెలంగాణలో నామమాత్రంగా ఉంటే ఉత్తర తెలంగాణలో గణనీయంగా వుండటం గమనించదగ్గది.

5 వ్యవసాయకార్మికులు 25శాతం వున్నారు ఉత్తర తెలంగాణలో 26శాతం, దక్షిణ తెలంగాణలో 24 శాతం వున్నది

(వ్యవసాయేతర, వ్యవసాయ శ్రామికులను వర్గీకరించేందుకు వ్యవసాయ, వ్యవసాయేతర పనిదినాల మధ్య నిష్పత్తిని కొలబద్దగా తీసుకోవడం జరిగింది 60శాతం పైగా వ్యవసాయ పనిదినాలుంటే వ్యవసాయ కార్మికుడిగా, వ్యవసాయ పనిదినాలు 40శాతం కన్నా తగ్గితే వ్యవసాయేతర శ్రామికునిగా వర్గీకరించడం జరిగింది )

6. వ్యవసాయంలో ప్రధానంగా శ్రమదోపిడీకి పాల్పడే భూస్వామ్య, ధనిక రైతు తరగతుల కమతాలు మొత్తం కుటుంబాలలో షుమారు 6% ప్రాంతాలవారీగా చూస్తే దక్షిణ తెలంగాణలో ఎక్కువగా అంటే 10శాతం, ఉత్తర తెలంగాణలో కొంత తక్కువగా అంటే 4శాతం వున్నాయి

7 అటు దోపిడీ వర్గాలైన భూస్వాములు, ధనిక రైతులకు, ఇటు దోపిడీకి గురయ్యే వర్గమైన వ్యవసాయ కార్మికులకు మధ్య (స్వంత శ్రమ / కుటుంబ శ్రమ) ప్రధానంగా మూడు తరగతులు– మధ్యతరగతి రైతు, చిన్నకారు, సన్నకారు రైతులు వున్నాయి వీటిని పరివర్తనా తరగతులుగా భావించవచ్చు వ్యవసాయంలో ఒడిదుడుకులు పెరిగినపుడు పెట్టుబడిదారీ పద్ధతులు వ్యాపించినపుడు ఈ తరగతులు ఎక్కువగా మార్పులకు గురవుతాయి వివిధ ప్రాంతాలలో పెట్టుబడిదారీ సంబంధాల తీవ్రతస్థాయిని అవగాహన చేసుకునేందుకు ప్రయత్నించాలి

సర్వే గ్రామాల్లోని మధ్యతరగతి, చిన్నకారు, సన్నకారు రైతు వర్గాలైన ఈ మూడు తరగతుల కమతాలు కలిపి 51% వున్నాయి దక్షిణ తెలంగాణలో వర్గ విభజన తీవ్రత కొంత తక్కువగా వున్న పరిస్థితిని వివరాలు వెల్లడిస్తున్నాయి. సన్నకారు రైతుల మోతాదును పోల్చి చూస్తే ఉత్తర తెలంగాణా సన్నకారు రైతుల నిష్పత్తి మొత్తం రైతాంగంలోను, మధ్య పొరల్లో వున్న రైతాంగంలోనూ చాల తక్కువగా వున్నట్లు వెల్లడవుతున్నది

ఉత్తర తెలంగాణ ప్రాంతంలోని సర్వే గ్రామాల్లో రైతాంగంలో కొట్టొచ్చినట్లుగా వర్గ విభజన తీవ్రత కన్పించడంలేదు. భూస్వామ్య ధనికరైతు కమతాల నిష్పత్తి తక్కువగా వున్నది. దక్షిణ తెలంగాణలోని గ్రామాల్లో భూస్వామ్య, ధనికరైతు వర్గాల నిష్పత్తి సాపేక్షంగా ఎక్కువగా వున్నప్పటికి వ్యవసాయకార్మికుల నిష్పత్తి తక్కువగాను, మిగతా రైతాంగంలోని వివిధ తరగతులు ఎక్కువగాను వున్నాయి మొత్తం తెలంగాణ రాష్ట్ర వ్యాపితంగా చూసినప్పుడు వర్గవిభజన తీవ్రత తక్కుగా కన్పిస్తున్నది.

| వర్గం | తెలంగాణ |
| --- | --- |
| భూస్వాములు | 0.85 |
| ధనిక రైతులు | 3 40 |
| మధ్యతరగతి | 10 40 |
| చిన్నరైతు | 17 80 |
| సన్నకారు | 22 77 |
| వ్యవసాయ కార్మికులు | 24 38 |
| వ్యవసాయేతర కార్మికులు | 5 15 |
| ఉద్యోగులు | 3 90 |
| వ్యాపారులు | 3 50 |
| వృత్తిదార్లు, స్వయం ఉపాధి | 3 90 |
| ఇతరులు | 4.85 |

వివిధ వర్గాల సగటు కమతపు భూ విస్తీర్ణాన్ని పోల్చి చూస్తే వర్గాల మధ్య అంతరం ఎక్కువగా వున్నది. మొత్తం భూమిలో వివిధ వర్గాల భూమి నిష్పత్తిని పరిశీలించినపుడు పై నాలుగు వర్గాలకు దాదాపు సమానంగా వున్నది 4 25 శాతంగా వున్న భూస్వామ్య, ధనిక రైతు తరగతుల చేతుల్లో 26 శాతం భూమి వున్నది 51 శాతంగా వున్న మధ్యతరగతి, చిన్న సన్నకారు కమతాల చేతుల్లో 72శాతం వున్నది మిగిలిన 40శాతం శ్రామికుల చేతుల్లో 2శాతం మాత్రమే వున్నది సగటు కమతం భూవిస్తీర్ణం చూసినా భూస్వామి కమతం సగటు 72 ఎకరాలు ధనిక రైతు కమతం 28 ఎకరాలున్నది

ప్రాంతాల వారీ సర్వే గ్రామాలను పరిశీలిస్తే కొన్ని ప్రత్యేకతలను గమనించవచ్చు భూస్వాముల చేతిలో భూకేంద్రీకరణ స్థాయి ఉత్తర తెలంగాణ సర్వే గ్రామాల కన్నా, దక్షిణ తెలంగాణలో అధికంగా వున్నది కమతం సగటు భూమిని పరిశీలించినా ఇది విదితం అవుతుంది ఆ మేరకు ఉత్తర తెలంగాణ కన్నా, దక్షిణ

తెలంగాణాలో, మధ్య భాగాన వున్న రైతాంగం ఎక్కువగా వున్నది ఉత్తర తెలంగాణలో 40శాతం కమతాలున్న మధ్యతరగతి, చిన్న సన్నకారు తరగతుల చేతిలో 66% భూమి వుండగా దక్షిణ తెలంగాణలో 52శాతంగా వున్న ఈ తరగతుల చేతిలో 44శాతం భూమి మాత్రమే వున్నది అలాగే దక్షిణ తెలంగాణలో కమతాల భూమి సగటు మోతాదులో కూడా వ్యత్యాసం తక్కువగా వున్నది

సర్వే కుటుంబాలలో 14శాతం అగ్రకులాలు, 56శాతం వెనుకబడిన కులాలు, 22శాతం దళితులు, 8శాతం గిరిజన కుటుంబాలు వున్నాయి పరిమితమైన శాంపిల్ అయినా రాష్ట్రజనాభా నిష్పత్తిని ఇది కొంతమేరకు ప్రతిబింబిస్తున్నది అన్ని సామాజిక తరగతుల్లోను పెరిగిన వర్గ వైవిధ్యాన్ని సమాచారం స్పష్టం చేస్తున్నది. ఈ వర్గవైవిధ్యం అగ్రకులాలలో, వెనుకబడిన కులాలలో మరింత స్పష్టంగా కన్పిస్తున్నది అయితే ఈ ప్రక్రియ సంపూర్ణంగా పూర్తి కాలేదనే విషయం సామాజిక అసమానతలకున్న ఆర్థిక పునాది ఇంకా పూర్తిగా బద్దలు కాలేదనే విషయం వివరాలను చూస్తే అర్థం అవుతుంది ఇప్పటికీ భూస్వామ్య కమతాలలో 67 శాతం అగ్రకులాలు, వ్యవసాయ కార్మిక కుటుంబాలలో 37శాతం దళితులవే వెనుకబడిన కులాలు తెలంగాణ రాష్ట్రంలో భూస్వామ్య తరగతి మినహా అన్ని వర్గాల లోను అధిక శాతం వుండటం గమనించదగ్గ విషయం భూస్వామ్య తరగతిలో సైతం 25శాతం కుటుంబాలున్నాయి.

సామాజిక పొందిక విషయంలో రాష్ట్రలోని రెండు ప్రాంతాల మధ్య వైవిధ్యం గమనించదగిన విధంగా వున్నది వెనుకబడిన కులాల కమతాల శాతం ఉత్తర తెలంగాణలో భూస్వామ్య వర్గంతో సహా అన్ని తరగతుల్లో అధికంగా వున్నది వ్యవసాయ కార్మికుల్లో అగ్రకులాల కుటుంబాలు దక్షిణ తెలంగాణలో 5శాతం వుంటే, ఉత్తర తెలంగాణలో 24శాతం వుండటం విశేషం అలాగే వ్యవసాయ కార్మికుల్లో దక్షిణ తెలంగాణలో బిసిలు 59శాతం వుంటే, ఉత్తర తెలంగాణలో 40శాతం మాత్రమే వున్నాయి భూస్వాముల్లో ధనిక రైతుల్లో ఉత్తర తెలంగాణలో అగ్రకులాలు, వెనుబడిన కులాలు చెరిసగంగా వుంటే, దక్షిణ తెలంగాణలో భూస్వాముల్లో అగ్రకులాలు, ధనిక రైతుల్లో వెనుకబడిన కులాలు అధికంగా వున్నారు. మధ్యతరగతి, చిన్న సన్నకారు రైతుల్లో వ్యాపారం, ఉద్యోగం, విషయాల్లో అగ్రకులాలు, వెనుకడిన కులాలు, దళితులు, గిరిజనుల నిష్పత్తి జనాభా

నిష్పత్తికి దగ్గరగా వున్నాయి మొత్తం మీద తెలంగాణా రాష్ట్రంలో గ్రామీణ ప్రాంతాలలో రైతాంగంలోని పై వర్గాలలో వెనుకబడిన కులాలకు కూడా పట్టువున్న విషయాన్ని వివరాలు వెల్లడిస్తున్నాయి

రాష్ట్రంలో కౌలు పద్ధతి గుర్తించదగిన మోతాదులో వున్నది ప్రాంతాల వారీగా పరిశీలిస్తే సాపేక్షంగా ఉత్తర తెలంగాణలో కౌలుపద్ధతి కొంత ఎక్కువగా వున్నది

రాష్ట్రంలో రివర్స్ టెనెన్సీ బలంగా వున్నది భూస్వామ్య కమతాలలో 42 శాతం, ధనిక రైతు కుటుంబాలలో 37శాతం కౌలుకు చేస్తున్నారంటే, మొత్తం కమతాలలో భూస్వామ్య, ధనిక రైతు కమతాలు 6శాతం అయినప్పటికీ ఈ తరగతులు కౌలుదారీ కుటుంబాలలో 14శాతం వున్నారంటే, వీరి చేతుల్లో మొత్తం కౌలుభూమిలో 37.4 శాతం వుందంటే రివర్స్‌కౌలు ప్రాధాన్యత విధితం అవుతున్నది మధ్య తరగతిలో అత్యధికంగా 52శాతం కమతాలు కౌలు చేస్తున్నాయి అయితే మొత్తం కౌలు వ్యవస్థలో ప్రధాన పాత్ర మధ్యతరగతి, చిన్నకారు, సన్నకారు రైతులదే ఈ మూడు తరగతులు కలసి కౌలుదారీ కుటుంబాలలో 84 శాతం, కౌలుభూమిలో 62 3 శాతం కల్గి వున్నాయి.

ప్రాంతాల వారీగా పరిశీలిస్తే కౌలుదారీ పద్ధతి దక్షిణ తెలంగాణలో పోల్చి చూసినపుడు ఉత్తర తెలంగాణలో ముఖ్యంగా మధ్యస్థాయి రైతాంగంలో బలంగా వున్నదన్న విషయం స్పష్టంగా కన్పిస్తున్నది. మొత్తం కమతాలలో కౌలు కమతాల నిష్పత్తి 16 22 మాత్రమే వున్నది మాగాణి ప్రాంతంలో 12 84 శాతం వుంటే, మిశ్రమ, మెట్ట గ్రామాలలో వరుసగా 17 65%, 16 22% వుండటం గమనించదగ్గ విషయం

కౌలుదార్ల సంఖ్య నిష్పత్తి కూడా మిశ్రమ గ్రామాలలో ఎక్కువగా వున్నది కౌలు విధానం వరి పంటలో కన్నా ఇతర వ్యాపార పంటలలో ఎక్కువగా వున్నది

మొత్తం కౌలు భూమిలో 34.25% మిశ్రమ గ్రామాలలో వున్నది కుటుంబాల నిష్పత్తి కన్నా విస్తీర్ణం నిష్పత్తి చాలా ఎక్కువగా వున్నది.

వ్యవసాయ పనుల సీజన్లలో, పంటలలో వచ్చిన మార్పులు వివిధ రకాల పనిదినాల వినియోగంలో మార్పులు తెచ్చాయి దాదాపు అన్ని తరగతుల రైతులు మధ్యతరగతి, చిన్న,సన్నకారు రైతులు కూడా కూలీల శ్రమపై ఆధారపడటం పెరిగింది స్వచ్ఛంగా స్వంత శ్రమపై ఆధారపడటం, లేదా అచ్చంగా కూలికి వెళ్లడం లేదా కూలికి

పెట్టుకోవడం అనే పద్ధతి కన్నా, అవసరమైనపుడు కూలికి పెట్టుకుని స్వంత వ్యవసాయపనులు పూర్తి చేసుకోవడం, తదనంతరం ఇతరులకు కూలికి వెళ్లడం అనే పద్ధతి మధ్యతరగతి, పేదరైతుల్లో బాగా వ్యాపించిందని వివరాలు బలంగా వెల్లడిస్తున్నాయి.

అయితే అన్ని వర్గాల రైతులు, కూలీల శ్రమను వినియోగించుకుంటున్నప్పటికీ నికర కూలీ దినాలను పరిశీలిస్తే వివిధ వర్గాల గుర్తింపునకు పెట్టుకున్న శ్రమ కొలబద్దకు అనుగుణంగానే వివరాలు వున్నాయి కూలికి పెట్టుకున్న నికర పనిదినాలు భూస్వామ్య, ధనిక రైతులకు అధికంగా వున్నాయి కుటుంబ పనిదినాల కన్నా మించి వున్నాయి మధ్యతరగతి రైతులు కొద్ది మోతాదులో వున్నప్పటికీ వాటికన్నా స్వంత పని దినాలు అధికంగా వున్నాయి మిగిలిన సన్న,చిన్నకారు రైతులకు స్వంత శ్రమకు తోడు బయటకు కూలికి పోతున్న దినాలు అదనంగా వున్నాయి.

సన్నకారు రైతులు స్వంత భూమి మీద చేసే పనిదినాలు తక్కువగాను కూలీకి వెళ్ళేవి చాలా ఎక్కువగాను వున్నాయి దాదాపు ఈ తరగతి వ్యవసాయ కార్మికుల జీవితాలకు దగ్గరగా వున్నది.

గ్రామీణ శ్రామికులుగా వున్న వ్యవసాయ కార్మిక, మిశ్రమ శ్రామిక, వ్యవసాయేతర శ్రామిక కుటుంబాల సగటు కూలి పనిదినాలను పరిశీలిస్తే వ్యవసాయ కార్మిక కుటుంబాల కన్నా, మిశ్రమ, వ్యవసాయేతర శ్రామిక కుటుంబాల పనిదినాలు ఎక్కువ వున్నట్టు కన్పిస్తున్నది ప్రాంతాలవారీ జూసినా ఇదే ధోరణి కన్పిస్తున్నది

**అక్షరాస్యత**

గ్రామీణ ప్రాంతాల్లో అక్షరాస్యతలో చాలా వెనకడి ఉన్న విషయాన్ని సెన్సెస్ సర్వే వివరాలు కొట్టొచ్చినట్లు వెల్లడిస్తున్నాయి సర్వే గ్రామాల్లో 50 – 60 శాతం మధ్య అక్షరాస్యత కలిగి ఉన్నాయి ఒక్క చిన్న మారూరు గ్రామం మాత్రమే 68 శాతంతో రాష్ట్ర అక్షరాస్యత కన్నా ముందు ఉన్నది గంగదేవి పల్లి 66 శాతంతో రాష్ట్ర సగటుకు దగ్గరగా ఉన్నది. సామాజిక తరగతుల్లో వెనకబడిన కులాల్లో అన్ని స్థాయిల చదువులోనూ మిగిలిన తరగతులకన్నా వెనకంజలో ఉన్నారు దళితులకన్నా మెరుగైన ఆర్థిక స్థితి ఎక్కువ మందికి ఉన్నప్పటికీ చదువులో మాత్రం వెనకబడి ఉన్నారు. ముఖ్యంగా హైస్కూల్, ఆపై చదువులో ఈ విషయం స్పష్టంగా కనిపిస్తోంది. దళితులకు ప్రభుత్వపరంగా

ముందునుండీ ఉపకరావేతనాలు, సంక్షేమ హాస్టళ్లు మెరుగ్గా ఉండటం ఒక కారణం కావచ్చు ఎస్టీల్లో కూడా అక్షరాస్యత, పై చదువులు రెండింటిలోనూ వెనకబాటుతనం ఉంది ప్రభుత్వ అవకాశాలు కూడా ఈ తరగతి వినియోగించుకోలేకపోయిందని రుజువు అవుతోంది మధ్యతరగతి పేద రైతులుగా ఉన్న వారు కూడా చదువులో వెనకబడి ఉండటం గమనించాల్సిన విషయం

హైదరాబాద్‌ను మినహాయిస్తే అక్షరాస్యత విషయంలో రాష్ట్రం ఎంతగా వెనకబడి ఉందో అర్థమవుతుంది మొత్తం రాష్ట్రంలోనే గ్రామీణ ప్రాంతాల్లో చదువు నిర్లక్ష్యానికి గురైందని సర్వే వివరాలు స్పష్టం చేస్తున్నాయి చారిత్రక సామాజిక కారణాలు కొంతమేరకు కారణమైతే సుదీర్ఘకాలం పాటు రాష్ట్ర ప్రభుత్వ నిర్లక్ష్యం ఈ పరిస్థితికి ప్రధాన కారణంగా ఉంది

## నివాస పరిస్థితులు

గృహవసతి మొత్తం మీద అన్ని గ్రామాల్లో మెరుగ్గా ఉన్నట్లు వివరాలు తెలుపుతున్నాయి చిన్న చిన్న వ్యత్యాసాలు ఉన్నప్పటికీ సుమారు 90 శాతం కుటుంబాలకు స్వంత ఇంటి సౌకర్యం ఉన్నది అయితే సుమారు 30 శాతం కుటుంబాలకు పక్కా ఇళ్లు సమకూరలేదు ఈ సౌకర్యం లేని వారిలో అత్యధికులు దళితులు సార్వత్రికంగా విద్యుత్ సౌకర్యం కల్పించబడినట్లు ప్రభుత్వ గణాంకాలు చెప్తున్నప్పటికీ 10 శాతం కుటుంబాలు ముఖ్యంగా దళిత కుటుంబాలు విద్యుత్ సౌకర్యం లేకుండా ఉన్నారు అన్ని గ్రామాల్లో వ్యక్తిగత వాహనాల సంఖ్య గణనీయంగా కనిపిస్తోంది సుమారు 35 శాతం కుటుంబాలకు మోటార్‌సైకిళ్లు, స్కూటర్లు ఉన్నాయి భూస్వాములు, ధనిక రైతులు, మధ్యతరగతి రైతుల్లో కొన్ని కుటుంబాలకు ఈ వాహనాలను వినియోగించగల స్థోమత వచ్చినట్లు స్పష్టమవుతోంది అన్ని గ్రామాల్లోనూ సుమారు ఐదు కారు చొప్పున ఉండటం విశేషం వీటిలో సగం అద్దెకు తిప్పుకునేందుకు సమకూర్చుకున్నవే 70 శాతం కుటుంబాలకు టెలివిజన్‌లు ఉన్నాయి వ్యవసాయ కార్మికులు, దళితుల్లో టివి లేని కుటుంబాలు నేటికీ కనిపిస్తున్నాయి 80 శాతం కుటుంబాలకు సెల్‌ఫోన్లు ఉండటం గమనించాల్సిన విషయం కొత్త సాంకేతిక సాధనాలు గ్రామీణ కుటుంబాల్లో విస్తరింటం స్పష్టంగా కనిపిస్తోంది వంటగ్యాస్ దాదాపు 65 శాతం కుటుంబాలకు ఉన్నది దళిత కుటుంబాల్లో మాత్రం 60 శాతం కుటుంబాలు వంట చెరుకుపై ఆధారపడ్డాయి

మరుగుదొడ్ల విషయంలో పరిస్థితి ఇప్పటికీ అధాన్నంగానే ఉంది అన్ని గ్రామాలను కలిపి చూస్తే సగటు యాభై శాతం కుటుంబాలకు మరుగుదొడ్లు లేవు గంగదేవిపల్లి, వెంకటాపూర్ వంటి గ్రామాల్లో 80 శాతం పైగా మరుగుదొడ్లు ఉన్నప్పటికీ అత్యధిక గ్రామాల్లో పరిస్థితి హీనంగా ఉంది గిరిజనులు, దళితుల్లో చాలా కుటుంబాలకు మరుగుదొడ్ల సౌకర్యం ఏర్పడాల్సి ఉంది

పుస్తకంలో విశ్లేషించబడిన 22 గ్రామాల వివరాలను పరిశీలిస్తే రాష్ట్రంలో వ్యవసాయ రంగం ఎంత వైవిధ్యంతోనూ, సంక్లిష్టతతోనూ ఉన్నదో అర్థమవుతుంది అలాగే పరిస్థితులు స్థిరంగా కూడా ఉండటం లేదని గత గ్రామ సర్వేలతో పోల్చి చూస్తే మనకు కనపడుతోంది ఉద్యమ కార్యకర్తలెవరైనా ఈ ప్రత్యేకతలను గమనంలో ఉంచుకుని ఎవరికి వారు తాము పని చేస్తున్న ప్రాంతంలో నిర్దిష్టంగా గ్రామ అధ్యయనానికి నిరంతరం పూనుకుంటేనే ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్లగలరు ఈ పుస్తకం కార్యకర్తలకు కరదీపికగా ఉపయోగ పడుతుంది

ఈ అధ్యయాన్ని చేపట్టి అటు పరిశోధకులకూ ఇటు కార్యకర్తలకు సుందరయ్య విజ్ఞాన కేంద్రం ఎంతో మేలు చేసింది ఈ అధ్యయనాల్లోని సమాచారానికి తగినంత విలువనిచ్చి పాలకులు వినియోగించుకుంటే రాష్ట్రాభివృద్ధికి అవసరమైన నిర్ణయాలను తీసుకోవచ్చు అయితే భూస్వామ్య, గ్రామీణ ధనిక వర్గాల ప్రయోజనాలు కాపాడే పాలకులు ఆ పని చేస్తారని ఆశించలేము ఉద్యమాలే ప్రభుత్వంపై ఆ ఒత్తిడి తీసుకురావల్సి ఉంటుంది

ఈ సర్వేలో ఇప్పటి వరకు చురుగ్గా పాల్గొన్న మేధావులకు, కార్యకర్తలకు, నాయకులకు ఈ ప్రాజెక్టును చేపట్టిన సుందరయ్య విజ్ఞాన కేంద్రం, వ్యవసాయ కార్మిక సంఘం, రైతు సంఘాలకు అభినందనలు.

**- బి.వి. రాఘవులు**

# మెదక్ జిల్లా

## రాయిపల్లి-డి

గ్రామీణ ముఖచిత్రం

సుందరయ్య విజ్ఞాన కేంద్రం 2013-2014 సంవత్సరంలో నిర్వహించిన గ్రామీణ సామాజిక ఆర్థిక సర్వేలో భాగంగా రాయిపల్లి -డి గ్రామాన్ని రెండుసార్లు సర్వే నిర్వహించడం జరిగింది

దక్షిణ తెలంగాణ ప్రాంతంలోని మెదక్ జిల్లా జహీరాబాద్ మండలంలో రాయిపల్లి డి గ్రామం ఉన్నది మండల కేంద్రానికి 12 కిలోమీటర్ల దూరంలో ఉంది రవాణా ప్రధానంగా ఆటోల ద్వారా జరుగుతుంది. గ్రామానికి సుమారు కిలోమీటరుకు దూరంలో హైవే రోడ్డు ఉంటుంది అక్కడి వరకు బస్సులు వస్తాయి ఈ గ్రామంలో రెండు రకాల భూములున్నాయి అసైన్డ్ (ప్రభుత్వ) భూములు ఎస్సీలకు ఉన్నాయి ఇవి వర్షాధార ఎర్రమట్టి భూములు ఇవి తక్కువ ధర పలుకుతాయి ఒసిలకు నల్లమట్టి భూములు ఇవి హైవే రోడ్డుకు ప్రక్కనే ఉన్నాయి వీటి విలువ బాగా ఎక్కువగా ఉంటుంది వ్యవసాయానికి ప్రధానంగా బోరుబావులే ఆధారం ప్రధానంగా చెరకు, వరి, పసుపు, మొక్కజొన్న, కంది, బంగళాదుంప పంటలు పండిస్తారు వర్షాధార పంటలు కూడా వేస్తారు ఒక ఆర్ఎంపి డాక్టర్ ఉన్నాడు మంచినీటి వాటర్ ట్యాంకు, పంచాయితీ భవనం, మాల, మాదిగలకు మాత్రమే కమ్యునిటీ భవనాలున్నాయి ప్రైమరీ స్కూల్ వుంది ఇది గతంలో 7వతరగతి వరకు వుండేది సౌకర్యాలు వున్నా ప్రస్తుతం 5వ తరగతి వరకే వుంది స్కూల్లో అత్యధికంగా ఎస్సీ, ఎస్టీ, బిసిలకు చెందినవారే వున్నారు ఊర్లోకి 9 రకాల ప్రవేటుస్కూల్ బస్సులు గ్రామానికి వస్తాయి విద్యార్థులు వెల్తారు రేషన్ షాపు, అంగన్‌వాడీ సెంటర్లు ఉన్నాయి సహకారసంఘం ఉంది

గ్రామంలో సుమారు 10 కిరాణాకొట్లు ఉన్నాయి కొన్నింట్లో మద్యం కూడా అమ్ముతారు చెరకు నరికే సీజన్‌లో కూలీలు మూడు నుంచి నాలుగు నెలల వరకు

గ్రామంలోనే వుంటారు చెరకుకు దగ్గరలో మార్కెట్‌సౌకర్యం లేక అధిక రవాణా ఖర్చులో ఇబ్బంది పడుతున్నారు ఎక్కువగా అప్పు ఇచ్చిన యాజమానికే పంటను అమ్మడం, కూలీకి వెళ్ళడం జరుగుతుంది తక్కువ డబ్బు తీసుకుంటే ఎక్కువ, ఎక్కువ డబ్బు తీసుకుంటే తక్కువ వడ్డీ వుంటుంది దేవాలయాలు, చర్చి, మసీద్ ఉన్నాయి

**జనాభా వివరాలు**

మా సర్వే ప్రకారం మొత్తం 294 కుటుంబాలు ఉన్నాయి మొత్తం జనాభా 1427 పురుషులు 726, స్త్రీలు 701 ప్రతి వెయ్యి మంది పురుషులకు 966 స్త్రీలు ఉన్నారు ఇది రాష్ట్ర నిష్పత్తి(988)తో ,జిల్లా నిష్పత్తి (1000)తో పొల్చితే చాలా తక్కువగా వుంది ఇది ప్రమాదకరం. మతాల వారిగా చూస్తే హిందువులు 63%, క్రిస్టియన్స్ 32%, ముస్లింలు 5% ఉన్నారు గ్రామంలో 16 నుండి40 సంవత్సరాల మధ్య వయస్సు గల యువత 49% ఉన్నారు. పనిచెయ్యగల వయస్సు వారు 16నుండి 60 ఏళ్ళ మధ్య వున్నవారు 66% వున్నారు సామాజిక తరగతుల వారీగా జనాభాను పరిశీలిస్తే ఎస్సీలు 51%, ఎస్టీ 3%, బిసిలు 31%, ఒసిలు 14% ఉన్నారు అంటే మొత్తం జనాభాలో ఎస్సీ సామాజిక తరగతే సగానికి పైగా ఉన్నది

**సామాజిక పొందిక**

ఈ గ్రామంలో మొత్తం కుటుంబాలు 294 స్త్రీ యాజమాని గల కుటుంబాలు 43 (15%) వున్నాయి సామాజిక తరగతుల వారీగా పరిశీలిస్తే ఎస్సీ కుటుంబాలు 150(51%), ఎస్టీ కుటుంబాలు 8(3%), బిసిలు 31%, ఒసిలు 15% కుటుంబాలు ఉన్నాయి కులాలవారీగా పరిశీలిస్తే మాదిగ 118(40%), మాల 32(11%), రెడ్డి 37(13%), యాదవ 27(9%), ఎరుకల 8(3%), ముదిరాజ్ 8(3), ముస్లిం 11(4%), విశ్వబ్రాహ్మణ, నాయిబ్రాహ్మణ, పద్మశాలి, రజక, కుమ్మరి 4 చొప్పున, కురుమ ఒక కుటుంబం, ఇతరులు 21(7 14%) ఉన్నారు గ్రామంలో మాదిగ కుటుంబాలే ఎక్కువగా వున్నాయి

**జీవనోపాధి**

ప్రధానంగా కుటుంబం ఏ వృత్తివల్ల గడుస్తుందో పరిశీలిస్తే వ్యవసాయం 186, వ్యవసాయకూలీ 46, వ్యవసాయేతరకార్మికులు 16, కౌలు, వృత్తులు, ఆటోడ్రైవర్లు, ప్రభుత్వ

ఉద్యోగులు, ప్రైవేట్ ఉద్యోగులు 4 చొప్పున, స్వయం ఉపాధి 3, పాలేర్లు, ట్రైలర్ ఒక్కొక్కటి 16 కుటుంబాలు ఇతర పనులు చేస్తున్నాయి

**పశుసంపద**

గ్రామంలో పశుసంపద 308 వుంది ఎద్దులు 55, గేదెలు,ఆవులు 122, గొర్రెలు, మేకలు 131 వున్నాయి ఎద్దులు ఎస్సీ, ఎస్టీ ,బిసిలకే వున్నాయి ఒసిలకు లేవు అత్యధికంగా మధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతులకే వున్నాయి ఎద్దుల కంటే గేదెలు,ఆవులు పెంచడం లాభదాయకం కాబట్టి అన్ని సామాజిక, ఆర్థిక తరగతులు కలిగి వున్నాయి అత్యధికంగా గొర్రెల సంఖ్యరీత్యా, కుటుంబాల రీత్యా ఎస్సీలలోనే ఎక్కువ వున్నాయి

**సాగుభూమి**

సర్వే సమాచారం ప్రకారం మొత్తం 785 యకరాల సాగుభూమి ఉంది 569 యకరాలకు సాగునీటివసతి వుంది 216 యకరాలకు నీటి వసతి లేదు దీనికి వర్షమే ఆధారం నికరంగా సాగుచేస్తున్న భూమిని పరిశీలిస్తే 2 శాతం గల భూస్వాములు 13% భూమిని సాగుచేస్తున్నారు అలాగే 9% గల ధనికరైతులు 24% భూమి సాగు చేస్తున్నారు 11 శాతంగా వున్న పై రెండు వర్గాలు 37% భూమిని సాగుచేస్తున్నారు 72శాతంగా వున్న మధ్యతరగతి, చిన్నకారు సన్నకారు రైతులు 62% భూమిని మాత్రమే సాగచేస్తున్నారు 11 శాతంగా వున్న వ్యవసాయకార్మికులు సాగుచేసేది దాదాపు శూన్యం

**కౌలుసేద్యం**

గ్రామంలో 294 కుటుంబాలలో కౌలు చేస్తున్న కుటుంబాలు 31 (11%) ఉన్నాయి వీరు సాగుచేస్తున్న భూమి 95 యకరాలు ముగ్గురు భూస్వాములు, ఏడుగురు ధనికరైతు కుటుంబాలు కలిసి 58 ఎకరాలు కౌలు చేస్తుండగా, 21 మధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతుకుటుంబాలు కలిసి 37 ఎకరాలు మాత్రమే కౌలు చేస్తున్నారు కౌలు భూమిలో 61% భూస్వాములు, ధనిక రైతులే తీసుకున్నారు. దీన్నిబట్టి గ్రామంలో రివర్స్ కౌలు అధికంగా ఉన్నట్లు తెలుస్తున్నది గ్రామంలో కౌలుకు ఇచ్చినవారిలో మధ్య, చిన్న, సన్నకారు, వ్యవసాయకార్మికులు, వ్యవసాయేతరకార్మికులు వృత్తిదారులు వున్నారు దళిత, బిసిలకు స్వంత భూములు తక్కువ ఉండటం వల్లనే ఎక్కువ భూమి కౌలుకు చేస్తున్నది బిసిల తర్వాత దళితుగే ఉన్నారు

### వర్గ పొందిక

గ్రామంలోని కుటుంబాలను వర్గీకరించేటపుడు నికర సాగుభూమిని ప్రామాణికంగా తీసుకున్నాం ఆ ప్రకారం మొత్తం కుటుంబాల వర్గీకరించి చూస్తే భూస్వాములు 2%(7), ధనికరైతులు 9%(27), మధ్య తరగతి రైతులు 31% (91), చిన్నకారురైతులు 28%(83), సన్నకారురైతులు 13%(37), భూమిలేని వ్యవసాయ కార్మికులు 10%(29), కొంచెం భూమి కలిగిన వ్యవసాయ కార్మికులు 2, వృత్తిదారులు 1, స్వయంఉపాధి 2, ఉద్యోగులు 4, వ్యాపారాలు1, ఇతరులు 3, వ్యవసాయేతర కార్మికులు 7 కుటుంబాలు వున్నాయి ఈ గ్రామంలో భూస్వామ్య, ధనికరైతు కుటుంబాలు గణనీయంగానే వున్నాయి వ్యవసాయ కార్మికుల సంఖ్య తక్కువగా కన్పడుతున్నది

### భూకేంద్రీకరణ

గ్రామంలో భూకేంద్రీకరణను పరిశీలించినపుడు స్వంత భూమిని ఆధారంగా తీసుకున్నాం. భూమి కలిగివున్న మొదటి 5% కుటుంబాల చేతిలో 22% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 25% భూమి మాత్రమే వుంది 28% కుటుంబాలకు సెంటుభూమి లేకపోవడం గమనించవచ్చు 2% ఉన్న భూస్వాముల చేతిలో 12శాతం, 9 శాతంగా వున్న ధనికరైతుల చేతిలో 23% భూమి ఉంది అంటే కేవలం 11% గల పై రెండు వర్గాల చేతిలో గ్రామంలోని మొత్తం భూమిలో 35% భూమి కేంద్రీకృతమై వున్నదని తెలుస్తుంది మధ్య తరగతి, చిన్న, సన్నకారు రైతులు కలిసి 72% వుంటే 65% భూమిని కలిగి వున్నారు వ్యవసాయ కార్మికులు 11% ,వృత్తిదారులు ఒక కుటుంబం, వ్యవసాయేతర కార్మికులు, స్వయం ఉపాధి, ఉద్యోగులు, వ్యాపారులు, ఇతరులకు సెంటు భూమి లేదు

సామాజికంగా పరిశీలిస్తే గ్రామంలో మొత్తం భూమిలో 51% గల ఎస్సీల చేతిలో 40% భూమి మాత్రమే ఉంది ఈ భూమి కూడా ఎస్సీలలో 79% వారికే ఉంది మిగిలిన 21% కుటుంబాలకు భూమి లేదు 3% గల ఎస్టీల చేతిలో 5% భూమి ఉంది. 31% గల బిసిల చేతిలో 34 శాతం భూమి ఉంది వీరు కూడా వారి దామషా కంటే ఎక్కువే భూమినే కలిగి ఉన్నారు ఇది బిసిలలో 85% వారికే వుంది మరో 15% కుటుంబాలకు పూర్తిగా భూమి లేదు 15 శాతంగా వున్న ఒసిల చేతిలో 21% భూమి కేంద్రీకృతమై ఉంది. అయినా ఒసిలలో కూడా భూమిలేని వారు 9% వున్నారు.

## అక్షరాస్యత

గ్రామ అక్షరాస్యత 59% ఉంది పురుషులలో అక్షరాస్యత 68%, స్త్రీలలో 49% శాతం వుంది ఎస్టీ, బిసి లలో స్త్రీల అక్షరాస్యత చాలా తక్కువగా వుంది ఇది జిల్లా అక్షరాస్యత 61% కంటే తక్కువగా వుంది ఒసి కుటుంబాలలో అక్షరాస్యత 72 శాతం, బిసిలలో 60%, ఎస్సీ, ఎస్టీలలో దాదాపు సమానంగా 55శాతం ఉంది ఎస్సీ, ఎస్టీలలో గ్రామ సగటు అక్షరాస్యత (59%) శాతం కంటే తక్కువగా ఉండటాన్ని మనం గమనించవచ్చు అదే సందర్భంలో మెదక్ జిల్లాలో ఎస్సీ 53%, ఎస్టీ 45% అక్షరాస్యత సగటు కంటే గ్రామ ఎస్సీ, ఎస్టీల అక్షరాస్యత ఎక్కువ వుండటం మంచి పరిణామం

గ్రామంలో సెకండరీ విద్య చదివినవారు 26శాతం వున్నారు వీరు ఒసిలలో అధికంగా 38% వుంటే, బిసిలలో 27%, ఎస్సీలలో 23% అతితక్కువగా ఎస్టీలలో కేవలం 19% మాత్రమే వున్నారు ఇంటర్ చదివినవారు అన్ని తరగతులలో తగ్గినప్పటికి అదే తరహా తారతమ్యలు కొనసాగాయి డిగ్రీ చదివినవారు 4శాతం వున్నారు డిగ్రీ చదివిన వారిలో ఒసిలలో ఎస్సీ, ఎస్టీలకంటే 1 5 రెట్లు, బిసిల కంటే 2 5 రెట్లు ఎక్కువగా వున్నారు ఇక్కడ ఎస్సీ, ఎస్టీల కంటే బిసిలు వెనకబడి వున్నారు. పిజి చదివిన వారిని చూస్తే ఎస్టీలలో పూర్తిగానే లేకుండా పోగా, ఒసిలలో మాత్రమే ఉన్నారు ఎస్సీ, బిసిలలో నామమాత్రంగా ఉన్నారు దీనికి కారణం వారి ఆర్థిక స్థితి సరిపోవడంలేదు

## ఆయుఃప్రమాణం

గ్రామంలో మొత్తంగా 70 సంవత్సరాలకు పైబడిన వారు పరిశీలిస్తే ఎస్సీ, బిసిల కంటే ఒసిలు ఎక్కువగా ఉన్నారు ఇక్కడ విశేషమేమిటంటే బిసిలు, ఎస్సీల కంటే కూడా వెనుకబడి ఉన్నారు 60 నుండి 70 సంవత్సరాల మధ్య వున్నవారిని పరిశీలించినా ఒసిలు ఇతరులకంటే అధికంగానే ఉన్నారు వారి తర్వాత బిసిలు ఉన్నారు. ఆర్థిక స్థితిగతులతు, ఇతరత్రా కారణాల వల్ల ఎక్కువ సంవత్సరాలు జీవించగలుగుతున్నారు

## గృహాలు - మౌలిక సదుపాయాలు

పక్కా ఇల్లు కల్గిన వారు గ్రామంలో 86%న్నారు పక్కా ఇల్లు సామాజిక తరగతులు పరిశీలిస్తే ఒసిలు 93% కుటుంబాలకు ఉన్నాయి ఎస్సీ, ఎస్టీలు 87% కుటుంబాలు కలిగి ఉన్నాయి తక్కువగా బిసిలు 80% కుటుంబాలు మాత్రమే కల్గివుండి అందరికంటే వెనకబడి ఉన్నారు

గ్రామంలో 6 ట్రాక్టర్లు వున్నాయి వాటిలో మూడు ఒసిలవి, రెండు ఎస్సీలవి వీరిలో ముగ్గురు భూస్వామ్య, ధనికరైతులు కాగా, ఇద్దరు మధ్యతరగతి రైతులు గ్రామం మొత్తంగా చూస్తే 30% కుటుంబాలకు సైకిళ్ళు వున్నాయి సైకిల్ ఉన్న కుటుంబాలు ఎస్టీలలో 50%,ఎస్సీలలో 37% కుటుంబాలకు వున్నాయి స్కూటర్లు, బైక్ సౌకర్యం గల వారిని పరిశీలిస్తే 29% కుటుంబాలకు ఈ సౌకర్యం ఉంది సామాజిక తరగతుల వారిగా పరిశీలిస్తే ఎస్సీలు, ఒసిలు దాదాపు సమానంగా 15% కలిగి వున్నారు. వీరిలో చాలామంది జహీరాబాద్‌కు రోజువారిగా పనులకోసం తిరిగే వారు కూడా ఉన్నారు

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 22% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 25% భూమి మాత్రమే వుంది.**

**28% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

గ్రామంలో మొత్తంగా చూస్తే ఎస్సీ, బిసి, ఒసిలకు ఒక్కొక్కటి చొప్పున కార్లు వున్నాయి ఎస్టీలకు పూర్తిగానే లేవు ఎస్సీ, బిసిలకు సమానంగా 5 చొప్పున ఆటోలు వున్నాయి ఒసి, ఎస్టీలకు లేవు అన్ని ఉపాధి కోసం నడుపుకునే ఆటోలే. టి వి సౌకర్యం గల కుటుంబాల శాతం 74గా వుంది. ఎస్సీలకు 75%, ఒసిలకు 82% కుటుంబాలు టి విని కలిగివున్నాయి

మరుగుదొడ్లు కలిగి ఉన్న కుటుంబాలు 50% ఉన్నాయి సామాజిక తరగతుల వారిగా పరిశీలిస్తే ఒసి కుటుంబాలు 69% కల్గివుంటే, ఎస్టీలు 37% కుటుంబాలు మాత్రమే ఈసౌకర్యం కలిగివున్నాయి కరెంటు సౌకర్యం గల కుటుంబాలు 94 శాతం ఉన్నాయి. అత్యధికంగా ఒసిలు 98% కుటుంబాలు కరెంటు సౌకర్యం కల్గి ఉన్నాయి ఎస్టీలు 87% మాత్రమే కల్గి వున్నారు సెల్‌ఫోన్ సౌకర్యం గల కుటుంబాలు 87% ఉన్నాయి. అత్యధికంగా ఒసిలు 98% కల్గి ఉంటే, ఎస్టీలు75% కుటుంబాలకు మాత్రమే సెల్‌ఫోన్స్ ఉన్నాయి గ్యాస్ సౌకర్యం గల కుటుంబాలు 47% ఉన్నాయి ఒసిలకు 78% కుటుంబాలకు గ్యాస్ సౌకర్యం ఎస్సీలకు కేవలం 38% కుటుంబాలకే ఉంది అందరికంటే చాలా తక్కువగా ఎస్టీలకు 12% కుటుంబాలకు మాత్రమే వుండటం గమనించాలి

# నల్లగొండ జిల్లా

## ఆచార్యుల గూడెం

సుందరయ్య విజ్ఞాన కేంద్రము ఆధ్వర్యములో 2013-14లో నిర్వహించిన గ్రామీణ ఆర్థిక సర్వేలో భాగంగా నలగొండ జిల్లాలోని ఆచార్యులగూడెం గ్రామాన్ని 2013 డిశంబరులో తొలి విడత, 2014 ఫిబ్రవరిలో మలి విడత సర్వే చేయటం జరిగింది దక్షణ తెలంగాణ ప్రాంతానికి చెందిన నల్లగొండ జిల్లాలోని ఆచార్యుల గూడెం గ్రామములో గ్రామీణ-ఆర్థిక సామాజిక సర్వే నిర్వహించాము గ్రామము మండల కేంద్రానికి 12 కిలోమీటర్ల దూరంలో ఉన్నది కోదాడ పట్టణానికి దగ్గరగా వుంటుంది 65వ జాతీయ రహదారి 10 కిలోమీటర్ల దూరంలో ఉన్నది అక్కడి నుండి గ్రామానికి ప్రైవేటు జీపులు, ఆటోల ద్వారా ప్రయాణాలు సాగుతుంటాయి గ్రామములో ప్రాథమిక పాఠశాల, హైస్కూలు, అంగన్‌వాడీ కేంద్రము, ప్రాథమిక ఆరోగ్య చికిత్సా కేంద్రము, పోస్టాఫీసుతోపాటు విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్, పంచాయితీ ఆఫీసు, చౌకధరల దుకాణం, గ్రామీణ తాగునీటి వసతి సౌకర్యము ఉన్నది సాగర్ కాలువ ద్వారా ఎక్కువ భూమి సాగుచేస్తున్నారు తక్కువ భాగము బోర్‌వెల్స్ ద్వారా సాగుచేస్తున్నారు వరి పంట ప్రధానమైనదిగా ఉన్నది

**జనాభా వివరాలు**

గ్రామములో మొత్తం జనాభా1177 కాగా, అందులో పురుషులు 596, స్త్రీలు 581 మంది ఉన్నారు మొత్తం జనాభాలో పురుషులు 51%, స్త్రీలు 49% ఉన్నారు స్త్రీ, పురుషుల లైంగిక నిష్పత్తి 975 గా ఉన్నది అనగా ప్రతి వెయ్యి మంది పురుషులకు 975 మంది స్త్రీలున్నారు దళితుల్లో లైంగిక నిష్పత్తి 872గా ఉన్నది వెనుకబడిన తరగతులలో 1024, అగ్రకులాలలో 918గా ఉన్నది 2011 జనాభా

లెక్కల ప్రకారం లైంగిక నిష్పత్తి 988 గా నమోదైంది ఈ నిష్పత్తితో గ్రామ లైంగిక నిష్పత్తి తక్కువగా ఉన్నది దళితులు, అగ్రకులాలలో రాష్ట్ర లైంగిక నిష్పత్తితో తగ్గినది బిసిలలో ఈ నిష్పత్తి రాష్ట్ర సగటు కంటే ఎక్కువగా ఉన్నది గ్రామంలో 66 (21%) కుటుంబాలు దళితులు, 207(64%) కుటుంబాలు వెనుకబడిన తరగతులు, 48 (15%) కుటుంబాలు అగ్రకులాలకు చెందినవిగా ఉన్నాయి గ్రామంలో ఎక్కువకాలం జీవిస్తున్న జనాభా (60 ఆపైన వయసు గల జనాభా) 12% ఉన్నారు దళితులు, అగ్రకులాల కంటే వెనుకబడిన తరగతుల్లో దీర్ఘకాలం జీవిస్తున్న జనాభా ఎక్కువగా ఉన్నది

**సామాజిక పొందిక – జీవనోపాధి**

గ్రామములో ముదిరాజ్, మాదిగ, రెడ్డి, కుమ్మరి, రజక, విశ్వబ్రాహ్మణ, గౌడు, వైశ్య, యాదవ, నాయిబ్రాహ్మణ కులాలు ముఖ్యమైనవిగా ఉన్నాయి ముదిరాజ్ కులానికి చెందిన కుటుంబాలు 83(26%) ఉన్నాయి. 44కుటుంబాలు రైతులుగా, 21 కుటుంబాలు వ్యవసాయ కార్మికులుగా, 18 కుటుంబాలు వ్యవసాయేతర వృత్తుల ద్వారా ఉపాధి పొందుతున్నాయి మాదిగ కులానికి చెందిన 13(21%) కుటుంబాలు రైతులుగా, 27 కుటుంబాలు వ్యవసాయ కార్మికులుగా, 22 కుటుంబాలు వ్యవసాయేతర వృత్తుల ద్వారా ఉపాధి పొందుతున్నాయి. మొత్తం మాదిగ కుటుంబాలు 62(19%) ఉన్నాయి వ్యవసాయ కార్మికులు అధిక శాతం ఈ కులంలో ఉన్నారు రెడ్డి కులానికి చెందిన 32 కుటుంబాలు రైతులుగా, 6 కుటుంబాలు వ్యవసాయ కార్మికులుగా, మరో కుటుంబం వ్యాపారం ద్వారా ఉపాధి పొందుతున్నది. గ్రామములో మొత్తం కుటుంబాలు 39 ఉన్నాయి. రైతు కుటుంబాల శాతాలు ఈ కులంలో ఎక్కువగా ఉంటే, వ్యవసాయ కార్మికులు తక్కువ శాతం ఉండటం గమనార్హం. ఈ కులానికి చెందిన మరో కుటుంబం వ్యాపారం ద్వారా ఉపాధి పొందుతున్నది 12% కుటుంబాలు ఈ కులానికి చెందివిగా ఉన్నాయి కుమ్మరి కులములో 25(8%) కుటుంబాలు ఉన్నాయి 15 కుటుంబాలు రైతులుగా, 7కుటుంబాలు వ్యవసాయ కార్మికులుగా, మూడు కుటుంబాలు వ్యవసాయేతర వృత్తుల ద్వారా ఉపాధి పొందుతున్నాయి రజక కులములో 23 (7%) కుటుంబాలున్నాయి 13 కుటుంబాలు రైతులుగా, నాలుగు కుటుంబాలు వ్యవసాయ కార్మికులుగా, 6కుటుంబాలు వ్యవసాయేతర వృత్తుల్లో ఉన్నాయి. సాంప్రదాయక వృత్తి కులమైన విశ్వ బ్రాహ్మణుల్లో 3కుటుంబాలు కుల వృత్తిపై ఆధారపడినవి 3కుటుంబాలు రైతులుగా, 6కుటుంబాలు వ్యవసాయేతర కుటుంబాలు, 5కుటుంబాలు వ్యవసాయేతర వృత్తుల్లో

ఉన్నాయి విశ్వ బ్రాహ్మణులు మొత్తం కుటుంబాలు 14(4%) ఉన్నాయి గౌడుకులానికి చెందిన మొత్తం 13 కుటుంబాలలో 6కుటుంబాలు రైతులుగా, రెండు కుటుంబాలు వ్యవసాయ కార్మికులుగా, రెండు కుటుంబాలు సాంప్రదాయ వృత్తిలో, మరో మూడు కుటుంబాలు వ్యవసాయేతర వృత్తుల్లో ఉన్నాయి వైశ్య కులములో మొత్తం 8కుటుంబాలున్నాయి. 5కుటుంబాలు రైతులుగా, 2కుటుంబాలు వ్యవసాయ కార్మికులుగా, ఒక కుటుంబం వ్యాపారం నిర్వహిస్తున్నాయి యాదవ కులములో 6కుటుంబాలు రైతులుగా, రెండు కుటుంబాలు వ్యవసాయేతర వృత్తుల ద్వారా ఉపాధి పొందుతున్నాయి నాయీబ్రాహ్మణుల్లో ఒక కుటుంబం చిన్న రైతుగా, రెండు కుటుంబాలు వ్యవసాయేతర వృత్తుల్లో ఉన్నారు మహిళలు కుటుంబ యజమానులుగా వున్న కుటుంబాలు గ్రామంలో 45 (14%) వున్నాయి

అక్షరాస్యత

గ్రామంలో అక్షరాస్యత 69%ఉన్నది. పురుషుల అక్షరాస్యత 79%కాగా, స్త్రీల అక్షరాస్యత 60%గా ఉన్నది దళితుల అక్షరాస్యత 64%, వెనుకబడిన తరగతుల అక్షరాస్యత 70%,అగ్రకులాలకు చెందిన అక్షరాస్యత 74%గా ఉన్నది అన్ని సామాజిక తరగతుల్లో కంటే అగ్రకులాలలో అక్షరాస్యత శాతం అధికంగా ఉన్నది అక్షరాస్యతల్లో (పురుష్తులు, స్త్రీల అక్షరాస్యతలు) మెరుగ్గా ఉన్నది 2011 లెక్కల ప్రకారం గ్రామీణ ప్రాంత అక్షరాస్యత 57%ఉంటే, పురుషుల అక్షరాస్యత 75%, స్త్రీల అక్షరాస్యత 58% ఉన్నది. అన్ని సామాజిక తరగతుల్లో కూడా రాష్ట్ర సగటుతో పోల్చినపుడు అక్షరాస్యత మెరుగ్గా ఉ న్నది ప్రాథమిక పాఠశాల స్థాయి వరకు చదువుకున్నవారు 21% ఉన్నారు ఇంటర్ వరకు చదువుకున్న వారు 9% ఉన్నారు వెనుకబడిన తరగతుల్లో 10% జనాభా ఇంటర్ వరకు చదువుకున్నారు డిగ్రీ చదివిన వారు 11%ఉన్నారు బీఎడ్ చదివిన వారు గ్రామములో 13మంది వున్నారు దళితుల్లో నలుగురు,వెనుకబడిన తరగతుల్లో 8, అగ్రకులాల్లో ఒకరు బీఎడ్ చదివారు. పీజీ చదివిన వారు గ్రామములో 33 మంది ఉన్నారు.

సాగుభూమి - విస్తీర్ణము

సాగునీటి వసతిగల భూమి గ్రామములో550.775ఎకరాలు ఉన్నది 6 75ఎకరాలు వర్షాధార భూమి,1 25ఎకరాలు బీడుభూమి ఉన్నట్లుగా నమోదైనది.

మొత్తం భూమి 538.775 ఎకరాలు ఉన్నది 163.375 ఎకరాలు సాగునీటి వసతి గల కౌలుభూమిగా, 2ఎకరాలు వర్షాధారమైన కౌలుభూమిగా,మొత్తం 165.375ఎకరాల కౌలుభూమిగా నమోదైనది 78 2 ఎకరాల సాగునీటి వసతిగలభూమి,1 5ఎకరాలు వర్షాధార భూమి కౌలుకు ఇచ్చినట్లుగా నమోదైనది మొత్తం 79 7 ఎకరాల భూమిని కౌలు కిచ్చినట్లుగానమోదైనది మొత్తం కౌలుభూమి విస్తీర్ణం కౌలుకిచ్చిన భూ విస్తీర్ణంతో పోలిస్తే ఎక్కువగా ఉన్నది ఆ మేరకు ఎక్కువగా వున్న భూమి తాలూకు వివరాలు చెప్పకపోవడమో,లేదా పక్కా గ్రామాల శివారు భూమైనా అయి ఉండవచ్చు

## స్వంతభూమి - యాజమాన్యం

గ్రామంలో 188(59%) కుటుంబాలకు స్వంత భూమి ఉన్నది 133 కుటుంబాలకు (41%) లేదు దళితుల్లో 18(27%)కుటుంబాలుకు స్వంతభూమి ఉన్నది వెనుకబడిన తరగతుల్లో 128(62%) కుటంబాలకు , అగ్రకులాలకు 42 (88%) కుటుంబాలకు స్వంతభూమి ఉన్నది. 15%కుటుంబాలు మాత్రమే ఉన్న అగ్రకులాలలో 87 50%కుటుంబాలు స్వంతభూమిని కలిగి వుంటే, 21%కుటంబాలున్న దళితుల్లో 27%కుటుంబాలు మాత్రమే స్వంతభూమిని కలిగి వున్నాయి అన్ని సామాజిక తరగతుల కంటే ఎక్కువ శాతం కుటుంబాలు (64%) వున్న వెనుకబడిన తరగతుల్లో 62%కుటుంబాలకు మాత్రమే భూయాజమాన్యం ఉన్నది మొత్తం భూమిలో 4%భూమిని దళితులు కలిగి వున్నారు 58%భూమిని వెనుకబడిన తరగతులు, 38%భూమిని అగ్రకులాలకు చెందిన కుటుంబాలు కలిగి వున్నాయి సామాజిక తరగతులలో ఒక కుటుంబానికి వున్న భూమి వివరాలు ఈ క్రింది విధంగా వున్నాయి దళితుల్లో ఒక కుటుంబానికున్న భూమి (సగటు)0 30ఎకరాలు, వెనుకబడిన తరగతుల్లో 1 52 ఎకరాలు, అగ్రకులాలల్లో 4 27 ఎకరాలు వస్తుంది ఒక దళిత కుటుంబానికున్న భూపరిమాణముతో 14 రెట్లు అధికంగా అగ్రకులాలకు చెందిన భూమి ఉన్నది వెనుకబడిన తరగతులు, దళితులతో 5 రెట్లు అధికంగా భూమి కలిగి వున్నాయి వెనుకబడిన తరగతులకు చెందిన ఒక కుటుంబ భూ కమతంతో అగ్రకులాలకు చెందిన ఒక కుటుంబ భూకమతంతో 2 82 రెట్లు అధికంగా ఉన్నది

రెడ్డి కులానికి చెందిన 35 కుటుంబాలకు 90% స్వంత భూమి ఉన్నది 4 కుటుంబాలకు భూమిలేదు మొత్తము భూమిలో 36% భూమిని కలిగి వున్నాయి మొత్తం 8 వైశ్య కుటుంబాలలో 7 కుటుంబాలకు (87%), యాదవ కులములో

6 కుటుంబాలకు, రజక కులంలో 16 కుటుంబాల (70%)కు, ముదిరాజ్ కులములో 55 కుటుంబాలకు (66%), విశ్వ బ్రాహ్మణ కులంలో 6 కుటుంబాలకు (43%), కుమ్మరి కులములో 10 కుటుంబాలకు (40%), నాయి బ్రాహ్మణ కులంలో ఒక కుటుంబానికి, గౌడు కులంలో 4 కుటుంబాల (31%)కు, మాదిగ కులములో 16 కుటుంబాల (26%)కు స్వంత భూమి ఉన్నది గ్రామంలోని మొత్తం కుటుంబాలలో 12% ఉన్న రెడ్డి కులంలో 90% కుటుంబాలకు స్వంత భూమి యాజమాన్యం ఉంటే, 19% ఉన్న మాదిగలలో 26% కుటుంబాలకు మాత్రమే భూయాజమాన్యం ఉన్నది 26% ఉన్న ముదిరాజ్ కులములో 66% కుటుంబాలు భూయాజమాన్యం కలిగి వున్నాయి మొత్తం భూమిలో రెడ్డి కులస్థులు 36% భూమిని వాటాగా కలిగి వున్నారు ముదిరాజ్ కులస్థులు 25%, మాదిగ కులస్థులు కేవలం 3% భూమిని మాత్రమే వాటాగా కలిగి వున్నారు. రెడ్డి కులములో ఒక కుటుంబానికి (సగటు) ఉన్న భూమి 5 03 ఎకరాలు కాగా, ముదిరాజ్ కులములో 1 59ఎకరాలు, వైశ్య కులములో 1 10ఎకరాలు, మాదిగ కులంలో కేవలం 0 29 ఎకరాలు మాత్రమే ఉన్నది మిగిలిన అన్ని కులాలలో సగటు కుటుంబం భూకమత విస్తీర్ణం ఎకరంలోపు ఉండటం గమనార్హం మాదిగ కులంలో సగటు కుటుంబం భూకమతం విస్తీర్ణంతో 17 రెట్లు అధికంగా రెడ్డి కులం సగటు కుటుంబ విస్తీర్ణం ఉన్నది ముదిరాజ్ కులంతో 3 రెట్లు అధికంగా ఉన్నది

### ఆర్థిక తరగతులు – భూయాజమాన్యం

గ్రామములో భూస్వాములు3%, ధనిక రైతులు 8%, మధ్యతరగతి రైతులు 12%, చిన్నకారు రైతులు 12%, సన్నకారు రైతులు 17%, భూమి ఉన్న వ్యవసాయ కార్మికులు 3(1%)కుటుంబాలు, భూమిలేని వ్యవసాయ కార్మికులు 24%ఉన్నారు సాంప్రదాయ వృత్తులకు చెందిన కుటుంబాలు 2%, స్వయం ఉపాధి కుటుంబాలు 1%, ప్రైవేటు ఉద్యోగస్థుల కుటుంబాల 4%, ప్రభుత్వ ఉద్యోగుల కుటుంబాలు 3%, వ్యాపారం నిర్వహిస్తున్న కుటుంబాలు 2%, వడ్డీ వ్యాపారం చేసేది ఒక కుటుంబం, ఇతరులు (పెన్షన్‌దారులు విద్యార్థులు, ఇతరుపై ఆధారపడేవారు) 7% ఉన్నాయి

గ్రామములోని నికర సాగుభూమి విస్తీర్ణములో ఆయా వర్గాల వాటాలను లెక్కించినపుడు 22%భూమిని భూస్వాములు, 35% భూమిని ధనిక రైతులు, 24% మధ్యతరగతి రైతులు, 12% చిన్నకారు రైతులు, 7% సన్నకారు రైతులు, 0 12% భూమి ఉన్న వ్యవసాయ కార్మికులు సాగుచేస్తున్నారు 3శాతముగా ఉన్న భూస్వాములు

22%భూమిని సాగుచేస్తుంటే, 17%గాఉన్న సన్నకారు రైతులు 7% భూమిని మాత్రమే సాగుచేస్తున్నారు 8% శాతముగా ఉన్న ధనిక రైతులు 35% భూమిని సాగుచేస్తున్నారు

ఆయా వర్గాలు సాగుచేస్తున్న నికర సాగుభూమి సగటు విస్తీర్ణము (ఒక వర్గము సాగుచేస్తున్న మొత్తం నికర సాగు భూమిలో ఒక కుటుంబం సాగు చేసే నికర సాగుభూమి) ధనిక రైతుల్లో 13 83 ఎకరాలు ఉన్నది ధనిక రైతుల్లో 8 05 ఎకరాలు, మధ్యతరగతి రైతుల్లో 3.94 ఎకరాలు, చిన్నకారు రైతులు 1 93 ఎకరాలు, సన్నకారు రైతులు 0 79ఎకరాలు, భూమి ఉన్న వ్యవసాయ కార్మికుల్లో 0 25 ఎకరాలు సాగు చేస్తున్నాయి భూమి ఉన్న వ్యవసాయ కార్మికుల సగటు కుటుంబము యొక్క కమతం విస్తీర్ణముతో 55 రెట్లు అధికంగా భూస్వాముల సగటు కుటుంబ విస్తీర్ణం ఉన్నది సన్నకారు రైతులతో 17 రెట్లు, చిన్నకారు రైతులతో 7రెట్లు, మధ్యతరగతి రైతులతో 3రెట్లు, ధనిక రైతులతో 1 72 రెట్లు అధికంగా ఉన్నది భూమి వున్న కుటుంబాల్లో ఎక్కువ భూమి వున్న మొదటి 5శాతం కుటుంబాల చేతుల్లో 35% భూమిని కలిగి వున్నాయి తక్కువ భూమి కలిగి వున్న చివరి 60% కుటుంబాలు కేవలం 7శాతం భూమిని మాత్రమే కలిగి వున్నాయి

**కౌలుసేద్యం**

గ్రామములో 55 కుటుంబాలు కౌలు సేద్యం చేస్తున్నాయి దళిత కుటుంబాలు 6, వెనుకబడిన తరగతులకు చెందిన కుటుంబాలు 39, అగ్ర కులాలకు చెందిన కుటుంబాలు 10ఉన్నాయి. గ్రామములోని మొత్తం కుటుంబాలలో 17% ఉన్న కౌలు రైతులు, సాగు కుటుంబాల వారీగా దళితుల్లో 37%, వెనుకబడిన తరగతుల్లో 33%, అగ్ర కులాలలో 27% కౌలు రైతులున్నారు గ్రామములో సాగుచేస్తున్న కుటుంబాలు 172. మొత్తం కౌలు కుటుంబాల్లో దళితులు 11%, వెనుకబడిన తరగతులు 71%, అగ్రకులాలకు చెందిన కటుంబాలు 18% ఉన్నాయి మొత్తం కౌలుభూములో దళితులు 13% భూమిని కౌలు చేస్తుండగా, వెనుకబడిన తరగతుల్లో 56%భూమిని, 30%భూమిని అగ్ర కులాలకు చెందిన కుటుంబాలు చేస్తున్నాయి

వర్గాల వారీగా భూస్వాములకు చెందిన 6(60%) కుటుంబాలు కౌలుసేద్యం చేస్తున్నాయి. ధనిక రైతుల్లో 10(37%), కుటుంబాలు, మధ్యతరగతి రైతుల్లో 18 (47%) కుటుంబాలు, చిన్నకారు రైతుల్లో 15(38%) కుటుంబాలు, సన్నకారు రైతుల్లో 6 (11%) కుటుంబాలు కౌలు సేద్యం చేస్తున్నాయి ధనిక రైతుల్లో మధ్యతరగతి రైతుల్లో కౌలుసేద్యం ఎక్కువ శాతం కుటుంబాలు చేస్తుండగా, సన్నకారు రైతుల్లో కేవలం

11%కుటుంబాలు మాత్రమే కౌలుసేద్యం చేయడం గమనార్హం మొత్తం కౌలురైతుల్లో వర్గాలను చూసినపుడు 11%భూస్వాములు కాగా, 18%ధనిక రైతులు, 33%మధ్యతరగతి రైతులు, 27%చిన్నకారు రైతులు, సన్నకారు రైతులు 11%ఉన్నారు మొత్తం కౌలుభూమిలో 23%భూస్వాములు, 26%ధనిక రైతులు, 35%మధ్యతరగతి రైతులు, 13%చిన్నకారు రైతులు, సన్నకారు రైతులు 2%భూమిని కౌలుకు చేస్తున్నారు

**పశుసంపద**

గ్రామములో 171 కుటుంబాలకు పశు సంపద వున్నది గ్రామములో (ఆవు లేదా గేదెలు) పశుసంపద 391 ఉన్నది మొత్తం 10 కుటుంబాలకు 50 గొర్రెలు ఉన్నట్లుగా నమోదైంది ఆయా వర్గాల మొత్తము కుటుంబాలలో 9భూస్వామ్య కుటుంబాలు, 24 ధనిక రైతు కుటుంబాలు, 33 మధ్యతరగతికి చెందిన రైతు కుటుంబాలు 35చిన్నకారు రైతు కుటుంబాలు, 3 సన్నకారు రైతు కుటుంబాలు, ఒక భూమి ఉన్న వ్యవసాయ కార్మిక కుటుంబం, 19 భూమిలేని వ్యవసాయ కార్మిక కుటుంబాలు 2 సాంప్రదాయ వృత్తి కుటుంబాలు, 3 ప్రైవేటు ఉద్యోగస్థుల కుటుంబాలు, ఒక ప్రభుత్వ ఉద్యోగం ఉన్న కుటుంబం, 4 వ్యవసాయేతర కార్మికుల కుటుంబాలు పశుసంపదను కలిగి ఉన్నాయి ఒక ధనిక రైతు కుటుంబము గొర్రెల పెంపకం అనుబంధ వృత్తిగా కలిగి వున్నది ఇద్దరు చిన్నకారురైతులు, నలుగురు సన్నకారురైతులు, గొర్రెల పెంపకాన్ని అనుబంధ వృత్తిగా కలిగి ఉన్నాయి భూమిలేని ఇద్దరు వ్యవసాయ కార్మికులు, గొర్రెల పెంపకాన్ని వృత్తిగా కలిగిన మరో కుటుంబం గొర్రెల పెంపకంలో వున్నారు

**వసతులు - వినిమయ వస్తువులు - ఆస్థులు**

గ్రామంలో స్వంత ఇళ్ళున్న కుటుంబాలు 91% ఉన్నాయి కాని దళితుల్లో కేవలం 27% కుటుంబాలకు మాత్రమే పక్కా ఇళ్ళున్నాయి భూమి ఉన్న వ్యవసాయ కార్మికుల్లో 33%కుటుంబాలకు, భూమిలేని వ్యవసాయ కార్మికుల్లో 49%కుటుంబాలకు మాత్రమే పక్కా ఇళ్ళున్నాయి కరెంటు సౌకర్యము ఉన్న కుటుంబాలు 91%ఉన్నాయి కాని కేవలం 70%కుటుంబాలకు మాత్రమే దళితుల్లో కరెంటు సౌకర్యము ఉన్నది భూమి ఉన్న వ్యవసాయ కార్మికుల్లో 67%కుటుంబాలకు, భూమిలేని వ్యవసాయ కార్మికుల్లో 86% కుటుంబాలకు మాత్రమే కరెంటు సౌకర్యము ఉన్నది లెట్రిన్ సౌకర్యము 64%కుటుంబాలకున్నది దళితుల్లో కేవలం 33%కుటుంబాలకు మాత్రమే ఉన్నది భూమి

ఉన్న వ్యవసాయ కార్మికుల్లో 33% కుటుంబాలకు, భూమి లేని వ్యవసాయ కార్మికుల్లో 51% కుటుంబాలకు మాత్రమే లెట్రిన్ సౌకర్యము ఉన్నది వంటగ్యాస్ సౌకర్యము గ్రామములో 83% కుటుంబాల కున్నది దళితుల్లో కేవలం 76% కుటుంబాలకు మాత్రమే ఉన్నది. భూమి ఉన్న వ్యవసాయ కార్మికుల్లో 67% కుటుంబాలకు, భూమి లేని వ్యవసాయ కార్మికుల్లో 71% కుటుంబాలకు మాత్రమే వంటగ్యాస్ సౌకర్యము ఉన్నది

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 35% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 7% భూమి మాత్రమే వుంది. 41% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

గ్రామములో స్కూటర్లు 22 కుటుంబాల కున్నాయి దళితుల్లో ఒక కుటుబానికి మాత్రమే స్కూటరున్నది గ్రామములో 122 కుటుంబాలకు మోటారు సైకిళ్ళున్నాయి మూడు కుటుంబాలకు కార్లున్నాయి అవి కూడా వెనుకబడిన తరగతులకున్నాయి సైకిల్ కుటుంబాలు గ్రామములో 73 ఉన్నాయి సెల్‌ఫోన్ సౌకర్యము గ్రామములో 83% కుటుంబాలకున్నది. వ్యవసాయ కార్మికుల్లో కేవలం 72% కుటుంబాలకు మాత్రమే ఈ సౌకర్యము ఉన్నది 76%కుటుంబాలకు టి.వి లున్నాయి దళితుల్లో 65% కుటుంబాలకు మాత్రమే టి వి.లున్నాయి వ్యవసాయ కార్మికుల్లో 60% కుటుంబాలకు మాత్రమే టి వి లున్నాయి 35 కుటుంబాలకు ట్రాక్టర్లున్నాయి 10 ట్రాక్టర్లు భూస్వాములకు, 15 ట్రాక్టర్లు ధనిక రైతులకు, 7 ట్రాక్టర్లు మధ్య తరగతి రైతులకు, మూడు మాత్రమే చిన్నకారు రైతులకున్నాయి రెండు కుటుంబాలకు ఆటోలున్నాయి. ఆ రెండు కుటుంబాలు దళితులకు చెందినవిగా ఉన్నాయి

# నిజామాబాద్ జిల్లా

## బుడిమి

సుందరయ్య విజ్ఞాన కేంద్రం(శోధన) 2013-14 వ్యవసాయ సీజన్‌లో నిర్వహించిన గ్రామీణ సామాజిక ఆర్థిక సర్వేలో భాగంగా బుడిమి గ్రామాన్ని 2013 డిశంబరులో తొలి దఫా, 2014 జూన్‌లో మలి దఫా సర్వే నిర్వహించాము గ్రామ సెన్సెస్ సర్వేలో సేకరించిన సమాచారాన్ని స్థూలంగా పరిశీలిద్దాం

### గ్రామ ముఖచిత్రం

తెలంగాణ రాష్ట్రంలోని ఉత్తర ప్రాంతంలో బుడిమి గ్రామం వుంది. అది నిజామాబాద్‌జిల్లా బాన్సువాడ మండల కేంద్రానికి 6 కిలోమీటర్ల దూరంలోవున్నది బాన్సువాడ-బిచ్‌కొండ రోడ్ లో వుంటుంది ఈ గ్రామానికి బాన్సువాడ దగ్గరి పట్టణము ఆర్‌టిసి బస్‌లు, ఆటోలే ఇక్కడి రవాణా సాధనాలు నిజాంసాగర్ ప్రాజెక్టులో నీరు వున్నపుడు కాలువల ద్వారా ఈ గ్రామానికి సాగునీటి వసతి వుంటుంది బోర్లు, ఒక చెరువు, బావులు క్రింద కొంత భూమి సాగవుతున్నది వరి, మొక్కజొన్న, జొన్న, సోయాబీన్, వేరుశనగ పంటలు పండిస్తారు. విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్, గ్రామీణ రక్షిత తాగునీటి పథకము, ఒక ప్రాథమిక, ఒక ఉన్నతపాఠశాల, గ్రామపంచాయతీ కార్యాలయ భవనం, ప్రభుత్వరేషన్ షాపు, అంగన్‌వాడీ కేంద్రం వున్నాయి

### జనాభా - సామాజిక పొందిక

గ్రామంలో మొత్తం జనాభా 1534. పురుషులు 750. స్త్రీలు 784. లైంగిక నిష్పత్తి 1045 జనాభాలో బిసిలు అత్యధికంగా 75%, ఎస్‌సిలు 14% (దాదాపు జిల్లా

ఎస్సిల సగటుతో సమానముగా వున్నది) ఎస్టిలు (ఆరు మంది) 0 4% గా మాత్రమే వున్నారు (ఈ తరగతి జిల్లా సగటు7 56 %) 2011 జనాభాలెక్కల ప్రకారం నిజామాబాద్ జిల్లాలో ప్రతి 1000మంది పురుషులకు 1047మంది మహిళలున్నారు కానీ గ్రామంలో పరిస్థితి మరింత మెరుగ్గా ఉంది ఈ నిష్పత్తి ఒసిలలో 1250 గానూ, ఎస్సిలలో 1180గా, బిసిలలో 1002గా ఈనిష్పత్తి నమోదయింది ఇది సంఖ్యరీత్యా బిసిలు ఎక్కువగా వున్న గ్రామం ఇక్కడి 329 కుటుంబాలలో బిసిలు 72% తో ప్రథమ స్థానంలో వున్నారు తర్వాత ఎస్సి లు 14%, ఆతర్వాత ఒసిలు 10% కుటుంబాలున్నాయి ఒక్క యస్టి కుటుంబం మాత్రమే వున్నది మహిళల యాజమాన్యంలో 63కుటుంబాలు నిర్వహించబడుతున్నాయి

మొత్తం 329 కుటుంబాలలో మెజారిటీ (270) 82% హిందువులు ముస్లింలు(59) 18% కానీ వీరిలో ముస్లిం మతాచారాలు పాటించేవారు (23), మరియు రెండు ఆచారాలూ పాటించే నూరుమహమ్మదు (బిసి) లు(31) కలసి వున్నారు ఎస్సిలు జనాభాలో 17% వున్నా , క్రిష్టియన్‌లు లేరని సర్వే సమాచారము తెలియజేస్తున్నది కులాల పరంగా జనాభా నిష్పత్తులు ఇలా ఉన్నాయి (121) 37% తో ముదిరాజులు ప్రథమ స్థానములోనూ, తర్వాత స్దానంలో (54) 16%తో ముస్లింలు, ఆ తర్వాత మాదిగలు(50) 15%తో కుటుంబాలసంఖ్యరీత్యా ప్రాధాన్యత కల్గి వున్నారు 10%లోపు వున్న కులాలలో 16కులాలవారు వున్నారు .మాలలు, పద్మసాలి, కురుమ, వడ్డెర, విశ్వబ్రాహ్మణ , బోయ , గంగపుత్ర , గౌడ , కమ్మ , వైశ్య, కుమ్మరి, మున్నూరుకాపు , రజక, నాయీబ్రాహ్మణ, రెడ్డి, ,యాదవ ఇతరులు 9% కులాలవారున్నారు

**వర్గవిభజన**

గ్రామంలోని కుటుంబాలను శ్రమ ఆధారంగా 4 తరగతులుగా విభజించి పరిశీలిద్దాము మొదటిది నాలుగు కుటుంబాల భూస్వాములున్నారు ధనికరైతులు 11 కుటుంబాలు వున్నవి ఈ రెండు వర్గాలవారూ కలసి 15కుటుంబాలు మధ్యతరగతి రైతులు 56, చిన్నరైతులు 90, సన్నకారురైతులు 72 కుటుంబాలు వున్నాయి మూడవది-వ్యవసాయకార్మికుల కుటుంబాలు-కొద్దిగా భూమికలవారు 19 కుటుంబాలు వుంటే, భూమిలేనివారు 48 కుటుంబాలు వున్నాయి వృత్తిదారులు ఒక్కరు, వ్యవసాయేతరకార్మికులు నాలుగు కుటుంబాలు వున్నాయి. నాల్గవది-ఉద్యోగులు, చిరువ్యాపారులు, స్వయంవుపాధులలో పనిచేసుకుంటున్నవారు వున్నారు

## జీవనోపాధి

గ్రామంలో భూస్వాములు అందరూ బిసిలే ఇద్దరు ముదిరాజులు ఒక ముస్లిం, మరొకరుగౌడ ధనిక రైతులు 12కుటుంబాల్లో ముదిరాజులు 11 వున్నాయి ఒకరు మాదిగ పుపకులస్తుడు మధ్యతరగతి రైతులు 57లో ముదిరాజులు 31, మాదిగలు, ముస్లింలు, నలుగురు వంతున ఇంకా వీరితోపాటు వైశ్య, రజక, యాదవ ఒక్కొక్కరు వున్నారు 91మంది చిన్నరైతులలో 31మంది ముదిరాజులు, మాదిగలు 15 మంది, ముస్లింలు ఏడుగురు, నల్గురు రెడ్లు వున్నారు. సన్నకారురైతులు 72లో ముదిరాజులు 28, మాదిగలు 14, ముస్లింలు 10 మంది వున్నారు భూమిలేని వ్యవసాయకార్మికులు 15 మందిలో ముస్లిం, మాదిగ, ముదిరాజులు, రజక, మున్నూరుకాపులు కలసి శ్రమిస్తున్నారు ముదిరాజులు వ్యాపారాలు నడుపుతున్నారు ముగ్గురు డ్రైవర్లుగా, మరో ముగ్గురు ఉద్యోగులుగా వ్యవసాయేతర కార్మికులుగా పనిచేస్తున్నారు. సాంప్రదాయవృత్తులు పాటించే వారి జీవనోపాధిలలో పలు మార్పులు జరుగుతున్నాయి

ప్రధాన వర్గాలో సంఖ్య రీత్యా ముందున్న తొలి రెండు కులాలను గుర్తించుదాం వ్యవసాయం చేస్తున్నవారు –70 కుటుంబాలు వున్నాయి వారిలో మొదటి స్థానం మాల 46మంది, కురుమ 5మంది వ్యవసాయకార్మికులలో 91 మంది వున్నారు వారిలో మాల 29, వడ్డెర 13, మాదిగ 11 వ్యవసాయేతర కార్మికులలో 41 మంది వుంటే, వారిలో పద్మశాలి 14, కురుమ 6, గౌడ ఐదుగురు. వృత్తిదారులు 13మంది వుంటే వారిలో విశ్వబ్రాహ్మణ 4, రజక నలుగురు కౌలుదారులు ఒక్కరు వ్యాపారులు ఏడుగురులో పద్మశాలి నలుగురు పాలేరులు ముగ్గురు ట్రైలర్స్ 6 మంది వున్నారు

## భూకేంద్రీకరణ

గ్రామంలో మొత్తంగా వున్న స్వంత భూమి 568 ఎకరాలు అందులో మాగాణి 382ఎకరాలు మెట్ట 186 ఎకరాలు ఎస్సిలకు మొత్తం భూమిలో 12% వుంది బిసిలకు 82%భూమి వుంది, ఒసిలకు 7%, ఎస్టి కుటుంబం 2 5 ఎకరాలు మాగాణి కల్గివున్నది మొత్తం భూమిలో, బిసిలుకు అత్యధికంగానూ, ద్వితీయ స్థానంలో ఎస్సిలు భూమి యాజమాన్యం కల్గివున్నారు ఈ గ్రామంలో కుటుంబం సగటు భూమి 1.80 ఎకరాలు బిసిలకు సగటున 2ఎకరాలు భూమి వుంది గ్రామంలో భూమి లేని కుటుంబాలు 64 వున్నాయి భూమి వున్న కుటుంబాల్లో పైస్థాయి 5శాతం కుటుంబాలకు 23 శాతం భూమి వుంటే, క్రిందిస్థాయి 60శాతం కుటుంబాలకు 21శాతం భూమి వున్నది

గ్రామంలో కుటుంబానికి సగటుభూమి 1 8 ఎకరాలు నల్గురు భూస్వాములు, 11మంది ధనికరైతులు (15) 5% కుటుంబాలకు కలిపి మాగాణిలో 21%, మెట్టలో 17%, వీరికి మొత్తం భూమిలో 19%కు పైగా వాటా కల్గివున్నారు ఈ రెండు వర్గాల సగటు భూమి 7 3 ఎకరాలు ఇది గ్రామ సగటు కంటే నాలుగు రెట్లు అధికంగా వుంది 17%గావున్న మధ్యతరగతి రైతులు, చిన్నరైతులు (90), సన్నకారు రైతులు (72) మొత్తం (218) 66% కుటుంబాలకు 75% భూమి వున్నది మిగిలిన 19 మంది వ్యవసాయ కార్మికులు, ఆరుగురు చిరువ్యాపారులు, నలుగురు వ్యవసాయేతర కార్మికులు, 15 మంది ఇతరులు, ఇద్దరు ప్రైవేటు ఉద్యోగులకు కలిపి 2% మాత్రమే భూమి కలిగివున్నారు

**మరికొన్ని ఆస్తులు**

గ్రామంలోని 3 ట్రాక్టర్లూ బిసిలకే వున్నాయి రైస్ మిల్స్ లేవు పశు సంపదను పరిశీలిస్తే 13 కుటుంబాలతకు 26 ఎద్దులు వున్నాయి ఇవి కేవలం బిసిలకే వున్నాయి ఆవులు, గేదెలు 59 కుటుంబాలకు 132 వున్నాయి వీటిలో అత్యధిక భాగం బిసిలకే వున్నాయి. ఏడు కుటుంబాలకు 45 గొర్రెలు బిసిలకు ఉన్నాయి ఎస్‌సిలకు ఎటువంటి పశుసంపద లేదు ఇతరులకు నామమాత్రంగానే వున్నాయి

**కౌలుసేద్యము**

గామంలో (68 ఎకరాల) 12% భూమి కౌలు సేద్యం కింద ఉన్నది. 20 ఎకరాలు మాగాణి గల ఒక భూస్వామి మరొకరి భూమి 5ఎకరాలు కౌలుకు చేస్తున్నాడు. భూస్వాములు 44%, ధనికరైతులు 10% మొత్తం కౌలుభూమిలో (37 ఎలు) 54% సాగు చేస్తున్నారు. రివర్స్ కౌలు విధానం అమలులో వుందని అర్థమౌతున్నది మధ్యతరగతి రైతులు 33%, చిన్న, సన్నకారు రైతులు కలసి 13 2% కౌలుభూమి చేస్తున్నారు మిగిన వర్గాల వారెవ్వరూ కౌలు చెయ్యటం లేదు ఒక వైశ్య ధనికరైతు తన 10 ఎకరాల మాగాణి భూమిలో 5ఎకరాలను యితరులకు కౌలు కిచ్చాడు వ్యాపారంతోపాటు మిగిలిన 5 ఎకరాలలో వ్యవసాయం చేసుకుటూ మధ్య తరగతిరైతుగా మారిపోయాడు సామాజిక గ్రూపులవారీ మొత్తం కౌలు భూమిలో గరిష్టంగా 89% బిసిలు చేస్తున్నారు.

## విద్య, విద్యా స్థాయి

తెలంగాణ రాష్ట్ర అక్షరాస్యత (2011 జనాభా లెక్కల ప్రకారం) గ్రామీణ ప్రాంతాలలో 57 30%గా వుంది ఈ జిల్లాలో సాధారణ అక్షరాస్యత 61.25%గా వుంది రాష్ట్రం మరియు జిల్లాతో పోల్చినపుడు ఈ గ్రామం 49 87% అక్షరాస్యతతో వెనుకబడి వున్నది ఇక్కడ అక్షరాస్యతలో ఒసిలు 60%తో అగ్రస్థానం లోను, 50%తో బిసి లు, యస్సిలు 38%తో బాగా వెనుక బడి వున్నారు ఈ జిల్లాలో యస్సిల సగటు అక్షరాస్యత (53%) కంటే గ్రామంలో చాలా తక్కువగా వుంది జనాభాలో మహిళా అక్షరాస్యత 40%తో అతి తక్కువగా వున్నది ఒసిలలో గరిష్టంగా 44% మహిళలు అక్షరాస్యులుగా వున్నారు ఆతర్వాత బిసి లలో మహిళలు 40% అక్షరాస్యులు ఎస్సి మహిళలలో 36% మాత్రమే అక్షరాస్యులులలో దిగువన వున్నారు స్త్రీ విద్య పట్ల చిన్నచూపు, మరియు వారిలోఅత్యధికుల ఆర్థికపరిస్థితి అందుకు కారణం అయి వుండవచ్చు

ఒక్క ప్రాథమికవిద్యలో మాత్రమే మూడొంతులు జనాభాగల బిసిలు 19%తో ముందున్నారు ఆ తర్వాత సెకండరీ, విద్యలో జనాభాలో 8%గా వున్న ఒసిలు 27%తో ముందుండగా, బిసిలు 20%, ఇంటర్‌లో బిసిలు ,ఒసిలు 8%, ఎస్సిలు 6%కు పరిమితమయ్యారు డిగ్రీలో బిసిలు 5%తో ప్రథమంగానూ, ఎస్సిలు 4%తో తర్వాత, ఒసిలలో 0 7% మాత్రమే సాధించగల్గారు ఆ తర్వాత ఎస్సిలు చదువులు కొనసాగించలేక పోయారు ప్రతి స్థాయిలోనూ ఎస్సిలు విద్యలో చివరి వరుసలోనే నిలిచారు ఉన్న కొద్ది మంది ఎస్టిలు అందరూ నిరక్షరాస్యులే పిజి స్థాయిలో 1% పైబడి ఒసిలు, 1% లోపు బిసిలు నిలిచారు ఆపై ఉన్నత విద్యను ఎవరూ కొనసాగించలేదు ఎస్సి, ఎస్టి, బిసిలు తమకున్న ప్రభుత్వపరమైన, రాజ్యాంగ బద్ధమైన, విద్యాపరమైన అవకాశాలను కూడా అందుకోలేక పోతున్నారు ఫలితంగా ఈగ్రామం విద్యలో వెనుకబడి పోయింది

**ఆయుఃప్రమాణము**

మొత్తం జనాభాలో 16నుండి 40 సంవత్సరముల మధ్య వయసు గల యువత జనాభాలో 49% వున్నారు అలాంటి వారు గ్రామ జనాభాలో అత్యధికంగా 50% బిసిలలో, తర్వాత ఎస్సిలలో 40% వున్నారు అత్యల్పంగా 49%మంది ఒసిలలో వున్నారు పనిచేయగల వయసులో (16 నుండి 60 సంవత్సరముల మధ్య ) వున్నవారు జనాభాలో

64%వున్నారు ఎస్ సి 72%, ఎస్టి 3% ,బిసిలలో 69%, ఒసి 65% వున్నారు 60 సంవత్సరములు ఆపైన జీవించివున్న వారు జనాభాలో (101)7% మాత్రమే ఈ కేటగిరీలో, ఎస్ సిలలో (12మంది6%, బిసిలలో (76)7%, ఒసిలలో గరిష్టంగా (11) 7% జీవించి వున్నారు 70 సంవత్సరములకు పైబడి జీవించి వున్నవారు ఎస్టి లలోఒక్కరు మాత్రమే వున్నారు

## కనీస అవసరాలు

గ్రామంలో 94% కుటుంబాలకు స్వంత ఇళ్లు ఉన్నాయి వారిలో గరిష్టంగా ఎస్ సి, బిసిలలో 94%కు, ఒసిలలో 92 వున్నాయి పక్కాగృహాలు కలిగివున్న వారు ఒసిలలో అత్యధికంగా 82%, తర్వాత బిసిలలో 65%కు, అతి తక్కువగా ఎస్ సిలలో 35%కు మాత్రమే వున్నట్లు సెన్సస్ సమాచారం తెల్పుతున్నది పభుత్వ గృహనిర్మాణ పథకాలున్నా ఎస్ సిలు, ఎస్టిలకు పక్కాగృహాలు నిర్మించియివ్వటంలో పాలకులు విఫలమయ్యారు అద్దె ఇళ్ళలో నివసించేవారు అత్యధికంగా ఒసిలలో 9%, బిసిలలో 6% వున్నట్లు సర్వేసమాచారం. విద్యుత్ కనెక్షన్‌లు 91శాతం కుటుంబాలకు అందుబాటులో వుంది ఎన్.సిలలో 85శాతం కుటుంబాలకు ఈ సౌకర్యం వుంటే, ఓసిలలో 94% కుటుంబాలు ఈ సౌకర్యం కల్గివున్నారు వ్యవసాయ కార్మిక కుటుంబాల్లో కేవలం 17శాతం కుటుంబాలకు మాత్రమే ఈ సౌకర్యం కల్గివున్నారు టాయిలెట్స్ సదుపాయం కేవలం 22 శాతం కుటుంబాలకే వున్నది. ఒసిలలో గరిష్టంగా 58% టాయిలెట్స్ కల్గివున్నారు, ఎస్.సిలలో 4 శాతానికి మాత్రమే ఈ సౌకర్యం వుంది వ్యవసాయ కార్మిక కుటుంబాలకు చాల నామమాత్రంగా వున్నట్లు సర్వేలో తేలింది అంటే కేవలం 5శాతం కుటుంబాలకు వున్నది వంటగ్యాసు సౌకర్యం 17% కుటుంబాలకు వున్నది ఒసి ,బిసిలలో 33% గరిష్టంగా వినియోగించుకుంటున్నారు ఎస్ సిలలో 2శాతం కుటుంబాలు మాత్రమే కలిగి వున్నారు ఆర్థిక తరగతుల్లో పరిశీలిస్తే వ్యవసాయ కార్మిక కుటుంబాలకు కేవలం 4శాతం కటుంబాలే కల్గివున్నారు

## కొన్ని సౌకర్యాలు

గ్రామంలో 55 మోటారు సైకిళ్ళలో మధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతులు 82% వాడుతున్నారు. వ్యవసాయేతర కార్మికులు ఒక్కటి, భూస్వాములు, ధనిక రైతులు 7, వ్యవసాయ కార్మికులు 4 వినియోగిస్తున్నారు సామాజిక తరగతుల వారీ

పరిశీలిస్తే ఎక్కువగా వున్న బిసి సామాజిక తరగతిలోనే 46 మోటారు సైకిళ్లు వున్నాయి 7 స్కూటర్‌లలో - మధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతులు 5, ఒకటి వ్యాపారి వద్ద వున్నది 3 కార్లలో - ఒకటి భూమిలేని వ్యవసాయ కార్మికుని యాజమాన్యంలో వున్నట్లు సర్వేలో వెల్లడయింది ఈ వాహనాన్ని వారు అద్దెలకు తిప్పుతున్నట్లు తెలిసింది ఒక మధ్య తరగతి రైతు, ఒక చిన్న రైతులకు చెరొక కారు వున్నాయి బైక్‌లు, స్కూటర్లు, కార్లు ఇవేవీ దళితులకు, గిరిజనులకు లేకపోవడం గమనార్హం. 99 సైకిళ్ళలో మధ్యతరగతి రైతులు, చిన్న, సన్నకారు రైతులు 79% వాడుతున్నారు. టివిలలో భూమిలేని వ్యవసాయ కార్మికులు గరిష్టంగా, సన్నకారు రైతులు, వ్యవసాయేతర కార్మికులు కలిసి 53% వినియోగిస్తున్నారు ఎస్ సి.లలో సగం మందికే ఈ వసతి వున్నది ఊర్లో 83 శాతం కుటుంబాలు సెల్‌ఫోన్‌లు వాడుతున్నారు

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 23% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 21% భూమి మాత్రమే వుంది. 28% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

## నల్లగొండ జిల్లా

# రసూల్‌పురా

సుందరయ్య విజ్ఞాన కేంద్రము ఆధ్వర్యములో 2013-14లో నిర్వహించిన గ్రామీణ ఆర్థిక సర్వేలో భాగంగా నలగొండ జిల్లాలోని "రసూల్‌పురా" గ్రామాన్ని 2013 డిశంబరులో తొలి విడత, 2014 ఫిబ్రవరిలో మలి విడత సర్వే చేయటం జరిగింది గ్రామాన్ని సెన్సస్ మరియు శాంపిల్ సర్వే చేశాం భౌగోళికంగా దక్షిణ తెలంగాణ ప్రాంతములోని నల్లగొండ జిల్లా కేంద్రానికి దాదాపు 10కిలోమీటర్ల దూరంలో, నార్కట్ పల్లి- అద్దంకి ప్రధాన రహదారికి దగ్గరగా ఉన్న గ్రామం ఇది గ్రామములో పంచాయితీ ఆఫీసు, ప్రాధమిక పాఠశాల, అంగన్‌వాడీ కేంద్రము, రక్షిత గ్రామీణ తాగునీటి వసతితో పాటు ప్రజా పంపిణీ దుకాణము ఉన్నాయి కొంత భూమికి కెనాల్ ద్వారా సాగు నీరందుతున్నది మరికొంత భాగము (ఎక్కువ భాగము) బోర్‌వెల్స్ మీద ఆధారపడి వ్యవసాయము సాగు చేస్తున్నారు వరి, వేరుశనగ, పత్తి మరియు బత్తాయి తోటలు ప్రధానమైన పంటలుగా ఉన్నాయి

**జనాభా నిష్పత్తులు**

గ్రామములో 198 కుటుంబాల్లో 760 జనాభా వున్నారు దీనిలో యస్ సి కుటుంబాలు 62(31%), యస్.టి కుటుంబాలు 2, బి సి కుటుంబాలు 99(50%), ఒ సి కుటుంబాలు 35(18%) ఉన్నాయి గ్రామములో పురుషులు 392మంది ( 52శాతం) వుండగా, స్త్రీలు 368 (48శాతం) వున్నారు ప్రతి వెయ్యిమంది పురుషులకు 939మంది స్త్రీలున్నారు సామాజిక తరగతుల వారీగా గ్రామములో లైంగిక నిష్పత్తి యస్ సి.లలో826, బి.సి.లలో1032, ఒ.సి.లలో 932గా వున్నది 2011 ప్రభుత్వ

జనాభా లెక్కల ప్రకారము రాష్ట్రంలో స్త్రీ-పురుషుల లైంగిక నిష్పత్తి 988గా ఉన్నది ఈ నిష్పత్తిలో పోల్చినపుడు గ్రామ లైంగిక నిష్పత్తి చాలా తక్కువ బి సి లలో రాష్ట్ర సగటు కంటే అధికంగా ఉన్నది ఒ సి లలో చూసినపుడు తక్కువగా ఉంది యస్ సి లలో లైంగిక నిష్పత్తి బాగా తక్కువగా వున్నది గ్రామములో 91% కుటుంబాలు హిందువులు, 8% ముస్లిములు కాగా, ఒక క్రిష్టయన్ కుటుంబం ఉన్నది గ్రామములో 15 నుంచి 59సం॥ల మధ్యగల జనాభా 61% వున్నారు. 60 మరియు ఆపైన వయసు గల జనాభా గ్రామములో 13% ఉన్నారు 60మరియు ఆపైన వయసుగల జనాభాలో యస్ సి లలో 12%, బి.సి లలో 11%, ఒ సి లలో 19% ఉన్నారు ఇతర అన్ని సామాజిక తరగతుల్లో కంటే ఒ సి. సామాజిక తరగతిలో ఎక్కువ కాలం జీవిస్తున్నవారు అధికంగా వున్నారు

## సామాజిక పొందిక- జీవనోపాధి

ఈ గ్రామములో గౌడ, కురుమ, మాదిగ, మాల, రజక, రెడ్డి, సుగాలి, వైశ్య, యాదవ కులాలు ముఖ్యమైనవిగా ఉన్నాయి యాదవ కులము 52 కుటుంబాలు (26%) కలిగి వున్నది ఈ కులంలో రెండు కుటుంబాలు భూస్వాములుగాను, ఏడు కుటుంబాలు ధనిక రైతులుగాను వున్నాయి మరో రెండు కుటుంబాలు డ్రైవర్స్, ఎలక్ట్రీషియన్ గా జీవనోపాధి పొందుతున్నాయి గౌడు కులానికి చెందిన 23 కుటుంబాలు(12%) వున్నాయి వీరిలో 22కుటుంబాలు వ్యవసాయముతో సంబంధం కలిగి వున్నాయి మాదిగ కులానికి చెందిన కుటుంబాలు 32 వీరిలో వ్యవసాయంపై ఆధారపడ్డ కుటుంబాలు 21 వ్యవసాయేతర వృత్తులపై ఆధారపడ్డ కుటుంబాలు 11 మాల కులానికి చెందిన కుటుంబాలు 30 ఉన్నాయి ఇందులో 29 కుటుంబాలు వ్యవసాయముతో సంబంధాన్ని కలిగి వున్నాయి మొత్తం కుటుంబాలలో మాల కులానికి చెందిన కుటుంబాలు 15% ఉన్నాయి రజక కులానికి చెందిన 7కుటుంబాలున్నాయి ఒక కుటుంబము వ్యవసాయంతో పాటు ఆటో నడపడం ద్వారా అనుబంధ ఉపాధి పొందుతున్నది ఈ కులానికి చెందిన కుటుంబాలు కేవలం 4% మాత్రమే ఉన్నాయి గ్రామములో రెడ్డి కులానికి చెందిన 33కుటుంబాలలో 31 కుటుంబాలు వ్యవసాయంతో సంబంధాన్ని కలిగి వున్నాయి ఒక కుటుంబం మాత్రము వ్యవసాయేతర కార్మికుడు (ఆటో డ్రైవర్)గా జీవనం కొనసాగిస్తున్నది ఈ కులానికి చెందిన కుటుంబాలు 17% ఉన్నాయి మొత్తం కుటుంబాల్లో స్త్రీల యాజమాన్యంలో 18 కుటుంబాలు (9%) వున్నవి

## అక్షరాస్యత

గ్రామంలో 59 6% అక్షరాస్యత వున్నది 60% యస్ సి లలో, 58% బి సి లలో, 66% ఒ సి లలో చదువుకున్న వారు వున్నారు 2011 జనాభా లెక్కల ప్రకారం రాష్ట్ర సగటు అక్షరాస్యత 57 30% వున్నది దీనితో పోల్చినపుడు ఈ గ్రామ అక్షరాస్యత శాతం మెరుగ్గా వున్నది పురుషుల అక్షరాశ్యత 66%, స్త్రీల అక్షరాస్యత 52% ఉన్నది సామాజిక తరగతులవారీగా స్త్రీల అక్షరాస్యతలు యస్ సి లలో 53%, బి సి లలో 54%, ఒ సి లలో 49% ఉన్నాయి ఒ సి సామాజిక తరగతిలో స్త్రీల అక్షరాస్యతలో అందరికంటే వెనుకబడిన విషయాన్ని గమనించవచ్చును పురుషుల అక్షరాస్యతలో రాష్ట్ర సగటు కంటే ఈ గ్రామము వెనుకబడి వున్నది తెలంగాణ రాష్ట్రంలో 2011 జనాభా లెక్కల ప్రకారం పురుషుల అక్షరాస్యత 75% కాగా, 58% స్త్రీల అక్షరాస్యత వున్నది స్త్రీల రాష్ట్ర సగటు అక్షరాస్యత కంటే గ్రామములోని అన్ని సామాజిక తరగతుల స్త్రీల అక్షరాస్యత తక్కువగా వున్నది

## సాగుభూమి - విస్తీర్ణం

గ్రామంలో మొత్తం నికర సాగుభూమి 573 ఎకరాలు సాగునీటి వసతి గల భూమి 394 49 ఎకరాలు. వర్షాధార భూమి 178 58 ఎకరాలు ఇందులో పడావు భూమి 63 6 ఎకరాలుగా సమాచార విశ్లేషణలో వెల్లడైంది 25 5 ఎకరాలు సాగునీటి వసతి గల భూమి, 16 ఎకరాలు వర్షాధార భూమి కౌలు క్రింద సాగవుతున్నది 6.75 ఎకరాలు సాగునీటి వసతి గల భూమి, 11 25 ఎకరాలు వర్షాధార భూమి కౌలుకిచ్చిన భూమిగా వున్నది కౌలుకు తీసుకున్న భూమి విస్తీర్ణం, కౌలుకిచ్చిన భూమి విస్తీర్ణం సమానంగా లేదు కౌలుకు తీసుకున్న మొత్తం భూమి విస్తీర్ణం 41 5 ఎకరాలుగా వుంటే, కౌలుకిచ్చిన భూమి విస్తీర్ణం 18 ఎకరాలుగా వున్నది. ఈ వ్యత్యాసానికి కారణం రైతుల నుండి సరైన సమాచారం రాకపోవడం గాని, లేదా ప్రక్క గ్రామాల పరిధిలో వున్న భూమిని కౌలు క్రింద వుండాలి. గ్రామంలో స్వంత సాగుచేస్తున్న కుటుంబాలు 138. వీరిలో కౌలుకు సాగుచేస్తున్న కుటుంబాలు 17 వున్నాయి కౌలుకిచ్చిన కుటుంబాలు 9 వున్నాయి ఇందులో స్వంత భూమి లేకుండా కౌలుకు సాగుచేస్తున్న కుటుంబాలు రెండు మాత్రమే వున్నాయి

## స్వంత భూమి - యాజమాన్యము

గ్రామములో భూమి కలిగిన కుటుంబాలు, భూమిలేని కుటుంబాల వివరాలు ఇలా వున్నాయి 138(70%) కుటుంబాలు వ్యవసాయ భూమిని కలిగి వున్నాయి 60కుటుంబాలకు (30%) స్వంత భూమిలేదు

మొత్తము 62 దళిత కుటుంబాలకుగాను 33(53%)కుటుంబాలకు భూములున్నాయి ఈ గ్రామములో ఉన్న రెండు యస్ టి కుటుంబాలకు సెంటు భూమి కూడా లేదు వెనుకబడిన తరగతులకు చెందిన 73(74%) కుటుంబాలకు స్వంత భూములున్నాయి అగ్ర కులాలకు చెందిన కుటుంబాల్లో 91% కుటుంబాలకు భూములున్నాయి గ్రామము మొత్తంగా భూ యాజమాన్యములో ఎక్కువ శాతం కుటుంబాలకు భూములున్నప్పటికీ వెనుకబడిన తరగతులు, అగ్ర కులాల భూ యాజమాన్యముతో పోల్చినప్పుడు దళితుల భూ యాజమాన్యము అందరి కంటే తక్కువగా ఉన్న విషయము స్పష్టమవుతున్నది.

గౌడకులానికి చెందిన కుటుంబాలలో 16కుటుంబాలకు భూములున్నాయి 7కుటుంబాలకు భూములు లేవు గ్రామములో మొత్తం 32 మాదిగ కుటుంబాలు వున్నాయి ఈ కులానికి చెందిన 16కుటుంబాలకు స్వంత భూములున్నాయి మరో 16 కుటుంబాలకు భూములు లేవు మొత్తము 7 రజక కుటుంబాలలో 6కుటుంబాలకు భూములున్నాయి. అగ్ర కులానికి చెందిన రెడ్డి కులములో 31కుటుంబాలకు(94%) భూములున్నాయి. మొత్తం యాదవ కుటుంబాలు 52 ఉన్నాయి. అధిక సంఖ్యలో కుటుంబాలు కలిగిన యాదవ కులములో 44 కుటుంబాలకు స్వంత భూములున్నాయి ఎనిమిది కుటుంబాలకు స్వంత భూములు లేవు కురుమ కులానికి చెందిన ఒకే ఒక కుటుంబానికి స్వంత భూమిలేదు.

ఎక్కువ భూమి వున్న మొదటి 5% కుటుంబాల వద్ద గ్రామంలోని మొత్తం భూమిలో 27% వాటాను కలిగి వున్నారు తక్కువ భూమి వున్న చివరి 60 శాతం కుటుంబాలు కేవలం 13% భూమిని మాత్రమే కలిగి వున్నాయి

## ఆర్థిక తరగతులు - భూ యాజమాన్యము

గ్రామములో వివిధ వర్గాల యొక్క భూ యాజమాన్యములో ఉన్న అంతరాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి సమానీకరించబడిన నికర సాగుభూమి మొత్తన్ని పరిగణనలోకి

తీసుకొని ఆర్థిక తరగతులను, భూ పరిమాణాలను లెక్కించడం జరిగింది గ్రామములో భూస్వాములు 4%, ధనిక రైతులు 13%, మధ్య తరగతి రైతులు 20%, చిన్న రైతులు 16%, సన్నకారు రైతులు 12%, భూమి వున్న వ్యవసాయ కార్మికులు 22%, భూమి లేని వ్యవసాయ కార్మికులు2% ఉన్నారు మొత్తము భూమిలో భూస్వాముల వద్ద 23% భూమి ఉన్నది ధనిక రైతుల దగ్గర 33%, మధ్య తరగతి రైతుల వద్ద 27%, చిన్న రైతుల వద్ద మొత్తము భూమి12%, సన్నకారురైతుల వద్ద కేవలము 3 43% భూమి మాత్రమే ఉన్నది భూమి వున్న వ్యవసాయ కార్మికులకు తక్కువ భూమిని మాత్రమే కలిగి వున్నారు 3 54%గావున్న భూస్వాములవద్ద 23%భూమిని కల్గి వుంటే, 24%గా వున్న వ్యవసాయ కార్మికుల వద్ద కేవలం స్వల్ప భూమిని మాత్రమే కలిగి వున్నారు

వివిధ ఆర్థిక తరగతులు సాగుచేస్తున్న సగటు కుటుంబ కమతం విస్తీర్ణం ఇలా వుంది భూస్వాములలో ఒక కుటుంబానికి 22ఎకరాల భూమి ఉన్నది ధనిక రైతులకు 8 47ఎకరాల భూమి ఉన్నది మధ్యతరగతి రైతులకు 4.59ఎకరాలు, చిన్న రైతులకు 2 46 ఎకరాలు, సన్నకారు రైతులకు 0 94ఎకరాలు, భూమి కలిగిన వ్యవసాయ కార్మికులకు 0 18ఎకరాలు ఉన్నది సన్నకారు రైతులలో పోల్చినపుడు భూస్వాములకున్న సగటు భూమి 24రెట్లు అధికంగా ఉన్నది చిన్న రైతులతో 9రెట్లు అధికంగా ఉన్నది 4 8రెట్లు మధ్యతరగతి రైతులతో, ధనిక రైతులతో రెండున్నర రెట్లు అధికంగా ఉన్నది

**కౌలుసేద్యము**

గ్రామంలో 17కుటుంబాలు కౌలుసేద్యం చేస్తున్నాయి ఒక భూస్వామ్య కుటుంబం, 6ధనిక రైతు, 7 మధ్యతరగతి, 2 చిన్నరైతు, ఒక సన్నకారురైతుకుటుంబం కౌలు సేద్యం చేస్తున్నారు ఒక్క వ్యవసాయ కార్మిక కుటుంబం కూడా కౌలుసేద్యం చేయడం లేదు మొత్తం కౌలుభూమిలో 9 64%భూమిని భూస్వాములు, 48% భూమిని ధనికరైతులు, 33%భూమిని మధ్యతరగతి రైతులు, 8% భూమిని చిన్న రైతులు, 1.20%భూమిని సన్నకారురైతులు సేద్యం చేస్తున్నారు సహజంగా భూయాజమాన్యం తక్కువగా(పరిమాణంలో)వున్న చిన్న మరియు సన్నకారు రైతుల కంటే ఎక్కువ శాతం ధనిక మరియు మధ్యతరగతి రైతులు ఎక్కువ కుటుంబాలు మరియు ఎక్కువ భూమిని కౌలుకు చేస్తున్నారు. ఈ గ్రామంలో రివర్స్ టెనెన్సీ ఎక్కువగా వున్నట్లుగా చెప్పవచ్చును సామాజిక తరగతుల వారీగా కౌలుసేద్యాన్ని గమనించినపుడు మొత్తం కౌలుకు సాగుచేసే కుటుంబాల్లో ఎస్సిలు ఒకరు, బిసిలు 16 కుటుంబాలు కౌలుసేద్యం

చేస్తున్నాయి ఓసి సామాజిక తరగతికి చెందిన ఒక్క కుటుంబం కూడా కౌలుసేద్యం చేయకపోవడం గమనార్హం

## పశు సంపద

గ్రామములో మొత్తం 71(36%) కుటుంబాలు పశుసంపదను కల్గివున్నాయి మొత్తం పశువులు 190 వున్నాయి మొత్తం గొర్రెలు 196ఉన్నాయి ఒ సి 25 కుటుంబాలు, బిసి 39 కుటుంబాలు, ఎస్‌సి 7 కుటుంబాలు పశుసంపద కల్గివున్నాయి. ఒ సి సామాజిక తరగతిలో ఆవులు, గేదెలు పెంచి దగ్గరగా ఉన్న పట్టణప్రాంతాల్లో పాలు అమ్ముకుంటున్నారు 14కుటుంబాలు గొర్రెలపెంపకం ద్వారా జీవనోపాధిని పొందుతున్నాయి ఆరు భూస్వామ్య కుటుంబాలు, 18 ధనికరైతు కుటుంబాలు, 22 మధ్యతరగతిరైతు కుటుంబాలు, 12 చిన్నరైతు కుటుంబాలు, 29 సన్నకారురైతు కుటుంబాలు పశుసంపదను కల్గివున్నాయి మూడు భూమిలేని వ్యవసాయకార్మిక కుటుంబాలు పశుసంపదపై ఆధారపడి వున్నారు భూయాజమాన్యం కలిగిన ఆర్థిక తరగతలందరూ పశుసంపదను కలిగి వుండటం గమనార్హం

## వినిమయ వస్తువులు - సౌకర్యాలు

గ్రామములో 91% కుటుంబాలకు స్వంత ఇళ్ళున్నాయి ఈ గ్రామములో స్వంత ఇళ్ళ విషయంలో సామాజిక తరగతుల మధ్య అంతరాలు కొద్ది మాత్రమే ఉన్నాయి. ఒ.సి. సామాజిక తరగతిలో 94% కుటుంబాలకు స్వంత ఇళ్ళున్నాయి. యస్ సి లలో 89% కుటుంబాలకు స్వంత ఇళ్ళున్నాయి 93% బి సి కుటుంబాలకు స్వంత ఇళ్ళున్నాయి భూమిలేని వ్యవసాయ కార్మికకుటుంబాల్లో కేవలం 68% కుటంబాలకు మాత్రమే స్వంత ఇళ్ళన్నాయి. గ్రామములో 57% కుటుంబాలకు పక్కా ఇళ్ళున్నాయి ఎస్‌సి లలో పక్కా ఇళ్లు కల్గిన కుటుంబాలు ఎక్కువగా వున్నాయి యస్.సి. సామాజిక తరగతిలో పక్కా ఇళ్ళ శాతం అధికంగా ఉండటానికి కారణం ప్రభుత్వ పక్కా ఇళ్ళ నిర్మాణ పథకంలో యస్ సి లు ఎక్కువగా లబ్ది పొంది వున్నారు భూమిలేని వ్యవసాయకార్మికుల్లో కేవలం 41% కుటుంబాలకు మాత్రమే పక్కా ఇళ్ళన్నాయి మొత్తము 17 (8 59%) కుటుంబాలు అద్దె ఇండ్లల్లో నివాసముంటున్నాయి మొత్తము 13కుటుంబాలు (6.57%)కు ట్రాక్టర్లున్నాయి బి సి. కుటుంబాలు 7, ఒ.సి కుటుంబాలు 6 ట్రాక్టర్లను కలిగి వున్నాయి 58 కుటుంబాలు (29%) సైకిళ్ళను కలిగి వున్నాయి యస్.సి లలో 14 కుటుంబాలు (23%), బి సి లలో 34 కుటుంబాలు (34 34%),

ఒ సి లలో 10 కుటుంబాలు (29%), సైకిళ్ళను కలిగి వున్నాయి 6% కుటుంబాలు స్కూటర్లను కలిగి వున్నాయి గ్రామములో 36% కుటుంబాలు మోటరుసైకిళ్ళను కలిగి వున్నారు మోటరుసైకిళ్ళు ఒ సి సామాజిక తరగతిలోని 49% కుటుంబాలకంటే, బి సి లలో 31%, యస్ సి లలో 35% కుటుంబాలకు స్వంత మోటరు సైకిళ్ళున్నాయి 4 కుటుంబాలకు స్వంత కార్లున్నాయి రెండు వెనుకబడిన తరగతుల కుటుంబాలకు, ఒక దళిత కుటుంబానికి, ఒక అగ్రకుల కుటుంబానికి కార్లున్నాయి ఒక వ్యవసాయ కార్మిక కుటుంబము స్వంతకారును కలిగి వుంది దీన్ని బాడుగకు నడపడం ద్వారా ఆ కుటుంబం అదనపు ఆదాయం పొందుతున్నది గ్రామములో మొత్తం 5 కుటుంబాలకు ఆటోలున్నాయి నాలుగు బి సి కుటుంబాలకు ఒక యస్ సి. కుటుంబానికి, ఆటోలున్నాయి

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 22% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 25% భూమి మాత్రమే వుంది. 19% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

గ్రామములో సగటున 75 25% కుటుంబాలకు టి వి లున్నాయి అత్యధికంగా ఒ సి సామాజిక తరగతిలో 86 %కుటుంబాలకు టి వి లున్నాయి ఆ తరువాత 76% బి సి కుటుంబాలకు టి వి లున్నాయి యస్ టి లలో 69% కుటుంబాలకు టి వి లున్నాయి 98 % కుటుంబాలకు కరెంటు సౌకర్యము ఉన్నది దాదాపు అన్ని సామాజిక తరగతులకు చెందిన కుటుంబాలకు సమాన స్థాయిలో కరెంటు సౌకర్యము ఉన్నది ఈ గ్రామములో కేవలం 32 శాతం కుటుంబాలకు మాత్రమే లెట్రిన్ సౌకర్యం ఉన్నది అంటే 68%కుటుంబాలకు లెట్రిన్ సౌకర్యము లేదు వ్యవసాయకార్మికుల్లో కేవలం 73%కుటుంబాలకు మాత్రమే లెట్రిన్ సౌకర్యము లేదు అన్ని సామాజిక తరగతుల్లో ఈ అంతరము ఎక్కువగా లేకపోవటం గమనార్హం గ్రామములో సెల్‌ఫోన్ సౌకర్యం అన్ని సామాజిక తరగతులలో దాదాపు సమానంగా వున్నది 89% కుటుంబాలకు గ్రామములో సెల్‌ఫోన్ సౌకర్యము ఉన్నది సన్నకారు రైతులు మరియు భూమి లేని వ్యవసాయ కార్మికుల్లో వరుసగా 34%, 18% కుటుంబాలకు మాత్రమే వంట గ్యాస్ సౌకర్యము ఉన్నది

# వరంగల్ జిల్లా

## గంగదేవిపల్లి

### స్థూల చిత్రణ

సుందరయ్య విజ్ఞాన కేంద్రం 2013-2014 సంవత్సరంలో నిర్వహించిన గ్రామీణ సామాజిక ఆర్థిక సర్వేలో భాగంగా వరంగల్ జిల్లా గంగదేవిపల్లి గ్రామంలో 2013 డిశంబరులో తొలి దఫా, 2014 జూన్‌లో మలి దఫా సర్వే నిర్వహించాము మండల కేంద్రం గీసుకొండకు 12 కిలోమీటర్ల దూరంలో వరంగల్ నర్సంపేట రహదారిపై ఉన్న గ్రామం గంగదేవిపల్లి బోర్లు ప్రధానసాగునీటి వనరుగా ఉన్నాయి వరంగల్ జిల్లా కేంద్రానికి సమీపంలో ఉండటంతో వ్యవసాయేతర ఉపాధులు ద్వారా కూడా గ్రామస్తులకు గణనీయమైన ఆదాయం సమకూరుతోంది బస్ సౌకర్యంతో పాటు ఆటోలు రవాణా సాధనాలుగా ఉన్నాయి కూరగాయలు, పశువుల మేత, మిర్చి, గోధుమ, పత్తి, వరి, వేరుశనగ ఈ గ్రామంలో ప్రధాన పంటలు. పలు మార్లు ఆదర్శగ్రామంగా వివిధ జాతీయ అంతర్జాతీయ సంస్థల ద్వారా గుర్తించబడి బహుమతులు అందుకున్న ఈ గ్రామంలో మౌలిక వసతులు చాలా మెరుగ్గా ఉన్నాయి గ్రామం మొత్తం సిమెంట్ రోడ్లు, మురుగు కాలువలు నిర్మించబడి ఉన్నాయి పరిపాలన యావత్తూ వివిధ కమిటీల ద్వారా జరుగుతుంది చాలా కాలంపాటు ఏకాభిప్రాయంతోనే పంచాయితీ సర్పంచిని ఎన్నుకున్న గ్రామంగా రికార్డు సృష్టించిన గ్రామం ఇది. గ్రామంలో బహిరంగ ప్రదేశాల్లో మలమూత్ర విసర్జన చేస్తే అపరాధరుసుము చెల్లించాల్సి ఉంటుంది గ్రామంలో మద్యం దుకాణం ఉండకూడదన్న పంచాయితీ నిర్ణయం రెండు దశాబ్దాల నుండీ అమలు జరుగుతోంది పోస్టాఫీసు, విద్యుత్ ట్రాన్స్‌ఫార్మరు, రక్షిత మంచినీటి పథకం, పంచాయితీ భవనం, మాధ్యమిక, ఉన్నత పాఠశాల, రేషను దుకాణం, అంగన్‌వాడీ కేంద్రం ఉన్నాయి.

## జనాభా పొందిక

గ్రామంలో మొత్తం 297 కుటుంబాల్లో 1181 మంది జనాభా ఉన్నారు వీరిలో 595 మంది పురుషులు 586 మంది స్త్రీలు లైంగిక నిష్పత్తి 985 అంటే వెయ్యి మంది పురుషులకు 985 మంది స్త్రీలు ఉన్నారు రాష్ట్ర లైంగిక నిష్పత్తికి (988) దాదాపు దగ్గరగా ఉంది గ్రామ సగటు లైంగిక నిష్పత్తి కంటే గిరిజనుల్లో లైంగిక నిష్పత్తి కేవలం 636, అతి తక్కువగా ఉంటే 1118 లైంగిక నిష్పత్తితో అగ్రకులాలు ముందజంలో ఉన్నాయి వెనకబడిన తరగతుల్లో ఇది 990 2011 జనాభా లెక్కల ప్రకారం జిల్లాల్లో లైంగిక నిష్పత్తి 999 గ్రామ స్థూల లైంగిక నిష్పత్తి జిల్లా సగటు కంటే తక్కువగా ఉంటే అగ్రకులాల్లో ఈ నిష్పత్తి జిల్లా సగటును మించి ఉన్నది సర్వే కుటుంబాల్లో అగ్రకులాలకు చెందిన కుటుంబాలు కేవలం 18, మరియు గిరిజన కుటుంబాలు తొమ్మిది మాత్రమే కావటం ఈ వ్యత్యాసాలకు కారణంగా ఉంది

## అయుఃప్రమాణం

గ్రామంలో ఏడు శాతం జనాభా (79 మంది) సెన్సెస్ సర్వే సమయానికి ఐదేళ్ల లోపు వయసున్న వారు కాగా మరో ఏడు శాతం జనాభా 6నుండి 10 ఏళ్ల లోపు వయసు కలిగిన వారు 6 -15 సంవత్సరాల వయసు వరకు పారశాల కెళ్లే వయసు అని నిర్ధారించుకుంటే మొత్తం గ్రామంలో దాదాపు 16 శాతం జనాభా (183 మంది) పారశాలకు వెళ్లగలిగిన వయసులో ఉన్న జనాభా 16 సంవత్సరాల నుండి 60 సంవత్సరాల వయసు కలిగిన జనాభాను శ్రమ చేయగలిగిన జనాభాగా పరిగణిస్తే ఈ గ్రామంలో 70 శాతం జనాభా ఈ వయసులకు చెందిన వారు ఉన్నారు ఏ గ్రామానికైనా ఇది చాలా ఎక్కువ అనే చెప్పాలి గ్రామంలో ఏడు శాతం వృద్ధులు ఉన్నారు గ్రామ జనాభాలో 50 శాతం మంది యువత (16సం నుండి 40 వరకు) వున్నది

## సామాజిక పొందిక

గ్రామంలో మొత్తం 297 కుటుంబాల్లో 90 శాతం కుటుంబాలు వెనకబడిన తరగతులకు చెందిన కుటుంబాలే. అగ్రకులాలకు చెందిన కుటుంబాలు కేవలం 6 శాతం, గిరిజనులు 3 శాతం, దళితులు 1 శాతం మాత్రమే ఉన్నారు జిల్లాల్లో 2011 జనాభా లెక్కల ప్రకారం సగటు దళిత జనాభా నిష్పత్తి 17 54 శాతంగా ఉంది దీంతో పోల్చి చూస్తే ఈ గ్రామంలో దళితుల జనాభా చాలా తక్కువగా ఉంది కులాల వారీగా

పరిశీలిస్తే యాదవకులానికి చెందిన కుటుంబాలు 66 ఉన్నాయి మున్నూరుకాపులు 38, కుటుంబాలు రెడ్డి 12, నాలుగు ఒడ్డెర, 27 పద్మశాలి, మూడు రజక, ఒకటి వైశ్య, రెండు సుగాలి, ఆరు ఎరుకుల, గౌడ 3, ఒకటి మాదిగ కులానికి చెందిన కుటుంబం ఉన్నాయి సామాజిక ఆధిపత్యం సంఖ్య రీత్యా చూసుకున్నపుడు యాదవ కుటుంబాలదే కానీ మున్నూరు కాపు కుటుంబాలు సామాజిక సమీకరణల ద్వారా తమ ఆధిపత్యాన్ని కొనసాగిస్తున్నాయి మొత్తం కుటుంబాల్లో స్త్రీల యాజమాన్యం 36 కుటుంబాలు (12%) వున్నాయి

## జీవనోపాధి వైవిధ్యం

గ్రామంలో చెప్పుకోదగ్గ రీతిలో జీవన వైవిధ్యం కనిపిస్తుంది గ్రామంలో 164 కుటుంబాలు సేద్యమే ప్రధాన ఉపాధి అని పేర్కొన్నాయి. మొత్తం గ్రామంలోని కుటుంబాల్లో వీరు 55 శాతంగా ఉన్నారు వీరిలో 54 కుటుంబాలు, అంటే సేద్యం ప్రధాన ఉపాధి అని చెప్పిన వారిలో మూడో వంతుమంది , వ్యవసాయకూలీ ద్వితీయ ప్రాధాన్యత కలిగిన వృత్తి అని వెల్లడించారు. మరో ఆరు రైతు కుటుంబాలు వ్యవసాయేతర వృత్తులు తమ ద్వితీయ ప్రాధాన్యత కలిగిన ఉపాధి వనరులని పేర్కొన్నాయి 54 కుటుంబాలు, మొత్తం కుటుంబాల్లో ఆరోవంతు వ్యవసాయ కూలీ పనులు తమ ప్రధాన జీవనాధారం అని పేర్కొన్నాయి. గ్రామంలోని పదో వంతు కుటుంబాలు (35) కుటుంబాలు వివిధ రకాలైన ఉద్యోగాలు, ప్రభుత్వ ఉద్యోగాలు, ప్రైవేటు ఉద్యోగాలు, స్వయం ఉపాధి పనులపై జీవనోపాధి కోసం ఆధారపడుతున్నట్లు వ్యక్తం చేశాయి 10 కుటుంబాలు వ్యవసాయేతర కార్మికులుగా పని చేస్తున్నట్లు, తొమ్మిది కుటుంబాలు వ్యాపారం చేస్తున్నట్లు వెల్లడించారు 12 కుటుంబాలు జీవనోపాధి కోసం సాంప్రదాయ కులవృత్తులపై ఆధారపడుతున్నట్లు సర్వేలో వెల్లడైంది

## సాగుభూమి

గ్రామంలో మొత్తం 751 ఎకరాల సాగు భూమి నమోదు అయ్యింది ఇందులో 555 ఎకరాలు స్వంత భూమి కాగా మిగిలింది 196 ఎకరాలు కౌలు భూమి. స్వంత భూమిలో 339 ఎకరాలు నీటితీరువా కలిగిన భూమి అంటే స్వంత భూమిలో 61 శాతం సాగు భూమికి ఏదో ఒకరకమైన సాగునీటి వసతి ఉన్నట్లు నిర్ధారణ అవుతుంది స్వంత భూమిలో మిగిలిన 216 ఎకరాలు మెట్ట భూమి కేవలం నాలుగు ఎకరాలు మాత్రమే పడావుగా ఉన్న భూమి. సర్వేలో నమోదైన స్వంత భూమి యాజమాన్యంలో

66 5 ఎకరాలు అగ్రకులాల చేతుల్లో ఉంటే మిగిలిన భూమి మొత్తం వెనకబడిన తరగతుల చేతుల్లో కేంద్రీకృతమై ఉంది వెనకబడిన కులాల జనాభా నిష్పత్తి జనాభాలో 90 శాతం ఉంది అని చెప్పుకున్నాము భూయాజమాన్యంలో వారి వాటా 88 శాతంగా ఉంది.

**సాగుదారులు - కౌల్దారులు**

మొత్తం 177 కుటుంబాలు భూమి కలిగిన కుటుంబాలు కాగా 14 కుటుంబాలు భూమిని కౌలుకు ఇచ్చి ఇతర ఉపాధి వైపు మళ్లినట్లు గణాంకాలు చెప్తున్నాయి స్థూలంగా స్వంత సేద్యం చేస్తున్న కుటుంబాలు 163 అని నిర్ధారించవచ్చు మరో 74 కుటుంబాలు కౌల్దారులు ఉన్నారు వీరిలో 11 మంది (7 శాతం) స్వంత భూమి లేని కౌల్దారులు కాగా మిగిలిన వారంతా ఎంతో కొంత స్వంత భూమి సేద్యం చేస్తూ అదనంగా భూమిని కౌలుకు తీసుకున్నట్లు వెల్లడవుతోంది.కౌల్దారుల్లో 13 మంది మున్నూరు కాపు కులానికి చెందిన వారు వీరి చేతుల్లో 29 5 ఎకరాల కౌలు భూమి సాగవుతోంది 15 మంది యాదవ కులానికి చెందిన వారు వీరు 46 5 ఎకరాలు కౌలు సేద్యం చేస్తున్నారు మిగిలింది వేర్వేరు కులాల వారు సాగు చేస్తున్నారు ఆర్థిక తరగతుల వారీ పరిశీలిస్తే 6 శాతంగా ఉన్న ధనిక రైతాంగం గ్రామంలో నమోదై స్వంత భూమిలో 19 శాతం వాటా కలిగి ఉంటే నికర సాగు భూమిలో 23 శాతం వాటా కలిగి ఉంది 18 శాతంగా ఉన్న మధ్యతరగతి రైతాంగానికి స్వంత భూమిలో 40 శాతం వాటా ఉంటే నికర సాగు భూమిలో 43 శాతం వాటా కలిగి ఉంది. చిన్న సన్నకారు రైతులు స్వంత భూమి విస్తీర్ణం కంటే వారి చేతుల్లో ఉన్న నికర సాగు భూమి విస్తీర్ణం తక్కువగా ఉండటాన్ని గమనిస్తే గ్రామంలో రివర్స్ కౌలు ధోరణి ప్రారంభమైంది అని నిర్ధారించవచ్చు నమోదైన కౌలు భూమిలో సింహభాగం ధనిక (36%), మధ్యతరగతి (43%) రైతాంగమే సాగు చేస్తోంది

**భూ కేంద్రీకరణ**

గ్రామంలో 297 కుటుంబాల్లో 177 కుటుంబాలకు స్వంత భూమి ఉన్నది. అంటే మొత్తం గ్రామంలో 59 శాతం కుటుంబాలకు స్వంత భూమి ఉన్నది మిగిలిన 41 శాతం కుటుంబాలకు స్వంత భూమి లేదు. స్వంత భూమి మొత్తం 555 ఎకరాలు కాగా ఇందులో నాలుగు కులాల చేతుల్లో 293 ఎకరాలు కేంద్రీకృతమై ఉంటే మిగిలిన అన్ని కులాల చేతుల్లో 262 ఎకరాలు కేంద్రీకృతమై ఉంది పైన ఉన్న 10% కుటుంబాల చేతుల్లో అంటే 29 కుటుంబాలకు194 ఎకరాలు ఉంటే దిగువన ఉన్న 50%, అంటే 149 కుటుంబాల చేతుల్లో కేవలం 20 ఎకరాలు మాత్రమే ఉంది

## భూ కేంద్రీకరణ తీవ్రత

భూ కేంద్రీకరణ తీవ్రతను అంచనా వేయటానికి స్వంత భూమిని ప్రమాణంగా తీసుకుని సగటు కుటుంబ కమతం విస్తీర్ణం నిర్ధారించి సగటు కుటుంబ కమంత కంటే ఎక్కువ భూమి కలిగిన కుటుంబాల శాతాన్ని లెక్కించే ప్రయత్నం చేశాము ఈ గ్రామంలో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 1 86 ఎకరాలు అగ్రభాగాన ఉన్న 29 కుటుంబాల చేతుల్లో కేంద్రీకతమై ఉన్న భూమి 194 ఎకరాలు అంటే ఈ 29 కుటుంబాల చేతుల్లో ఉన్న సగటు కుటుంబ కమతం విస్తీర్ణం గ్రామ సగటు కుటుంబ కమతం కంటే మూడున్నర రెట్లు ఎక్కువ అట్టగున ఉన్న 50 శాతం కుటుంబాల చేతుల్లో ఉన్న భూమి కేవలం 20 ఎకరాలు వీరి సగటు కుటుంబ కమతం 13 సెంట్లు మాత్రమే భూమి లేని కుటుంబాలను పక్కన పెట్టినా భూమి కలిగిన కుటుంబాల్లో సైతం మరో 16 శాతం కుటుంబాలు సగటు కుటుంబ కమతం కంటే తక్కువ విస్తీర్ణంలో స్వంత భూమిని కలిగి ఉన్నాయి. ఆర్థిక తరగతుల వారీ భూ కేంద్రీకరణలో వ్యత్యాసాలు ఇలా ఉన్నాయి ధనిక రైతుల సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 5 84 ఎకరాలు కాగా మధ్యతరగతి రైతుల కుటుంబ సగటు కమతం విస్తీర్ణం 4 26 ఎకరాలు, చిన్న రైతుల్లో 2 58 ఎకరాలు, సన్నకారు రైతుల్లో 1 41 ఎకరాలు, భూమి కలిగిన వ్యవసాయ కార్మికుల్లో 96 సెంట్లు, భూమి లేని వ్యవసాయ కార్మికుల్లోసగటు కుటుంబ కమతం విస్తీర్ణం 35 సెంట్లు, వృత్తిదారుల కుటుంబాల్లో 31 సెంట్లు సగటు కుటుంబ కమతం విస్తీర్ణంగా ఉంది ధనిక రైతు వర్గం సగటు కుటుంబ కమతం వ్యవసాయ కార్మికుల సగటు కుటుంబ కమతం విస్తీర్ణంతో పోల్చినపుడు 18 83 రెట్లు ఎక్కువగా ఉంది అగ్రకులాల్లో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 4 30 ఎకరాలుగా ఉంటే, వెనకబడిన తరగతుల్లో 1.76 ఎకరాలుగా ఉంది. దళితులు గిరిజన కుటుంబాల్లో ముందే చెప్పుకున్నట్లు అన్నీ భూమి లేని కుటుంబాలే

## ఆర్థిక తరగతుల పొందిక

నికర సాగు విస్తీర్ణాన్ని, స్వంత శ్రమ, కూలికి వెళ్లిన శ్రమ వంటి అనేక ప్రమాణాలను మేళవించి గ్రామంలోని కుటుంబాలను వివిధ ఆర్థిక వర్గాలుగా విభజించటం జరిగింది ధనిక రైతులు 6 5%, మధ్యతరగతి రైతులు 17 5 శాతం, చిన్న రైతులు 15 శాతం, సన్నకారు రైతులు 16%, భూమి కలిగిన వ్యవసాయ కార్మికులు 4 శాతం, భూమి లేని వ్యవసాయ కార్మికులు 19%, వృత్తి దారులు రెండు శాతం, వ్యవసాయేతర





కార్మికులు 4 7%, వ్యాపారస్తులు రెండున్నర శాతం, ఉద్యోగులు 6 9% ఉన్నారు. నికరసాగు విస్తీర్ణం ప్రాతిపదికన ఈ వర్గీకరణ జరిగింది వివిధ ఆర్థిక వర్గాల మధ్య నికర సాగు భూమి పంపిణీ ఎలా ఉందో పరిశీలిద్దాం గ్రామంలో 6 5 శాతంగా ఉన్న ధనిక రైతులు 26 శాతం భూమి సాగు చేస్తుంటే 17%గా ఉన్న మధ్యతరగతి రైతాంగం 44% భూమి సాగు చేస్తున్నారు 15 శాతంగా ఉన్న చిన్న రైతులు 19%భూమి సాగు చేస్తుంటే 15 శాతంగా ఉన్న సన్నకారు రైతులు కేవలం 10శాతం సాగుభూమితో సరిపెట్టుకుంటున్నారు

**అక్షరాస్యత**

గ్రామంలో 66% అక్షరాస్యత వుంది ఇంత ఆదర్శ గ్రామంలో సాధారణ అక్షరాస్యత స్థాయికి పరిమితం కావటం గమనించ దగ్గ విషయం అయితే జిల్లా సగటు అక్షరాస్యతతో పోల్చుకున్నపుడు గ్రామంలో అక్షరాస్యత శాతం కాస్త ఎక్కువ జిల్లాలో సగటు అక్షరాస్యత శాతం 65 11 శాతంగా ఉంటే దళితుల్లో ఇది 61 79 శాతం, ఆదివాసీల్లో 48 45 శాతం మాత్రమే ఉంది గ్రామ జనాభాలో 90 శాతానికి పైగా ఉన్న వెనకబడిన కులాల్లో అక్షరాస్యత 60 శాతం మాత్రమే ఉంది ఎస్టీ సామాజిక తరగతిలో 55 శాతం, బీసీల్లో 66.32 శాతం, అగ్రకులాల్లో 69 44 శాతం అక్షరస్యాత ఉండటాన్ని గమనిస్తే అక్షరాస్యతలో వివిధ సామాజిక వర్గాల మధ్య ఉన్న అంతరాలు వెల్లడవుతున్నాయి. 17%జనాభా ప్రాధమిక విద్యా స్థాయికి పరిమితం కాగా మరో 23 శాతం ఉన్నత పారశాల వరకు చదువుకున్నారు. 10 %ఇంటర్మీడియట్ విద్యావంతులు, మరో 10 శాతం పట్టభద్రులు ఉంటే నాలుగు శాతం యూనివర్శిటీ స్థాయి విద్య చదివిన వారున్నారు అన్ని విద్యా స్థాయిలో వెకబడిన కులాలతో పోల్చినపపుడు వెనకంజలో ఉన్న అగ్రకులాలు ఇంటర్మీడియట్, డిగ్రీ స్థాయి విద్యావంతుల విషయంలో ముందంజలో ఉన్నారు యూనివర్శిటి విద్యా స్థాయిలో వెనకబడినతరగతులకు చెందిన కుటుంబాలు వున్నాయి. స్త్రీ పురుషుల మధ్య అక్షరాస్యత రేటు విషయానికి వస్తే అంతరాలు కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి ఎస్టీ, బిసి, ఒసీల్లో స్త్రీల అక్షరాస్యత శాతం పురుషుల అక్షరాస్యత శాతం కంటే వరుసగా 33%, 22%, 35 శాతం తక్కువగా ఉంది. ఆదర్శ గ్రామమైనా లైంగిక వివక్షను అధిగమించలేకపోయిందన్న విషయాన్ని ఈ వివరాలు వెల్లడిస్తున్నాయి.

## గృహవసతులు

ఈ గ్రామంలో 89% కుటుంబాలకు స్వంత ఇళ్లు ఉన్నాయి పక్కా ఇళ్లు కలిగి ఉన్న వారు 76 శాతం మిగిలిన గ్రామాలతో పోల్చినపుడు నివాస వసతి విషయంలో ఈ గ్రామం ముందంజలో ఉన్నదని ఈ పక్కా గృహాల నిష్పత్తి తెలియచేస్తోంది 10 శాతం కుటుంబాలు అద్దె ఇళ్లల్లో నివాసం ఉంటున్నారు బిసి సామాజిక తరగతికి చెందిన 15శాతం కుటుంబాలు కచ్చా ఇళ్లల్లో నివసిస్తున్నాయి గ్రామ జనాభాలోలో వీరి సంఖ్యాపరమైన ఆధికత్యకు అనుగుణంగానే అద్దెకుంటున్న కుటుంబాల్లో కూడా వీరి సంఖ్యే ఎక్కువగా వున్నది ఇవి కాక గ్రామంలో 178 సైకిళ్లు, తొమ్మిది స్కూటర్లు, 99 మోటార్ సైకిళ్లు ఉన్నాయి వరంగల్ సమీపాన ఉండటం, గణనీయమైన మోతాదులో పాడి పరిశ్రమ, వ్యవసాయేతర ఉపాధులపై ఆధారపడిన కుటుంబాలు ఉండటంతో ప్రైవేట్ వాహన వినియోగం సాధారణ స్థాయి కంటే ఎక్కువగా ఉండటానికి కారణాలుగా కనిపిస్తున్నాయి ఏడు కుటుంబాలకు కార్లు కూడా ఉన్నాయి మరో ఎనిమిది కుటుంబాలకు స్వంత ఆటోలు ఉన్నాయి అత్యధికంగా భూమి లేని వ్యవసాయకార్మికులలో స్వంతఇల్లు లేనివారు ఎక్కువగా వున్నారు స్వంత ఇల్లు ఉన్న ఈ తరగతి కుటుంబాల్లో కచ్చా ఇళ్లల్లో నివశిస్తున్నవారు ఎక్కువగా ఉన్నారు

## పశుసంపద

మొత్తం 35 కుటుంబాల్లో 69 ఎద్దులు, 87 కుటుంబాల్లో 167 ఆవులు, గేదెలు, 25 కుటుంబాల్లో 587 గొర్రెలు, మేకలు ఉన్నాయి గ్రామంలో ఉన్న మూడు ట్రాక్టర్లు మధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతు కుటుంబాల్లో ఉంటే పశు సంపద విషయంలో ధనిక, మధ్యతరగతి రైతు కుటుంబాలు ముందంజలో ఉన్నాయి ట్రాక్టర్ కలిగిన మూడు కుటుంబాలు బిసిల కుటుంబాలే కావడం గమనార్హం సాధారణంగా వ్యవసాయ కార్మికులు, చిన్న సన్నకారు రైతుల కుటుంబ ఆదాయంలో పాడి ద్వారా వచ్చే ఆదాయం వేడినీళ్లకు చన్నీళ్లు తోడు అన్నట్లు ఉండేది ఈ గ్రామంలో పశుసంపద దిగువ తరగతుల కుటుంబాల్లో లేకపోవటం ఈ మధ్య కాలంలో గమనించాల్సిన పరిణామంగా ఉంది పైగా కూరగాయలు, మిర్చి వంటి పంటలు ప్రధాన పంటలు కావటంతో ఆ పంటల సేద్యంలో యంత్రాల వినియోగానికి అవకాశాలు పరిమితమే అందుకే సేద్యానికి

అక్కరకొచ్చే పశుసంపద నమోదు అయ్యింది గ్రామంలోని 69 ఎద్దులలో 59 ఎద్దులు, 167 పాడిపశువుల్లో 159, 587 గొర్రెల్లో మొత్తానికి మొత్తం బిసి కుటుంబాల యాజమాన్యంలోనే వున్నాయి

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 21% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 12% భూమి మాత్రమే వుంది. 41% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

**వినిమయ వస్తువులు**

గ్రామంలో 72 శాతం కుటుంబాలకు టివిలు ఉన్నాయి 96 శాతం ఇళ్లకు విద్యుత్ సౌకర్యం ఉన్నది లెట్రిన్‌లు కూడా 95 శాతం ఇళ్లకు ఉన్నాయి ఈ గ్రామంలో బహిరంగ మలమూత్ర విసర్జన సాంఘిక అపరాధం అన్న సూత్రం గత రెండు దశాబ్దాలుగా అమలు జరుగుతోంది దేశంలో స్వచ్ఛ భారత్ అభియాన్ ప్రారంభం కావటానికి చాలా కాలం ముందే ఈ పథకం ఈ గ్రామంలో అమలు జరిగిందని పై వివరాలు రుజువు చేస్తున్నాయి 86 శాతం కుటుంబాలకు మాత్రమే సెల్‌ఫోన్లు ఉన్నాయి అదేవిధంగా వంటగ్యాస్ కనెక్షన్లు కలిగిన కుటుంబాలు 69 శాతం మాత్రమే ఉన్నాయి గ్రామంలో వున్న 178 సైకిళ్లలో 167, 9 స్కూటర్లలో 8, 99 మోటరు సైకిళ్లలో 90, 8 ఆటోలలో 7 బిసిలకే వున్నాయి.

# ఖమ్మం జిల్లా

## విప్పలమడక

### ముఖచిత్రం

సుందరయ్య విజ్ఞాన కేంద్రం 2013-14 లో నిర్వహించిన గ్రామీణ సామజిక ఆర్థిక సర్వేలో భాగంగా ఖమ్మం జిల్లా విప్పలమడక గ్రామాన్ని 2013 డిశంబరులో తొలి విడత, 2014 ఫిబ్రవరిలో మలి విడత సర్వే చేయటం జరిగింది గ్రామాన్ని సెన్సస్ మరియు శాంపిల్ సర్వే చేశాం సెన్సస్ సర్వేలో వెల్లడైన అంశాలను పేర్కొంటున్నాం

ఉత్తర తెలంగాణలో ఖమ్మం జిల్లాలోని వైరా మండలంలో విప్పలమడక గ్రామం వున్నది మండల కేంద్రానికి 15 కిలోమీటర్ల దూరంలో వుంటుంది గ్రామానికి బస్సు, ఆటో రవాణా సౌకర్యం వున్నాయి. గ్రామంలో అత్యధిక భాగం ఆయకట్టు ప్రాంతం. సాగర్ ఎడమకాల్వ నీరు వస్తుంది. గ్రామంలో పోస్టాఫీసు, విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్, రక్షిత మంచినీటి సౌకర్యం వున్నది పంచాయితీ భవనం, ప్రాథమికోన్నత పాఠశాల, చౌకధరల దుకాణం, అంగన్వాడీ కేంద్రం వున్నాయి. రాజకీయంగా చూస్తే ఈ గ్రామంలో మార్క్సిస్టు పార్టీ గణనీయంగా వున్నది

### జనాభా వివరాలు

మా సెన్సస్ సర్వే ప్రకారం 375 కుటుంబాలు వున్నాయి మొత్తం జనాభా 1364 ఇందులో పురుషులు 697, స్త్రీలు 667 మంది లైంగిక నిష్పత్తి 957 అంటే ప్రతి వెయ్యి మంది పురుషులకు 957 మంది స్త్రీలు వున్నారు. స్త్రీల సంఖ్య ఓసి సామాజిక తరగతిలో గ్రామం సగటు నిష్పత్తి కంటె తక్కువగా వున్నది 2011 జనాభా లెక్కల

ప్రకారం రాష్ట్ర లింగ నిష్పత్తి 988 రాష్ట్ర సగటు కంటె బాగా తక్కువగా వున్నది. జిల్లాలో లింగ నిష్పత్తి 1003. అంటే ఈ గ్రామంలో స్త్రీల సంఖ్య బాగా తక్కువగా వున్నట్లు అర్థమౌతున్నది సామాజిక తరగతుల వారీ చూస్తే ఎస్‌సి 582 (43%), ఎస్‌టి 9 (0 65), బిసి 407 (30%), ఓసి 362 (26%), ఇతరులు నలుగురు వున్నారు. రాష్ట్రంలో ఎస్‌సి జనాభా 15.45శాతం, జిల్లాలో 16.84 శాతం వుంటే ఈ గ్రామంలో 43శాతం వున్నారు ఎస్‌టి జనాభా నామమాత్రంగా 0 65 శాతం వున్నారు

## సామాజిక పొందిక

మతాల ప్రాతిపదికన చూస్తే హిందువులు 299 కుటుంబాలు (80%) వుంటే, క్రిస్టియన్ కుటుంబాలు 75 (20%) వున్నాయి ముస్లింలు లేరు ఈ గ్రామంలోని మొత్తం 375 కుటుంబాలలో ఎస్‌సి కుటుంబాలు 154 (41%), ఎస్‌టి కుటుంబాలు రెండు, బిసి 123 (33%), ఓసి 95 (25%) వున్నాయి కులాల వారీగా చూస్తే మొత్తం 15 కులాలు వున్నాయి. మాల కులం కుటుంబాలు ఎక్కువగా వున్నాయి కమ్మ 76 (20%), మాదిగ 40 (11%), మాల 114 (30%), ముదిరాజ్ 6 (2%), మున్నూరు కాపు 23 (6%), నాయీబ్రాహ్మణ 3, రజక 60 (16%), సుగాలీ రెండు, విశ్వబ్రాహ్మణ 9, వైశ్య మూడు, యాదవ 14 (4%), ఇతరులు 21 (6%) బోయ, కాపు, పద్మశాలి, రెడ్డి తక్కువగా వున్నారు.

## జీవనోపాధి

గ్రామంలో సేద్యమే ప్రధాన జీవనోపాధిగా వున్న కుటుంబాలు 194(51%) వున్నాయి వ్యవసాయ కూలీపై ఆధారపడిన కుటుంబాలు 140 (37%) వున్నాయి. మొత్తంగా వ్యవసాయరంగంపై ఆధారపడిన కుటుంబాల శాతం చూస్తే 80%పైగా వున్నట్లు అర్థం మాదిగ కుటుంబాలు 40 వుంటే అందులో నాలుగు కుటుంబాలకు మాత్రమే కొద్దిభూమి వున్నది మిగిలిన వారంతా వ్యవసాయ కార్మికులుగా జీవిస్తున్నారు ఒక్క కుటుంబం కాంట్రాక్టరుగా వున్నారు 114 మాల కుటుంబాల్లో 65 కుటుంబాలకు భూమి లేదు. 23 మున్నూరు కాపు కుటుంబాల్లో 15 కుటుంబాలకు భూమి లేదు. ప్రభుత్వ, ప్రయివేటు ఉద్యోగులు 9 కుటుంబాలు వున్నాయి వ్యాపారాలు చేస్తున్న కుటుంబాలు 9 వున్నాయి 80% రజక కుటుంబాలకు భూమిలేదు వృత్తే ప్రధాన జీవనోపాధిగా జీవిస్తున్న కుటుంబాలు తక్కువగా వున్నాయి. నాయీబ్రాహ్మణ, రెడ్డి,

కాపు, వ్యవసాయ కార్మికులుగా వున్నారు విశ్వబ్రాహ్మణ 9 కుటుంబాల్లో వృత్తులో ఐదుగురు వున్నారు డ్రైవర్స్‌గా మూడు కుటుంబాలు వున్నాయి ఇందులో మున్నూరుకాపు రెండు, ఒకరు మాల వున్నారు ఒకే కుటుంబంగా వున్న పద్మశాలి ఆర్ఎంపి గా వున్నారు రెండు కుటుంబాలుగా వున్న సుగాలీల్లో ఒక కుటుంబం టైలర్‌గా వున్నది గ్రామంలో పెన్షన్ సౌకర్యం పొందుతున్న కుటుంబాలు 8 వున్నాయి స్త్రీల యాజమాన్యంలో వున్న కుటుంబాలు 30 అంటే 8శాతం వున్నాయి

**అక్షరాస్యత**

గ్రామంలో చదువుకున్న వారు 62శాతం వున్నారు ప్రభుత్వ లెక్కల ప్రకారం తెలంగాణ రాష్ట్ర సగటు 66 54శాతం జిల్లాలో 65 75శాతం అంటే రాష్ట్ర, జిల్లా సగటు కంటే తక్కువగా వున్నదన్న మాట ఓసి సామాజిక తరగతిలో 68శాతం వున్నది ప్రభుత్వ లెక్క ప్రకారం ఎస్‌సిలలో అక్షరాస్యత 62 90శాతం వుంటే ఇక్కడ57శాతం మాత్రమే వున్నది అంటే గ్రామంలో ఎస్‌సిలలో ఇంకా 43%శాతం మంది చదువురాని వారు వున్నారు బిసిలలో 62% వరకు వున్నది పురుషుల్లో అక్షరాస్యత 66%, స్త్రీలలో 55% వున్నది ఎస్‌సి, బిసిలలో స్త్రీల అక్షరాస్యత 50%గా వున్నది

ఏయే స్థాయి వరకు ఎంతెంత మంది చదువుకున్న వారు వున్నారో పరిశీలించాం సెకండరీ స్థాయి వరకు 351 మంది వున్నారు. ఇంటర్ చదివిన వారు 112 మంది వున్నారు డిగ్రీ వరకు చదివిన వారు 115 మంది వున్నారు పిజి వరకు చదివిన వారు ఊర్లో 28 మంది అందులో సగం ఓసి తరగతికి చెందినవారు పిహెచ్‌డి చేసిన వారు ఎవరూ లేరు

**ఆయుఃప్రమాణం**

గ్రామంలో యువత (16నుండి 40 సం వరకు ) దాదాపు 71 శాతం మంది వున్నట్లు సర్వేలో తేలింది 61-70 సంవత్సరాల మధ్య వయస్సు వారు ఎక్కువగా వున్నట్లు వెల్లడైంది. దాదాపు అన్ని సామాజిక తరగతుల్లో ఒకేలా వున్నప్పటికీ, ఓసిలలో కొద్దిగా ఎక్కువగాను, బిసి ఎస్‌సిలలో తక్కువగా వున్నారు 70 సం॥ పైన కూడా ఎక్కువగానే వున్నారు ఈ వయస్సు వారు ఓసిలలో ఎక్కువగా వున్నారు జనాభాలో 71 శాతం మంది శ్రమ చేయగల్గినవారు (16సం నుండి 60 వరకు) వున్నారు ఆర్థికంగా బలంగా వుండటం, వైద్య సౌకర్యాలు పొందడం కారణం కావచ్చు

**పశుసంపద**

గ్రామంలో సర్వే సమయానికి ఎద్దులు వున్న కుటుంబం ఒక్కటే వున్నది ఆవులు, గేదెలు 142 కుటుంబాలకు 289 వున్నాయి అందులో 40% ఓసిల వద్దనే వున్నాయి ఎస్‌సి, బిసి కుటుంబాలు గ్రామంలో గణనీయంగానే వున్నా, ఓసిల వద్దనే వుండటం గమనించాలి. పశుసంపదలో దాదాపు 70 శాతం మధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతుల వద్దనే వున్నది గొర్రెలు నామమాత్రంగా వున్నవి

**వ్యవసాయం**

గ్రామంలో మా సెన్సస్ ప్రకారం మొత్తం సాగుభూమి 782 ఎకరాలు సాగునీటి వసతి కల్గిన భూమి 719 5 ఎకరాలు వున్నది. మెట్టభూమి 129 ఎకరాలు ఇందులో పడావు భూమి 8 5 ఎకరాలు ఊర్లో పడావు భూమి చాలా స్వల్పంగా వున్నది సాగునీటి వసతి కల్గిన భూమి దాదాపు 92శాతం వున్నది కౌలుకు చేస్తున్న సాగునీటి వసతి భూమి 301.75 ఎకరాలు వుంటే, మెట్టభూమి 42 ఎకరాలుగా వున్నది కౌలుకు ఇచ్చిన మాగాణి విస్తీర్ణం 56 75 ఎకరాలు, మెట్ట విస్తీర్ణం 8 5 ఎకరాలుగా నమోదైనది నికర సాగుభూమి, కౌలుకు తీసుకున్నవారి భూమి, కౌలుకు ఇచ్చిన వారి భూమి విస్తీర్ణాలలో వ్యత్యాసం వున్నది అంటే కౌలుకు తీసుకున్నవారు, ఇచ్చిన వారు పూర్తి వివరాలు చెప్పనందున, ఇతర గ్రామాల పరిధిలో వున్న భూమి కౌలుకు చేస్తున్నందువల్ల ఈ తేడా కన్పిస్తుంది గ్రామంలో ప్రధానంగా వరి, పత్తి, మొక్కజొన్న సాగు చేస్తారు వరి ప్రధాన పంట పత్తి కూడా పండిస్తారు. తర్వాత మొక్కజొన్న వుంటుంది

**కౌలుదారులు**

గ్రామంలో కౌలు సేద్యం వివరాలను పరిశీలించాం గ్రామంలో కౌలు క్రింద సాగు భూమి ఎక్కువగా వున్నది మొత్తం 375 కుటుంబాల్లో 110 కుటుంబాలు (29శాతం) కౌలు చేస్తున్నాయి వీరు సుమారు 344 ఎకరాలను కౌలుసాగు చేస్తున్నారు అంటే మొత్తం సాగుభూమిలో 44శాతం కౌలుక్రింద వున్నట్లు అర్థమౌతున్నది కౌలుకుటుంబాల్లో ఆర్థిక తరగతుల వారీ చూస్తే భూస్వామ్య కుటుంబాలు ముగ్గురున్నారు వీరు 46 ఎకరాలు చేస్తున్నారు ధనిక రైతు కుటుంబాలు ఏడుగురు వుంటే వారి క్రింద 49 ఎకరాలు, మధ్యతరగతి 24 కుటుంబాలు వుంటే వారు సాగుచేస్తున్న భూమి 108 ఎకరాలు సాగు చేస్తున్నారు. చిన్నకారు రైతు 35 కుటుంబాలు వుంటే వారు సాగుచేస్తున్న భూమి 90 5

ఎకరాలు, 35 సన్నకారు రైతు కుటుంబాలు 50 5 ఎకరాలు సాగుచేస్తున్నాయి ఇతరులు ఆరుగురు మరో 15 ఎకరాలు సాగుచేస్తున్నట్లు మా పరిశీలనలో వెల్లడైంది. కౌలు సేద్యంలో రివర్స్ కౌలు కూడా వున్నది

కౌలు రైతులు ఏ సామాజిక తరగతికి చెందిన వారో తెలుసుకున్నాం భూస్వాములు మొత్తం కమ్మ కులానికి చెందిన వారు వీరు 39% కౌలుభూమిని సాగుచేస్తున్నారు ధనిక రైతు వర్గంలో వున్న ఏడుగురిలో ఆరుగురు కమ్మ కులం వారే. మొత్తం కౌలుకుటుంబాల్లో 24% కమ్మవారే మాల కులానికి చెందిన వారు మొత్తం 28 కుటుంబాలు (25%) వున్నారు వీరిలో ఎక్కువ మంది సన్నకారు రైతులే అయితే ఒక్కరే ధనిక రైతుగా వున్నారు వీరు సాగుచేస్తున్న భూమి 18% రజక కుటుంబాలు మొత్తం 12 వుంటే వారంతా సన్న, చిన్నకారు రైతులే

### వర్గపొందిక ఎలా వుంది?

గ్రామంలో వ్యవసాయ కార్మికుల సంఖ్య అధికంగా కన్పడుతున్నది వర్గాల రీత్యా చూస్తే భూస్వాములు ఐదుగురు (1 33%), ధనిక రైతులు12 (3%), మధ్యతరగతి రైతులు 37 (10%), చిన్నకారు రైతులు 53 (14%), సన్నకారురైతులు 87 (23%), వ్యవసాయ కార్మికులు 140 (37%), వ్యవసాయేతర కార్మికులు 8(2%), స్వయం ఉపాధి ముగ్గురు (0 80%), ఉద్యోగులు 8 (2%), వ్యాపారులు 7 (2%), ఇతరులు 15 (4%) వున్నారు వృత్తిదారులు లేరు. వ్యవసాయేతర కార్మికులు తక్కువగా వున్నారు.

ఆర్థిక తరగతులను నిర్ణయించేటపుడు ఆయా కుటుంబాల వద్ద వున్న నికర సాగుభూమి విస్తీర్ణాన్ని ప్రాతిపదికగా తీసుకున్నాం ఈ రూపంలో భూకేంద్రీకరణను చూసినపుడు 1శాతంగా వున్న భూస్వాముల చేతిలో 15% భూమి వున్నది. 3 శాతంగా వున్న ధనిక రైతుల చేతుల్లో 18% భూమి వుంది అంటే ఈ రెండు వర్గాలు కలిపి 4శాతంగా వుంటే వీరి చేతుల్లో వున్న భూమి 33% వున్నది ఇక 10శాతంగా వున్న మధ్యతరగతి రైతు కుటుంబాల చేతిలో 28% భూమి వున్నది చిన్న, సన్నకారు రైతులు, వ్యవసాయ కార్మికులు కలిపి 38శాతం వుంటే వీరి చేతుల్లో 39 శాతం భూమి వున్నది

### భూకేంద్రీకరణ

భూకేంద్రీకరణను పరిశీలించినపుడు స్వంత భూమినే ప్రాతిపదికగా తీసుకున్నాం. గ్రామంలో 375 కుటుంబాల్లో 215 కుటుంబాలకు భూమిలేదు. అంటే

57 శాతం మందికి సెంటు భూమి కూడా లేదు అంటే గ్రామంలో భూమి కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతమై వున్నదని అర్థమౌతున్నది గ్రామంలో వున్న మొత్తం కుటుంబాలకు నికర సాగుభూమిని పంచినట్లయితే ఒక్కో కుటుంబానికి రెండు ఎకరాలు వుండాలి. గ్రామంలో స్వంత భూమి 503 ఎకరాలు వున్నది భూమి వున్న పైస్థాయి 5 శాతం కుటుంబాలకు 43% భూమి వుంటే క్రిందిస్థాయిలో వున్న 60శాతం కుటుంబాలకు 1 22 శాతం భూమి వున్నట్లు సర్వేలో వెల్లడైంది ఆర్థిక తరగతుల వారీ పరిశీలిస్తే భూస్వామ్య వర్గానికి సగటు కమతం 14ఎకరాలుగా వుంటే, ధనిక రైతువర్గంలో 9ఎకరాలు, సన్నకారు రైతువర్గానికి 0.91సెంట్లు వున్నది వ్యవసాయకార్మికులకు 0 48 సెంట్లు వచ్చింది. అంటే వ్యవసాయ కార్మికునికి, భూస్వామ్య వర్గంతో పోలిస్తే 28 రెట్లు ఎక్కువ భూమి కల్గివున్నారు

గ్రామంలో సామాజిక తరగతుల వారీ పరిశీలించాం మొత్తం 154 ఎస్‌సి కుటుంబాల్లో 100 కుటుంబాలకు భూమిలేదు ఎస్‌టి కుటుంబాలు రెండు వున్నాయి. ఆ రెండు కుటుంబాలకు భూమి లేదు ఇక బిసి కుటుంబాలు మొత్తం 123 వున్నాయి వీరిలో 82 కుటుంబాలకు భూమిలేదు ఓసి సామాజిక తరగతిలో 95 కుటుంబాలు వున్నాయి వీరిలో కేవలం 28 మందికి మాత్రమే భూమి లేదు గ్రామంలో వున్న మొత్తం కుటుంబాలతో పోలిస్తే ఎస్‌సి తరగతిలో దాదాపు 26% కుటుంబాలకు, బిసిలలో 21 శాతం కుటుంబాలకు, ఓసిలలో 7శాతం కుటుంబాలకు భూమి లేదు కులాలవారీ భూమి లేని కుటుంబాలను చూస్తే రజక, మాల, మాదిగ కులాలలో ఎక్కువ మందికి భూమి లేకపోవడం చూస్తాం.

**గృహాలు – మౌలిక సదుపాయాలు**

ఊర్లో 90 శాతం మందికే స్వంతఇళ్లు వున్నాయి ముఖ్యంగా ఎస్‌సిలలో 12% మందికి ఇళ్లు లేవు. పక్కాగృహాలు గ్రామ జనాభాలో 68 శాతానికి వున్నాయి. ఎస్‌సి సామాజిక తరగతికి 62% మందికే వుంటే, ఓసి సామాజిక తరగతికి 76% మందికి వున్నాయి కచ్చా ఇళ్లల్లో 30శాతం మంది ఎస్‌సిలు నివశిస్తున్నారు. అద్దె ఇంట్లో వున్న కుటుంబాలు 30 అంటే (8%) వున్నాయి అందులో 15 కుటుంబాలు ఎస్‌సిలవే కావడం గమనార్హం

గ్రామంలో ఒక్క ట్రాక్టర్ మాత్రమే వున్నట్లు వచ్చింది. ఇది ఓసి లకు చెందినది. రైస్‌మిల్లు ఒకటి వున్నది. ఇది కూడా వారికే చెందినది. సైకిల్స్ 94 వుంటే,

ఎస్సి, బిసిలకు 60శాతంపైనే ఈ తరగతులకు వున్నాయి. స్కూటర్స్ 11 వున్నాయి. బిసి, ఓసిలకు 75శాతం వున్నాయి. బైక్‌లు 44 వున్నాయి. బిసి, ఓసిల వద్ద 66 శాతం వున్నాయి. కార్లు లేవు. ఆటోలు నాలుగు వున్నాయి. మొత్తం బిసి, ఓసిల వద్దనే వున్నాయి. 77 శాతం కుటుంబాలకు టివిలు వున్నాయి. ఓసిలకు 86శాతం మందికి వున్నాయి.

93% ఇళ్లకు విద్యుత్ సౌకర్యం వున్నది. ఎస్సిలలో 10 శాతం కుటుంబాలకు విద్యుత్ లేదు. ఓసిలకు 97శాతం కుటుంబాలకు విద్యుత్ వున్నది. గ్రామం మొత్తంగా 58 శాతం కుటుంబాలకు మరుగుదొడ్లు వుంటే ఓసిలకు 78 శాతం కుటుంబాలకు వున్నాయి. అదే ఎస్సిలలో 47శాతం కుటుంబాలకు మాత్రమే వున్నాయి. సెల్‌ఫోన్‌లు 75 శాతం కుటుంబాల వారు వాడుతున్నారు. వంటగ్యాస్ గ్రామంలో 77 శాతం కుటుంబాలకు వున్నది. ఓసిలలో 90 శాతం, ఎస్సిలలో 72శాతం కుటుంబాలకు ఈ సౌకర్యం వున్నది.

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 43% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 1.2% భూమి మాత్రమే వుంది. 57% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

# కిష్టాపూర్

## గ్రామ ముఖచిత్రం

సుందరయ్య విజ్ఞాన కేంద్రం 2013-2014 సంవత్సరంలో నిర్వహించిన గ్రామీణ సామాజిక ఆర్థిక సర్వేలో భాగంగా ఆదిలాబాద్ జిల్లా కిష్టాపూర్ గ్రామంలో 2013 డిశంబరులో తొలి దఫా, 2014 జూన్‌లో మలి దఫా సర్వే నిర్వహించాము. ఈ గ్రామం అదిలాబాద్ జిల్లా జిన్నారం మండలంలో వుంది. అది మండల కేంద్రానికి చాలా దూరం. 65కి.మీ. దూరంలో వుంది. దగ్గరగా వున్న పట్టణం మంచిర్యాల. అది కూడా గ్రామానికి అంతే దూరంలో వుంది. మండల కేంద్రం, దగ్గర పట్టణమే యింత దూరంలో వుంటే జిల్లా కేంద్ర దూరం వూహించుకోవచ్చు. దీనిని బట్టి యిది చాలా మారుమూల గ్రామం అనుకోవాలి. ఈ దూరాలను బట్టి దాని ఆర్థిక అభివృద్ధి, సామాజిక స్థితిగతులను అర్థం చేసుకోవచ్చు. దగ్గర ప్రయాణాలకు ఆటోలు, మిగతా ప్రయాణాలకు బస్సులు వాడతారు.

ఈ గ్రామానికి విద్యుత్ సరఫరా వుంది. పంచాయితి భవనం, ప్రాథమిక పాఠశాల, వున్నత పాఠశాల, ప్రజా పంపిణీ కేంద్రం, అంగన్‌వాడీ కేంద్రం వున్నాయి.

గతకాలపు సామాజిక వ్యవస్థ యొక్క దోపిడీ రూపాలు కొన్ని ఇంకా కొనసాగుతున్నాయి. దాదాపు ప్రతి పనికి చెల్లింపులు ధాన్యం రూపంలోనే వున్నాయి. వడ్రంగులు చేసే పనులకు మేర యిస్తున్నారు. కౌలుబదులు పాలు వ్యవసాయం విస్తృతంగా వుంది. కోళ్ల పెంపకంలో కూడా పాలు పద్ధతి అనుసరిస్తున్నారు. వలసలు చాలా యెక్కువగా వున్నాయి. బొంబాయికి యెక్కువగా పోతున్నారు. దుబాయ్‌కి వెళుతున్న వాళ్లు కూడా అధికంగానే వున్నారు. స్త్రీలు ఎక్కువగా బీడీలు చుట్టేపని చేస్తున్నారు.

### జనాభా

ఈ గ్రామ జనాభా 1457 అందులో పురుషులు 728, స్త్రీలు 729 స్త్రీ, పురుష నిష్పత్తి 1001 ప్రతి 1000మంది పురుషులకు 1001 మంది స్త్రీలున్నారు 2011 జనాభా లెక్కల ప్రకారం రాష్ట్రంలో యీ నిష్పత్తి 988 మెదక్ జిల్లాలో ఈ నిష్పత్తి మరి కొంత మెరుగ్గా 1000గా వుంది గ్రామ నిష్పత్తి బాగానే 1001 వుంది సామాజిక తరగతుల వారీగా యీ నిష్పత్తిని పరిశీలిస్తే అది యస్ సి లలో గరిష్టంగా 1053శాతం, తరువాత బి సి లలో 972 శాతం, ఒ సి లలో 905శాతంగా వుంది అందరికంటె కనిష్టంగా యస్ టి లలో 778శాతం మాత్రమే వుంది

కుటుంబాల వారీగా చూస్తే గ్రామంలో 388 కుటుంబాలున్నాయి. అందులో సగానికి పైగా బి సి కుటుంబాలు యస్ సి కుటుంబాలు కూడా ఎక్కువగానే 165 వున్నాయి ఒ సి13, యస్ టి లు నాలుగు కుటుంబాలు నామమాత్రంగా వున్నారు. బి సి కుటుంబాలు 53శాతం వుండగా యస్ సి లు 43శాతం వున్నారు అంటే యస్ సి.లు, రాష్ట్రస్థాయి (15శాతం) కంటె, జిల్లాస్థాయి కంటె (6శాతం) కూడా చాలా హెచ్చుగా 43శాతం వున్నారు యస్ టి కుటుంబాలు మాత్రం రాష్ట్రస్థాయి కంటె (9శాతం) బాగా తక్కువగా, అంటే 1శాతం మాత్రమే వున్నారు ఒ.సి లు 3% కుటుంబాలు వున్నాయి మతాల వారీగా చూస్తే హిందువులు అత్యధికంగా 86శాతం కుటుంబాలవారున్నారు మిగిలిన 14శాతం కుటుంబాలు క్రైస్తవులవి కులాలు సంఖ్య రీత్యా మాల, మాదిగ, మున్నూరు కాపు, పద్మసాలీ ఎక్కువగా వున్నాయి మిగిలిన కులాలు - గౌడ, కుమ్మరి, ముదిరాజులు, నాయీ బ్రాహ్మణ, రజక, యాదవ, వైశ్య, లంబాడ, గిరిజనులు.

### అక్షరాస్యత

ఈ గ్రామంలో అక్షరాస్యులు 56శాతం వున్నారు. తెలంగాణా రాష్ట్రంలోని అక్షరాస్యత కంటే యిది 10శాతం తక్కువ జిల్లా అక్షరాస్యతకంటే కూడా తక్కువే జిల్లాది 61శాతం వుంటే యిది 56శాతం మాత్రమే వుంది

సామాజిక తరగతుల వారీగా చూస్తే అక్షరాస్యులు ఒ.సి.లలో అత్యధికంగా 75శాతం వున్నారు. కాని యస్ సి లలో అది 50శాతం మాత్రమే బి సి.లు కూడా

60శాతంతో బాగా వెనకబడే వున్నారు పురుషులలో అక్షరాస్యత 64శాతం వుండగా స్త్రీలలో అది 48శాతం మాత్రమే వుంది. అంటే పురుషులకంటే స్త్రీలలో అక్షరాస్యులు 16% తక్కువగా వున్నారు. స్త్రీ,పురుషుల అక్షరాస్యతలలో తేడా యస్ సి లలో 11% బి సి.లలో 19%, ఒ సి.లలో అత్యధికంగా 33% వున్నది. స్త్రీ అక్షరాస్యతలో 45 శాతంతో యస్.సి లే అందరికంటే వెనకబడి వున్నారు 2011 జనాభా లెక్కల ప్రకారం రాష్ట్రస్థాయిలో పురుషుల అక్షరాస్యత 75శాతం వుంటే, స్త్రీల అక్షరాస్యత 58శాతం మాత్రమే. వీరిద్దరి మధ్య తేడా 17శాతం.

10వ తరగతి వరకు చదివిన వారు 24శాతం మంది వున్నారు దానిలో ఒ.సి.లు యెక్కువగాను, యస్ సి.లు తక్కువగాను వున్నారు డిగ్రీ చదివిన వారు 6శాతం మాత్రమే వున్నారు 10వ తరగతి నుండి డిగ్రీకి వచ్చేటప్పటికి వారి శాతం ఒక్కసారిగా 24శాతం నుండి 6శాతానికి పడిపోయింది. కాని ఒ సి లలో డిగ్రీ చదివినవారు 25% వుండగా యస్.సి లలో వారు 4శాతం మందే వున్నారు బి సి లు కూడా ఒ సి.లకు చాలా దూరంలోనే 7% మాత్రమే వున్నారు పోస్టుగ్రాడ్యుయేట్ చదివిన వారు గ్రామంలో ఒక్క శాతం మాత్రమే వున్నారు బి.సి లు 1 56శాతం, యస్ సి లు 0 48 శాతం వున్నా ఒ సి లలో మాత్రం ఆ చదువులు చదివిన వారు పూర్తిగా లేరు పి.హెచ్‌డి చేసిన వారు లేరు.

**అయుఃప్రమాణము**

16నుండి 40 సంవత్సరాల వయసుగల యువకులు గ్రామంలో 50శాతం మంది వున్నారు అంటే గ్రామంలో సగం మంది వీరే ప్రతి పది సంవత్సరాల వ్యవధిలో జనాభాను పరిశీలిస్తే ఆ జనాభా క్రమంగా పెరిగి 30సంవత్సరాల వద్ద గరిష్టాన్ని (22 31 శాతం) చేరింది అక్కడ నుండి క్రమేపి తగ్గుతూ 70సం॥లకు 1 44 శాతాన్ని చేరింది 70 సంవత్సరాల పైబడి వయస్సు కలిగినవారు ఒ సి లలో 7 5శాతం వుండగా, యస్.సి.లలో 0 8 శాతం మాత్రమే వున్నారు పోషకాహారాలు అందుబాటులో లేని వారు తక్కువ వయస్సులోనే చనిపోతున్నారు బి సి లు కూడా 70 సంవత్సరాల పైబడి 1 7 శాతం మాత్రమే వున్నారు. ఈ గ్రామంలో ఈ తేడా చాలా ఎక్కువగా వుంది

## వ్యవసాయం

ఈ గ్రామంలో మొత్తం 223 ఎకరాల స్వంత భూమివుంది అందులో 171 62 ఎకరాలు, అంటే 77శాతం భూమికి సాగునీటి వసతి వుంది. మిగలిన 23 శాతం వర్షాధార భూమి సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 68సెంట్లు. కాలువ ద్వారా, బోరుబావుల ద్వారా సాగునీరు అందుతూ వుంది. ఈ గ్రామంలో ప్రధాన పంట వరి యాంత్రీకరణ ఎక్కువగానే వుంది ఈ గ్రామంలో బి సి లు 53 శాతం వున్నారు వారికి గల స్వంత భూమి మొత్తం భూమిలో 65 శాతం అలాగే యస్ సి కుటుంబాలు 43 శాతం వున్నాయి కాని వారికి గల భూమి 30 శాతం మాత్రమే యస్ టి కుటుంబాలు ఒక్క శాతమే వున్నా వారికి గల భూమి 4 శాతం వారి కుటుంబాల దామాషా కంటే చాలా హెచ్చుగా వుంది ఇక్కడ భూమిలేని కుటుంబాలు 50 శాతం వున్నాయి మొత్తం కౌలుభూమి 90 ఎకరాలు అది మొత్తం సాగుభూమిలో 24 శాతం వుంది. కౌలు చేస్తున్న కుటుంబాలు 36 మాత్రమే గ్రామంలోని మొత్తం కుటుంబాల్లో ఇవి 9 శాతం మాత్రమే

స్వంత భూమి కలిగిన కుటుంబాలు 193. కాని అందరూ సేద్యం చేయటం లేదు వారిలో 169 కుటుంబాలు మాత్రమే స్వంత సేద్యం చేస్తున్నాయి కౌలురైతులు 36 కుటుంబాలలో 11దళిత కుటుంబాలు, మిగిలినవి బి సి కుటుంబాలు కౌలు కుటుంబాలలో 4 మాత్రమే స్వంత భూమిలేని కుటుంబాలు వున్నాయి

## ఆర్థిక తరగతులు

ఈ గ్రామంలో వున్న 388 కుటుంబాలను సాగుభూమి, శ్రమల ఆధారంగా వర్గీకరిస్తే వున్న వాటిలో ఒకటి లేదా 0 26శాతం భూస్వామ్య కుటుంబం వున్నది రెండు లేదా 0 52శాతం కుటుంబాలు ధనిక రైతు కుటుంబాలు, 6 లేదా 1.55శాతం మధ్య తరగతి రైతు కుటుంబాలు, 23 లేదా 5 9శాతం చిన్నకారు రైతు, 71 లేదా 18 3శాతం సన్నకారు రైతు కుటుంబాలు వున్నాయి. వీటికి తోడు ప్రధానంగా శ్రమశక్తిని అమ్ముకొని బ్రతికే కుటుంబాలు మరికొన్ని అవి భూమిగల వ్యవసాయ కార్మిక కుటుంబాలు 66 లేదా 17శాతం, భూమిలేని వ్యవసాయ కార్మిక కుటుంబాలు 108 లేదా 27 8శాతం, వ్యవసాయేతర కార్మిక కుటుంబాలు 19 లేదా 4 9శాతం ఈ రెండు తరగతులే కాకుండా మూడవ తరగతిగా వృత్తిదార్లు, స్వయం వుపాధి గల వారు, ప్రభుత్వ మరియు ప్రయివేటు

వుద్యోగులు, వ్యాపారులు, యితరులు – వీరంతా కలిసి 92 లేదా 24శాతం కుటుంబాల వారున్నారు ప్రధానంగా శ్రమశక్తిని అమ్ముకునే వ్యవసాయ కూలీలతో పాటు సన్నకారు, చిన్నకారు, కౌలురైతుల్లో చాలా మంది కూలికి పోతూవుంటారు వారిని కూడా కలుపుకుంటే వ్యవసాయ కార్మికుల సంఖ్య 108+66=174 కుటుంబాలు మాత్రమే కాదు ఇంకా చాలా ఎక్కువ కుటుంబాలు వుంటాయి

గ్రామాన్ని వ్యవసాయ, వ్యవసాయేతర రంగాలుగా విభజిస్తే వ్యవసాయ రంగంలో 277 లేదా 71శాతం కుటుంబాలు వున్నాయి మిగిలిన 111 లేదా 29 శాతం కుటుంబాలు వ్యవసాయేతర రంగాలు లేదా వనరులపై ఆధారపడి బ్రతుకుతున్నాయి దీనిని బట్టి ఈ గ్రామానికి వ్యవసాయేతర రంగం బాగా అందుబాటులో వుందని అనుకోవాలి

**భూకేంద్రీకరణ**

ఎగువన వున్న 5శాతం కుటుంబాల యాజమాన్యంలో 28శాతం భూమి వుంటే, దిగువన వున్న 60శాతం కుటుంబాల యాజమాన్యంలో 4శాతం భూమి మాత్రమే వుంది ఎగువ 5శాతం కుటుంబాల సగటు కమతం 3 36ఎకరాలు కాగా దిగువ 60శాతం కుటుంబాల సగటు కమతం విస్తీర్ణం కేవలం నాలుగు సెంట్లు మాత్రమే మొత్తం కుటుంబాలలో భూమిలేని కుటుంబాలు సగం వున్నాయి ఈ వివరాలను బట్టి ఈ గ్రామంలో భూకేంద్రీకరణ కొంతమేరకు వున్నదనే చెప్పాలి ఎగువన వున్న 5 శాతం కుటుంబాలలో 6 మున్నూరు కాపు కుటుంబాలు, 4 పద్మసాలీలు మరియు మూడు దళిత కుటుంబాలు వున్నాయి పెద్ద రైతులలో 11 బి సి కుటుంబాలతో పాటు మూడు దళిత కుటుంబాలు కూడా వుండటం విశేషమే అట్లాగే ఈ తరగతి కుటుంబాలలో మిగిలిన ప్రాంతాలలో మాదిరిగా ఒ సి లు లేక పోవటం కూడా విశేషమే

**వసతులు**

గ్రామంలో స్వంత యిళ్లు 92% కుటుంబాలకు వున్నాయి కాని పక్కా యిళ్లు మాత్రం దాదాపు సగం మందికి, అంటే 52శాతానికి మాత్రమే వున్నాయి అయినా పక్కా ఇళ్లు ఒ సి లలో 77శాతం కుటుంబాలకు వుండగా, యస్ సి.లకు అందులో సగం అంటే 39శాతం కుటుంబాలకు మాత్రమే వున్నాయి బి సి లకు అవి 61% కుటుంబాలకు వున్నాయి. పశుసంపద తక్కువగానే వుంది ఆవులు, గేదెలు కలిసి 190 మాత్రమే వున్నాయి సైకిళ్ళు 35% మందికి వున్నాయి స్కూటర్లు,

మోటారుసైకిళ్ల కలిసి 17% కుటుంబాలకు మాత్రమే వున్నాయి ఇవి ఒ సి లకు ఎక్కువగాను, ఎస్సీలకు తక్కువగాను వున్నాయి కార్లు 4 వున్నాయి అవి బి.సి కుటుంబాలకు మాత్రవేు వున్నాయి. ఆటోలు 5 వున్నాయి అవి బి సి లు యస్ సి.సామాజిక తరగతులకు వున్నాయి

ఈ గ్రామంలో టి వి లు తక్కువగా 57 శాతం కుటుంబాలకు మాత్రమే వున్నాయి అయినా అవి సామాజిక తరగతుల మధ్య సమానంగానే పంపిణీ అయి వున్నాయి విద్యుత్ సౌకర్యం 86% కుటుంబాలకు మాత్రమే వుంది. ఎస్సీలలో 20% కుటుంబాలకు లేదు మొత్తంగా విద్యుత్ సౌకర్యం లేని కుటుంబాలు గణనీయంగానే 14% వరకు వున్నాయి.

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 28% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 4% భూమి మాత్రమే వుంది. 50% కుటుంబాలకు సెంటు భూమి లేదు.**

లెట్రిన్ సౌకర్యం గల కుటుంబాలు 18 శాతం మాత్రమే ఎస్‌సిలలో 5% కుటుంబాలకు మాత్రమే వుంది. వంట గ్యాస్ 39% కుటుంబాలకు వుంది. కాని ఎస్‌సి లలో అది 23% కుటుంబాలకు మాత్రమే వుంది సెల్‌ఫోన్లు మాత్రం 76 శాతం కుటుంబాలకు వున్నాయి. ఇవి దాదాపు అన్ని సామాజిక తరగతులకు సమానంగానే వున్నాయి. ఇది మారుమూల గ్రామమైనా, సెల్‌ఫోనులు గణనీయంగా వుండటం గుర్తించాలి

## మహబూబ్‌నగర్ జిల్లా

# చిన్నమారూరు

గ్రామ ముఖచిత్రం

సుందరయ్య విజ్ఞానకేంద్రం 2013-2014 సంవత్సరంలో నిర్వహించిన గ్రామీణ సామాజిక ఆర్థిక సర్వేలో బాగంగా చిన్నమారూరు గ్రామాన్ని రెండు విడతలుగా సర్వే చేశాం సెన్సెస్ సర్వే అంశాలను మీ ముందుంచుతున్నాం

దక్షిణ తెలంగాణ ప్రాంతంలోని మహబూబ్‌నగర్ జిల్లా వీపనగండ్ల మండలంలో చిన్నమరూరు గ్రామం వున్నది కృష్ణానది ఒడ్డున వున్న ఈ గ్రామం మండల కేంద్రానికి 10 కిలోమీటర్ల దూరంలో వుంటుంది గ్రామానికి రవాణా సౌకర్యం ప్రధానంగా ఆటోల ద్వారా జరుగుతోంది. కేవలం రోజుకు రెండు సార్లు మాత్రమే బస్సు వస్తుంది దాదాపు 20 కిలోమీటర్ల దూరంలో కొల్లాపూర్ పట్టణం వున్నది ఈ గ్రామం 1973లో ఏర్పాటైంది. వ్యవసాయానికి ప్రధానంగా జూరాల కాలువ నీరు ఆధారం బోర్లు, బావులద్వారా చాలా తక్కువ భూమి సాగు అవుతున్నది చాలావరకు సారవంతమైన ఎర్రమట్టి, కృష్ణానది అంచున నల్లరేగడి భూములు వున్నాయి ప్రధానంగా వరి, వేరుశనగ, వుల్లి, పప్పుశెనగ, మొక్కజోన్న, మిరప, జొన్న పంటలు పండిస్తారు గ్రామానికి ముమ్మరమైన పనులలో సుమారు 20 కిలోమీటర్ల దూర గ్రామాల నుండి ఆటోలు తీసుకుని కూలిపనుల కోసం వస్తారు పిహెచ్‌సి సెంటర్ మండల కేంద్రంలోనే వున్నది కొంత మెరుగైన హాస్పటల్‌కు వెళ్లాలంటే మూడు గంటలకు పైగా ప్రయాణం చేసి కర్నూల్, వనపర్తి పట్టణాలకు చేరుకోక తప్పదు ఇద్దరు ఆర్‌ఎంపి డాక్టర్లు వున్నారు

గ్రామంలో ప్రాథమిక, ప్రాధమికోన్నత పాఠశాల వున్నది స్కూలు పిల్లల్లో ఎక్కువమంది బిసి, ఎస్‌సి సామాజిక తరగతికి చెందినవారే వున్నారు ఆర్థికంగా బలంగా

వున్నవారి పిల్లలు కాన్వెంట్ స్కూల్స్‌కు వెళ్తున్నట్లు తెలుస్తోంది రక్షిత మంచినీటి సౌకర్యం వున్నది గ్రామంలో 7 త్రాగునీటి చేతిపంపులు మరియు రెండు వాటర్ ట్యాంకులు వున్నాయి పంచాయితీ ఆఫీసు, అంగన్‌వాడీ కేంద్రం, ప్రజాపంపిణీ కేంద్రం, విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్ వున్నాయి.

**జనాభా వివరాలు**

సర్వే ప్రకారం గ్రామ జనాభా1037 మొత్తం కుటుంబాలు 236 వున్నాయి సామాజిక తరగతుల వారీ పరిశీలిస్తే జనాభాలో 23%ఎస్‌సిలు, 55శాతం బిసిలు, 21% ఓసిలు వున్నారు ప్రతి వెయ్యి మంది పురుషులకు 1006 మంది స్త్రీలు వున్నారు ప్రభుత్వ లెక్కల ప్రకారంరాష్ట్ర నిష్పత్తితో (988) పోల్చితే స్త్రీల సంఖ్య ఎక్కువగా వుండటం గమనించాలి ఇది మంచి పరిణామం. గ్రామంలో 16 నుండి 40 సంవత్సరాల మధ్య వున్న యువత 50 శాతం వున్నది. దళితుల్లోనే ఈ యువత ఎక్కువగా వున్నారని సర్వే లెక్కలు చెపుతున్నాయి

**సామాజిక పొందిక**

దళిత కుటుంబాలు 55, వెనుకబడిన కులాల కుటుంబాలు 130, ఓసి కుటుంబాలు 50, ఒక ఎస్‌టి కుటుంబం వున్నది కులాల వారీగా చూస్తే మొత్తం 236 కుటుంబాల్లో బోయ 25 (11%), గౌడ్ 7 (3%), కుమ్మరి6 (3%), మాదిగ 34 (14%), మాల 21(9%), ముదిరాజ్ 9 (4%), మున్నూరుకాపు 13 (6%), ముస్లిం (బిసి) 47 (20%), రెడ్డి 46 (19%) యాదవ 18(8%), నాయిబ్రాహ్మణ 3, రజక 3, ముస్లిం 2, వైశ్య 2 , కుటుంబాలు వున్నాయి గ్రామం మొత్తంగా చూస్తే హిందువులు 79 శాతం వుంటే, ముస్లింలు 21శాతం కుటుంబాలు వున్నాయి మొత్తం కుటుంబాల్లో స్త్రీ యాజమాన్యం గల కుటుంబాలు 42(18%) ఉన్నాయి

**జీవనోపాధి**

కుటుంబానికి ప్రధానంగా ఆదాయం వస్తున్న పనులకు సంబంధించి వరుసగా వ్యవసాయం 63, వ్యవసాయ కూలీలు 66, కౌలు రైతులు 22, వ్యవసాయేతర కార్మికుల 20, వ్యాపారులు మరియు కిరాణషాపులు 6, సాంప్రదాయ వృతి 3, గొర్రెల పెంపకందార్లు, ఉద్యోగులు24, కంట్రాక్టర్, టైలర్ ఒక్కొక్క కుటుంబం చొప్పున వున్నారు ఒక కుటుంబం హొటల్ నడుపుతున్నది.

### పశుసంపద

గ్రామంలో మొత్తం పశుసంపద 1041 వుంది ఎద్దులు 49 వున్నాయి అందులో సగానికిపైగా,మరియు గేదెలు, ఆవులు 162 వుంటే, అందులో 64 శాతం వెనుకబడిన తరగతులకు చెందినవే ఎక్కువ భాగం మధ్యతరగతి, చిన్న సన్నకారు రైతాంగానికే వున్నాయి గొర్రెలు 830 వున్నాయి గొర్రెలు ఎక్కువ భాగం బిసిలవే అయినప్పటికి మిగతా ఎస్సీ(మాదిగ), ఒసి(రెడ్డి)లకు వున్నాయి వారిలో ముస్లిం, బోయ, గౌడ్, ముదిరాజ్, మున్నూరుకాపులు వున్నారు. గొర్రెలు వున్న సుమారు సగం కుటుంబాలు భూస్వామ్య, ధనిక రైతులవే ఒక్క కుటుంబం మినహా అందరికి స్వంత భూములు వున్నాయి ఈ ఒక్క కుటుంబం కూడా కౌలుకు చేస్తున్నారు భూస్వామ్య, ధనికరైతు కుటుంబాలు స్వంతభూమితోపాటు అందరు కౌలుకు చేస్తున్నారు ఇంత ఎక్కువ పెంచడానికి ఇవి లాభసాటియే కాకుండా గ్రామంలో, చుట్టు ప్రక్కల గ్రామాలలో మేత పుష్కలంగా లభిస్తుంది ఇతర గ్రామాల నుండి మేతకోసం గొర్రెలమందలు తీసుకొని వచ్చి కొన్నినెలల పాటు గ్రామంలోనే వుంటారు

### సాగుభూమి

గ్రామంలో సెన్సెస్ సర్వేలో వచ్చిన వివరాల ప్రకారం మొత్తం 782 ఎకరాల సాగుభూమి వున్నది 619 ఎకరాల భూమికి సాగునీటి వసతి వుంది 158 ఎకరాల మెట్ట భూమి వుంది గ్రామంలో నికరంగా సాగుఅవుతున్న భూమిలో 4శాతం గల భూస్వాములు 23శాతం మరియు 10శాతం వున్న ధనికరైతులు 33 శాతం భూమిని సాగుచేస్తున్నారు దీన్నిబట్టి 56 శాతం భూమి 14శాతం గల భూస్వామ్య, ధనిక వర్గాల సాగుచేస్తున్నాయి 46 శాతంగా వున్న మధ్యతరగతి, చిన్నకారు, సన్నకారు రైతాంగం 44 శాతం భూమిని సాగు చేస్తున్నాయి మరో 40% గల వ్యసాయకార్మికులు మరియు ఇతర వర్గాలు సాగుచేస్తున్నది శూన్యం ఈ గ్రామంలో మొత్తం భూమి 782 ఎకరాలు వుంటే నికరంగా సాగు అవుతున్నది 895 ఎకరాలుగా లెక్క తేలింది దీనికి కారణం కౌలుకు తీసుకున్న భూములు ఇతర గ్రామాల పరిధివి అయ్యి వుండే అవకాశం వుంది. అందుకే ఈ కౌలుకు తీసుకున్న, ఇచ్చిన భూములకు పొంతన కుదరడం లేదు

### కౌలుదారులు

మొత్తం 236 కుటుంబాలలో కౌలుకు చేస్తున్న కుటుంబాలు 68 (29%) కుటుంబాలు కౌలుకు చేస్తున్నాయి గ్రామ సాగుభూమిలో కౌలుద్వారా సాగు అవుతున్నది

382 యకరాలు (49శాతం) ఉండటం గమనార్హం. దీన్నిబట్టి సాగునీటివసతి గల తెలంగాణ గ్రామాలలో కౌలుదారులు వేగంగా పెరుగుతున్నారని అర్ధమవుతుంది.

కౌలుదారులలో 9మంది భూస్వాములు 104 ఎకరాలు, 23మంది ధనికరైతులు 140 5 ఎకరాలు సాగుచేస్తూన్నారు అంటే కౌలు సాగుభూమిలో 64 శాతం పై రెండు వర్గాలే సాగు చేస్తూన్నాయి గ్రామంలో వున్న భూస్వాములు అందరు మరియు 23లో 18మంది ధనికరైతులు కౌలుకు చేస్తున్నారు గ్రామంలో 46% గల మధ్యతరగతి, చిన్నకారు, సన్నకారురైతులు 36% కౌలుభూమిని సాగుచేస్తూన్నారు వ్యవసాయకార్మికులు, ఇతర ఏ తరగతులు కూడా కౌలు చేయ్యడం లేదు. అత్యధికంగా కౌలుకు ఇచ్చినవారిలో కొద్దిగా భూమి వున్న వ్యవసాయకార్మికులే అధికంగా వున్నారు ఈ గ్రామంలో అధికంగా రివర్స్ కౌలు ఉందని సర్వే సమాచారం నిర్ధారిస్తున్నది. అలాగే వ్యవసాయం చేయని ఇద్దరు భూస్వాములు కూడా మొత్తం భూమిని కౌలుకిచ్చి శ్రమ చెయ్యకుండా ఆదాయం పొందుతున్నారు

### వర్గపొందిక

గ్రామంలోని మొత్తం కుటుంబాల వర్గీకరణను చూస్తే వ్యవసాయం చేయని భూస్వాములు (2) 1%, భూస్వామ్య వర్గం (9)4%, ధనిక రైతులు (23) 10%, మధ్యతరగతి రైతు (38) 16%, చిన్నకారు రైతులు (33) 14%, సన్నకారు రైతులు (31) 13%, వ్యవసాయ కార్మికులు (56) 24%, వ్యవసాయేతర కార్మికులు (12) 5%, ఉద్యోగులు (15) 7%, వ్యాపారులు (8) 3%, ఇతరులు (6)4% వృత్తిదారులు (3) 1% వున్నారు వ్యవసాయం మీద ఆధారపడుతున్న కుటుంబాలు 82 శాతం వున్నాయని అర్ధమౌతున్నది. విశేషమేమంటే గ్రామంలో భూస్వాములు, ధనిక రైతులు సంఖ్య ఎక్కువగానే వుంది.

### భూకేంద్రీకరణ

గ్రామంలో మొదటి 5% కుటుంబాలకు 25% భూమి వుంటే చివరి 60% కుటుంబాలకు 12% భూమి మాత్రమే కలిగి వున్నారు అదే సందర్భంలో 31% కుటుంబాలకు సెంటు భూమి లేదు. వివిధ వర్గాలు చేతిలో వున్న స్వంతభూమి వివరాలు పరిశీలిస్తే వ్యవసాయం చేయ్యని భూస్వాముల 1% లోపే వున్నా 5 శాతం భూమిని కలిగివున్నారు. భూస్వామ్య కుటుంబాలు 4% వుంటే 13% భూమిని, 10% గల ధనికరైతుల చేతిలో 21%భూమి వుంది పై మూడు వర్గాలు కలిసి 15%వుంటే

39 శాతం భూమి వారి చేతుల్లోనే వుంది 46 శాతం గల మధ్యతరగతి, చిన్నకారు ,సన్నకారు రైతులు కేవలం 36% భూములు మాత్రమే కల్గివున్నారు 24 శాతం గల వ్యవసాయకార్మికుల చేతిలో 23 శాతం భూమివుంది వీరికున్న భూమిని కౌలుకు ఇచ్చివేయడం గమనించవచ్చు ఎందుకంటే వీరిదగ్గర వ్యవసాయనికి సరిపడు పెట్టుబడి లేకపోవడం ఒక కారణం. కాబట్టి వారికి వున్న కొద్ది కొద్ది భూములను కూడా కౌలుకిచ్చి కూలీలుగా మారుతున్నారు స్వయంవుపాది, వ్యాపారులు, ఇతరుల చేతిలో భూమి పూర్తిగానే లేదు. వ్యవసాయేతర రంగంపై ఆధారపడిన కుటుంబాలు దాదాపు 19% వున్నట్లు వెల్లడవుతున్నది

ఇక సామాజికతరగతుల వారి భూములెలా వున్నాయో పరిశీలించాం మొత్తం జనాభాలో 23%గా వున్న ఎస్‌సి తరగతికి మొత్తం భూమిలో కేవలం 13 25 శాతం భూమి మాత్రమే కల్గివున్నారు. ఈ భూములు ఎస్‌సి తరగతిలో 65% కుటుంబాలు కల్గివుంటే, 35%కుటుంబాలకు సెంటు భూమిలేదు 55శాతంగా వున్న బిసి తరగతికి 64% భూములు వున్నప్పటికి ఈ భూములు బిసిలలో కూడా 68% కుటుంబాలకు వుంటే, 32% కుటుంబాలకు భూముల్లేవు ఇక ఓసి 21%గా వున్న ఓసి తరగతి 23%భూములు కల్గివున్నప్పటికి 80% కుటుంబాలకు మ్రాత్రమే భూములు వుంటే, 20% కుటుంబాలకు భూముల్లేవు ఈ సమాచారాన్ని బట్టి వున్న భూమి కూడా ప్రతి సామాజికతరగతిలో కొద్ది మంది చేతుల్లోనే కేంద్రీకృతమై వుంది. ఇలాంటప్పుడు అన్ని సామాజిక తరగతుల్లో కూడా తమ రెక్కాడితే కాని డొక్కాడనివారు అధికసంఖ్యలో వుంటారు. ఈ గ్రామంలో కూడా సెంటుభూమిలేని వారు ఎస్సీలలో 35%, బిసిలలో 32%, ఓసిలలో 20% వున్నారు వీరందరు వారి కుల,మతాలకు అతీతంగా తమ కష్టానికి తగిన కూలిరేటు కావాలని కోరుకునేవారే వీరికితోడు భూములు వున్నవారిలో సన్నకారు, చిన్నకారు, కౌలురైతులు కూడా అత్యధికంగా వున్నారు శ్రమను అమ్ముకునే వారే కూలిరేట్లు పెరిగితే వీరికి కూడా లాభం చేకూరుతుంది

అక్షరాస్యత

ఊరిలో అక్షరాస్యత 68శాతం వున్నది. పురుషుల్లో 78శాతం అక్షరాస్యులు వుంటే, స్త్రీలు 60శాతం మాత్రమే వున్నారు అక్షరాస్యతలో రాష్ట్రం (66 54%) కంటే ముందున్నది ఇది స్త్రీ, పురుష అక్షరాస్యతలో కూడా కనిపిస్తుంది. జిల్లా అక్షరాస్యత (51%) కంటే గ్రామం చాలా ముందుండడం గమనించవచ్చు ఈ గ్రామం ఆర్థికంగా

అభివృద్ధి చెందడం వలన ఇది సాధ్యమైంది అక్షరాస్యత ఎస్సి, బిసిలలో దాదాపు సమానంగా 64% వుండగా ఓసిలలో 81.43% వున్నది. ఓసిలకు ఇతరుల కంటే ఆదాయవనరులు ఎక్కువగా వుండటమే ఎక్కువ మంది చదువుకోవడానికి అవకాశం వచ్చింది ప్రాధమిక విద్యలో దళితులు దాదాపు సమానంగా వున్నారు కానీ ఇంటర్ వరకు చదివిన ఓసిలు 17% వుండగా, ఎస్లు 16% వుంటే ఎస్సిల కంటే వెనుకబడి బిసిలు 12 65% మాత్రమే వున్నారు డిగ్రీ ఆపైన చదివిన వారు గ్రామంలో 15 శాతం వున్నారు ఇది డిగ్రీలో ఓసి 18.10%, ఎస్సిలు 12 03% వుంటే బిసిలు 7 8% మరియు పిజిలో ఓసిలు 4 29%, ఎస్సిలు 2 49% కాగా, బిసిలు కేవలం 1 73% మాత్రమే వున్నారు ఇక్కడ ఓసిలకు చదువుకోవడానికి ఆర్థిక వనరులు అవకాశం కల్పించాయి అలాగే ఎస్సిలకు సంక్షేమ పధకాలు అవకాశం కల్పించాయి కానీ ఈ అవకాశాలు బిసిలకు తక్కువ కావడంతో ఎస్సిల కంటే కూడా వున్నత చదువులు అందుకోవడంలో వెనుకపడ్డారని అర్ధమవుతున్నది.

### ఆయుఃప్రమాణం

వృద్ధులు అంటే 70సంవత్సరాలకు పైబడి వున్నవారి సంఖ్య చాల తక్కువగా వున్నది వీరిలో ఎస్సి , బిసిలు దాదాపు సమానంగా వున్నారు వృద్ధుల్లో ఎక్కువ మంది ఎస్సి, బిసిల కంటే ఓసి సామాజిక తరగతిలో దాదాపు 4 రెట్లు ఎక్కువ వుండటం చూస్తాం. దళిత, బలహీనవర్గాలలో నామమాత్రంగా వున్నారు 60 సంవత్సరాలకు పై బడినవారు దళితుల కంటే బిసిలు 3 7 రెట్లు, ఓసిలు 6 రెట్లు ఎక్కువగా వున్నారు.

### గృహాలు - మౌలిక సదుపాయాలు

ఊర్లో సొంత ఇళ్లు కలిగిన వారు 89శాతం వున్నారు సామాజిక తరగతుల వారీగా చూస్తే స్వంత ఇళ్లు కలిగిన వారు ఓసిలలో 94%, బిసిలలో 88%, ఎస్సిలలో 85% వున్నారు అద్దె ఇంటిలో వుంటున్నవారు ఓసిలలో 4% మాత్రమే వుండగా బిసిలలో 9%, మరియు ఎస్సిలలో 11% వున్నారు పక్కాగృహాలు వున్నవారు 74శాతం అన్ని సామాజిక తరగతుల్లో కూడా 70% పైగా పక్కాగృహాలు కల్గివున్నారు ప్రభుత్వ సంక్షేమపధకాల వల్ల ఆర్థికంగా వెనుకబడిన వారికి యిలా లాభం చేకూరింది.

ఇంకా కరెంట్ లేని కుటుంబాలు 15 వున్నాయి వీటిలో ఒసిలు మినహా ఎస్సిలవి 6, బిసిలకు చెందినవి 9 కుటుంబాలు మరుగుదొడ్లు వున్న కుటుంబాలు

35శాతం వున్నాయి అంటే 65శాతం మందికి లేవు మరుగుదొడ్లు లేని వారిలో ఒసిలు 24% మాత్రమే వుండగా, బిసిలు 71% వుంటే అత్యధికంగా ఎస్‌సిలలో 89% కుటుంబాలకు లేకపోవడం గమనించాలి

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 25% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 12% భూమి మాత్రమే వుంది. 31% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

గ్రామంలో ట్రాక్టర్లు 5 వున్నాయి సర్వే లెక్కల ప్రకారం 4 ట్రాక్టర్‌లు బిసిలలో 3 ముస్లింలకు, ఒకటి మున్నూరుకాపు లకు వుంది ఒకటి ఒసిలలోని రెడ్డికి వున్నది. ఎస్‌సిలకు అసలు లేవు ట్రాక్టర్లు వున్న వారందరు భూస్వామ్య, ధనికరైతులే మొత్తం 8 కార్లలో ఒసి, బిసిలకు సమానంగా కలిగి వుండగా ఎస్సీలకు పూర్తిగానే లేవు ఒసిలు స్వంత అవసరాలకు కారు కలిగి వుండగా, ఒక ప్రవేటుఉద్యోగం వున్నా బిసి స్వంత అవసరానికి కారు కల్గివుండగా ముగ్గురు ఆర్థికవెసులుబాటు కోసం అద్దెకు ట్యాక్సీలుగా నడుపుతున్నారు మొత్తం 5 ఆటోలలో బిసిలకు 4, ఒసిలకు ఒకటి వుంది కూడా వున్నాయి బైక్‌లు 39, బైక్ సౌకర్యం గలవారిలో బిసిలు ముందు వరుసలో వుండగా వారికి దగ్గరగా ఒసిలు వున్నారు. ఒసిలు, బిసిల కంటే ఎస్‌సిలు వెనకబడి వున్నారు 70శాతం ఇళ్లకు టివిలు వున్నాయి టివిలు కల్గిన వారు ఒసిలలో 84శాతం, బిసిలలో 70% వుంటే ఎస్‌సిలలో కేవలం 52% మాత్రమే కల్గి వున్నారు సెల్‌ఫోన్ కల్గివున్నవారు 84 శాతం కలిగి వున్నారు వంటగ్యాస్ సౌకర్యం కల్గినవారు 48 శాతం గ్యాస్ సౌకర్యం గల వారిలో అత్యధికంగా ఒసిలలో 86% వుండగా, బిసిలలో 46% మరియు ఎస్‌సిలలో కేవలం 20% కుటుంబాలకు మాత్రమే వున్నది.

# వరంగల్ జిల్లా

## బూర్గుపాడ్

### స్థూల చిత్రణ

సుందరయ్య విజ్ఞాన కేంద్రం 201-2014 సంవత్సరంలో నిర్వహించిన గ్రామీణ సామాజిక ఆర్థిక సర్వేలో భాగంగా వరంగల్ జిల్లా బూర్గుపాడ్ గ్రామంలో 2013 డిశంబరులో తొలి దఫా, 2014 ఫిబ్రవరిలో మలి దఫా సర్వే నిర్వహించాము మండల కేంద్రం డోర్నకల్‌కు 12 కిలోమీటర్ల దూరంలో వరంగల్-నర్సంపేట రహదారిపై ఉన్న గ్రామం బూర్గుపాడ్ ఆటోలు, బస్ ఈ గ్రామం చేరటానికి ప్రధాన రవాణా సాధనాలు మెట్టపంటలే ఈ గ్రామ ఆర్థిక వ్యవస్థకు ఆధారం జామాయిలు తోటలు, మిర్చి, చిక్కుడు, పత్తి, వరి గ్రామంలో పండించే ముఖ్యమైన పంటలు కాలువ, బావులు, చెరువు ఈ గ్రామానికి ప్రధాన సాగునీటి వనరులు గ్రామంలో పోస్టాఫీసు, పంచాయితీ భవనం, విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్, రక్షిత మంచినీటి సరఫరా పథకం, మాధ్యమిక మరియు ఉన్నత పాఠశాలలు, రేషన్ దుకాణం, అంగన్‌వాడీ కేంద్రం ఉన్నాయి.

### జనాభా పొందిక

గ్రామంలో 373 కుటుంబాల్లో 1352 మంది జనాభా ఉన్నారు పురుషులు 699 స్త్రీలు 653 లైంగిక నిష్పత్తి 934 రాష్ట్ర లింగనిష్పత్తి 988 జిల్లా సగటు లైంగిక నిష్పత్తి 999 తో పోల్చినపుడు ఈ గ్రామంలో లైంగిక నిష్పత్తి తక్కువ అగ్రకులాల్లో లైంగిక నిష్పత్తి 847తో జిల్లా స్థాయి లైంగిక నిష్పత్తి కంటే చాలా వెనకబడి ఉంది దళితుల్లో 1104 లైంగిక నిష్పత్తి గిరిజన కుటుంబాల్లో ఈ నిష్పత్తి 909గా ఉంది వెనకబడిన తరగతుల్లో 960. జిల్లా సగటు కంటే ఒక్క దళిత కుటుంబాలు తప్ప మిగిలిన అన్ని సామాజిక తరగతులు లైంగిక నిష్పత్తి విషయంలో బాగా వెనకబడి ఉన్నట్లు ఈ సమాచారం స్పష్టం చేస్తుంది

అయుఃప్రమాణం

సర్వే సమయానికి ఐదేళ్ల లోపు వయసు కలిగిన జనాభా కేవలం 5 6 శాతంగా ఉంటే 17 శాతం జనాభా పాఠశాలకెళ్లే వయస్సున్న జనాభా ఉంది గ్రామ జనాభాలో 66 శాతం జనాభా శ్రమ చేయగలిగిన వారున్నారు 10 శాతం జనాభా 60 సంవత్సరాల పైబడిన జనాభా ఉంది అగ్రకులాలకు చెందిన కుటుంబాల్లో ఈ వయసు గ్రూపుకు చెందిన వారు ఎక్కువగా ఉండటం గమనించాల్సిన విషయం పాఠశాలకెళ్లే వయస్సున్న జనాభా గిరిజన తరగతిలో ఎక్కువగా ఉండటం ప్రత్యేక లక్షణంగా చెప్పాలి గ్రామంలో 16-40 సంవత్సరాల వయసు కలిగిన జనాభా అంటే యువత 47 శాతం ఉంది

సామాజిక పొందిక

మొత్తం 373 కుటుంబాలున్న ఈ గ్రామంలో 10 శాతం జనాభా దళితులు కాగా యాభై శాతం గిరిజన జనాభా, వెనకబడిన తరగతులకు చెందిన జనాభా 25 శాతం, అగ్రకులాలకు చెందిన జనాభా 14 శాతం ఉన్నారు జిల్లాలో సగటు దళితుల జనాభా నిష్పత్తితో పోల్చి చూస్తే ఈ గ్రామంలో దళితుల నిష్పత్తి చాలా తక్కువ అదే సమయంలో గిరిజనుల జనాభా జిల్లా సగటు కంటే మూడు రెట్లు ఎక్కువగా ఉంది. 2011 జనాభా లెక్కల ప్రకారం జిల్లాలో సగటు గిరిజన జనాభా నిష్పత్తి 15 11 శాతం ఉంటే ఈ గ్రామంలో 50 శాతంగా ఉంది అత్యధిక జనాభా కలిగిన కులం గిరిజన కులం. సుగాలి కుటుంబాలు 181 ఉన్నాయి గ్రామంలో 36 కుటుంబాలు మాదిగ కులానికి చెందినవి. 30 కుటుంబాలతో ముదిరాజ్ కులం తర్వాతి స్థానంలో ఉంది 25 కుటుంబాలు యాదవ కులానికి చెందినవి 20 కుటుంబాలు రెడ్డి కులానికి చెందనివి కమ్మ 16, వైశ్య 14 కుటుంబాలు, ఏడు కుటుంబాలు పద్మశాలి కులానికి చెందినవి కాగా ఆరు కుటుంబాలు విశ్వబ్రాహ్మణ కులానికి చెందినవి గౌడ కులం నాలుగు కుటుంబాలు, మూడు కుటుంబాలు రజకులు, మున్నూరు కాపు, కుమ్మరి, ఎరుకుల కులాలకు చెందినవ ఒక్కో కుటుంబం ఉన్నాయి. ఒక్క ముస్లిం కుటుంబం ఉంది

జీవనోపాధి వైవిధ్యం

సెన్సెస్ సర్వే పత్రంలో ప్రధమ ప్రాధాన్యత కలిగిన ఉపాధి, ద్వితీయ ప్రాధాన్యత కలిగిన ఉపాధి, తృతీయ ప్రాధాన్యత కలిగిన ఉపాధిల గురించిన సమాచారాన్ని తెలుసుకునే

ప్రయత్నం చేశాము ఈ సమచారం ప్రకారం వెల్లడైన వివరాలు ఇలా ఉన్నాయి. మొత్తం కుటుంబాల్లో 168 కుటుంబాలు సేద్యం తమ ప్రధాన జీవనాధారం అని చెప్పాయి వీరి నిష్పత్తి మొత్తం కుటుంబాల్లో 45 శాతం. మరో 143 కుటుంబాలు (38 శాతం) వ్యవసాయ కూలి పని ప్రధాన జీవనోపాధిగా పేర్కొన్నాయి వీరిలో 21 కుటుంబాల్లో కుటుంబ యజమాని పాలేరు పని చేయటం ద్వారా కుటుంబ పోషణ జరుపుకుంటున్నట్లు వెల్లడించాయి మొత్తం కుటుంబాల్లో పాలేరుగా పని చేస్తున్న కుటుంబాలు ఆరుశాతంగా ఉన్నాయి ఈ పరిస్థితి గ్రామంలో నెలకొన్న జీవనోపాధి కొరత తీవ్రతను ముందుకు తెచ్చే అంశంగా ఉంది కేవలం 14 కుటుంబాలు మాత్రమే ప్రభుత్వ, ప్రైవేటు ఉద్యోగాలు, స్వయం ఉపాధిపై ఆధారపడ్డట్లు వెల్లడించాయి 10 కుటుంబాలు సాంప్రదాయ కుల వృత్తులపై ఆధారపడి కుటుంబ పోషణ సాగించుకున్నట్లు తెలిపాయి మరో తొమ్మిదిశాతం కుటుంబాలు వ్యవసాయేతర వృత్తులపై ఆధారపడ్డట్లు సర్వేలో తెలిపాయి. మొత్తం కుటుంబాలను పరిశీలిస్తే 40 కుటుంబాలు (11%) స్త్రీల యాజమాన్యంలో వున్నాయి

**సాగుభూమి**

గ్రామంలో మొత్తం 771 ఎకరాల నికరసాగు భూమి ఉన్నట్లు సెన్సెస్ సర్వేలో నమోదు అయ్యింది ఇందులో 615 ఎకరాలు స్వంత భూములు యాభై ఐదు శాతం భూమికి, అంటే 339 ఎకరాలు సాగునీటి వసతి కలిగిన భూమి కాగా 276 ఎకరాలు మెట్టభూమిగా నమోదు అయ్యింది మెట్టభూమిలో 72 ఎకరాలు (26 శాతం) ఒక్క పంటకు కూడా సరిపడా సాగు నీటి వసతి లేకపోవటంతో పడావుగా పెట్టిన భూమి ఉన్నది 217 ఎకరాలు కౌలుకు తీసుకున్న భూమిగా నమోదు అయితే కౌలుకు ఇచ్చిన భూమి 62 ఎకరాలు మాత్రమే నమోదు అయ్యింది కౌలు భూమిలో 118 ఎకరాలు నీటి వసతి కలిగిన భూమి

**స్వంత సేద్యం - కౌలు సేద్యం**

గ్రామంలో మొత్తం 194 కుటుంబాలు సేద్యం చేస్తున్నాయి మొత్తం 58 కుటుంబాలు కౌలు చేస్తున్నాయి కౌలు చేస్తున్న కుటుంబాల్లో 12 కుటుంబాలు స్వంత భూమి లేనివారే 180 కుటుంబాలు, దాదాపు సగం కుటుంబాలు కేవలం వ్యవసాయ కూలి వేతనాలపై ఆధారడి ఉన్నాయి స్వంత సేద్యం చేస్తున్న కుటుంబాల్లో 50 శాతం గ్రామంలో సంఖ్య రీత్యా ఆధిపత్యం కలిగిన సుగాలి ఎస్టీలే మొత్తం నికర సాగులో సగభాగం వీరి చేతుల్లోనే సాగవుతున్న భూమి మొత్తం కౌలు కుటుంబాల్లో 95

శాతం పైగా సుగాలీ కుటుంబాలు కౌలు చేస్తున్నాయి ఇదే నిష్పత్తితో స్వంత భూమి సుగాలీలు కల్గివున్నారు వీరిలో స్వంత భూమి లేకుండా కౌలు చేస్తున్న సుగాలి కుటుంబాలు కేవలం తొమ్మిది మాత్రమే వెనకబడిన తరగతుల్లో 40 కుటుంబాలు స్వంతసేద్యం కలిగి ఉన్నాయి మొత్తం స్వంత సేద్యం చేస్తున్నవారిలో 20 శాతం వ్యవసాయకార్మికులు తమ భూములను పెద్ద రైతులకు కౌలుకు ఇచ్చి కేవలం వేతన శ్రమపై ఆధారపడుతున్న పరిస్థితి కన్పడుతోంది.

**ఆర్థిక తరగతుల పొందిక**

నికర సాగు విస్తీర్ణాన్ని, స్వంత శ్రమ, కూలికి వెళ్లిన శ్రమ వంటి అనేక ప్రమాణాలను మేళవించి గ్రామంలోని కుటుంబాలను వివిధ ఆర్థిక వర్గాలుగా విభజించటం జరిగింది. ఈ ప్రమాణాన్ని పాటించినపుడు గ్రామంలో అత్యధికశాతం కుటుంబాలు భూమి లేని వ్యవసాయకార్మిక కుటుంబాలు 36% ఉన్నాయి కాస్తో కూస్తో భూమి కలిగిన వ్యవసాయకార్మిక కుటుంబాలను కూడా కలిపితే 43% ఉన్నారు 18% సన్నకారు రైతాంగం, 13%చిన్న రైతులు, మధ్యతరగతి రైతులు ఎనిమిది శాతం, నాలుగు శాతం ధనికరైతులు, రెండు శాతం భూస్వాములు, మరో రెండు శాతం వ్యాపారస్తులు, ఒకటిన్నర శాతం వ్యవసాయేతర కార్మికులు 3 శాతం వరకు వివిధ రకాల ఉద్యోగాలు చేసేవారు ఉన్నారు వృత్తిదారులు రెండు శాతం, ఇతర వివిధ ఆదాయ వనరులపై ఆధారపడ్డవారు మరో నాల్గు శాతం ఉన్నారు వివిధ ఆర్థిక తరగతులచేతుల్లో సాగవుతున్న సాగుభూమి విస్తీర్ణం వివరాలు ఇలా ఉన్నాయి అరు శాతంగా ఉన్న భూస్వాములు, ధనిక రైతు కుటుంబాలు 42 శాతం భూమిని సాగు చేస్తున్నాయి. మరో 57 శాతం భూమిని 39 శాతంగా ఉన్న మధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతాంగం సాగు చేస్తోంది 43 శాతంగా ఉన్న వ్యవసాయ కార్మికులు మొత్తం గ్రామంలో సాగులో ఉన్న భూమిలో కేవలం ఒకటిన్నర శాతం మాత్రమే సాగు చేస్తున్నారు సాగు భూమి కేంద్రీకరణ తీవ్రతను ఈ నిష్పత్తులు తెలియచేస్తున్నాయి

**భూకేంద్రీకరణ**

భూకేంద్రీకరణ విశ్లేషణకు స్వంత భూమిని ప్రమాణంగా తీసుకున్నాము ఈ ప్రాతిపదికన పరిశీలించినపుడు కూడా సాగు భూమి కేంద్రీకరణలో ఉన్న అంతరాలు ఇక్కడ కూడా ప్రతిబింబిస్తున్నాయి. శీర్షస్థానంలో ఉన్న ఐదు శాతం కుటుంబాల చేతుల్లో ఉన్న స్వంత భూమి 282 ఎకరాలు. అంటే 46శాతం. అట్టడుగున ఉన్న 60 శాతం

కుటుంబాల చేతుల్లో ఉన్న స్వంత భూమి కేవలం20 ఎకరాలు అంటే మూడుశాతం రెండు శాతం లోపు ఉన్న భూస్వామ్య వర్గం చేతుల్లో 18 5 శాతం భూమి కేంద్రృతమై ఉంటే నాలుగు శాతంగా ఉన్న ధనిక రైతాంగం చేతుల్లో 22 శాతం భూమి కేంద్రీకతమై ఉంది 39 శాతంగా ఉన్న మధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతాంగం చేతుల్లో 51 శాతం భూమి ఉన్నది 43 శాతంగా ఉన్న వ్యవసాయ కార్మికుల చేతుల్లో ఏడు శాతం లోపు మాత్రమే భూమి ఉన్నది

## ఆర్థిక సామాజిక తరగతుల్లో భూకేంద్రీకరణ తీవ్రత

స్వంత భూమిని ప్రమాణంగా తీసుకుని సగటు కుటుంబ కమతం విస్తీర్ణం నిర్ధారించి సగటు కుటుంబ కమతం కంటే ఎక్కువ భూమి కలిగిన కుటుంబాల శాతాన్ని లెక్కించే ప్రయత్నం చేశాము భూ కేంద్రీకరణ తీవ్రతను కుటుంబాల స్థాయిలోనూ, వర్గాల స్థాయిలోనూ, ముఖ్యమైన సామాజిక తరగతుల స్థాయిలోనూ పరిశీలించినపుడు పరిస్థితి ఈ క్రింది విధంగా ఉంది గ్రామంలో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 1 64 ఎకరాలు ఉన్నత స్థానంలో ఉన్న ఐదు శాతం కుటుంబాల వరకే సగటు కుటుంబ కమతం విస్తీర్ణం పరిశీలిస్తే భూ కేంద్రీకరణ తీవ్రత మరింత కొట్టొచ్చినట్లుగా కనిపిస్తుంది ఈ కుటుంబాల సగటు కమతం విస్తీర్ణం 14.5 ఎకరాలు. అట్టడుగున ఉన్న 60 శాతం కుటుంబాల్లో సగటు కమతం విస్తీర్ణం కేవలం 14 సెంట్లు

భూస్వాములు, ధనిక రైతు వర్గపు కుటుంబాల్లో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 12 ఎకరాలు కాగా మధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతాంగం కుటుంబాల్లో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 2 17 ఎకరాలు వ్యవసాయకార్మిక కుటుంబాలు నామమాత్రపు సగటు కమతం విస్తీర్ణంతో సరిపెట్టుకున్నాయి వ్యవసాయ కార్మిక కుటుంబాల సగటు కుటుంబ కమతం విస్తీర్ణం నాలుగు సెంట్లు. ఇందరమ్మ ఇళ్ల నిర్మాణానికి ప్రభుత్వం కేటాయించిన స్థలాల విస్తీర్ణం కంటే కూడా తక్కువ వ్యవసాయ కార్మిక కుటుంబాల సగటు కమతం విస్తీర్ణంతో పోల్చినపుడు భూస్వామి వర్గపు కుటుంబ కమతం విస్తీర్ణం 457 రెట్లు అధికంగా ఉండటం ఈ గ్రామంలో ఉన్న భూ కేంద్రీకరణ తీవ్రతకు నిదర్శనం

కులాల వారీగా భూకేంద్రీకరణ తీవ్రతను పరిశీలించినపుడు అగ్రకులాల గ్రామ సగటు కుటుంబ కమతం విస్తీర్ణం కంటే బాగా ఎక్కువగా, 6 92 ఎకరకాలు ఉంది. ఇది గ్రామ సగటు కుటుంబ కమతం విస్తీర్ణం కంటే ట్లు అధిక మోతాదులో స్వంత భూమి

కలిగి ఉంటే అత్యధిక జనభా కలిగిన సుగాలి కుటుంబాల సగటు కుటుంబ కమతం విస్తీర్ణం గ్రామ సగటు కుటుంబ కమతం విస్తీర్ణం కంటే నాలుగు రెట్లు ఎక్కువ. 1 84 ఎకరాలు ఉంది వెనకబడిన తరగతుల్లో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం గ్రామ సగటు సగం మాత్రమే, 79 సెంట్లుగా ఉంది దళితుల్లో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం గ్రామ సగటు కంటే తక్కువ, 22 సెంట్లు మాత్రమే

## అక్షరాస్యత

ఈ గ్రామం 51 శాతం అక్షరాస్యత సాధించినపట్లు సర్వేలో నమోదైంది. జిల్లా అక్షరాస్యత సగటు కంటే చాలా వెననకబడి ఉంది జిల్లా అక్షరాస్యత రేటు 65.11 శాతంగా ఉంది. జిల్లాలోని దళితుల్లో అక్షరాస్యత రేటు 61 79 శాతంగానూ, గిరిజనుల్లో 48.45 శాతంగానూ ఉంది. ఈ గ్రామంలో దళితుల అక్షరాస్యత రేటు 38 శాతానికి మించలేదు. గిరిజనుల్లో 45 శాతం, వెనకబడిన తరగతుల్లో 49 శాతం అక్షరాస్యతను సాధిస్తే అగ్రకులాల్లో ఇది అత్యధికంగా 86 శాతంగా ఉంది ప్రాథమి విద్యాభ్యాసం పూర్తి చేసిన వారి నిష్పత్తి మొత్తం గ్రామ జనాభాలో 18% ఉంటే వీరిలో ఎనిమిది శాతం గిరిజనులు ఉన్నత పాఠశాల స్థాయి విద్యను పూర్తి చేసిన వారి నిష్పత్తి 21 శాతంగా ఉంది ఇంటర్మీడియట్ పూర్తి చేసిన వారు 5 శాతంగా ఉంటే పట్టభద్రులు మరో ఐదు శాతం ఉన్నారు. గ్రామంలో ఆధిపత్యం కలిగిన సుగాలీలు అన్ని స్థాయిల్లోని విద్యావంతుల్లో ముందంజలో ఉన్నారు. దళితులు తప్ప మిగిలిన అన్ని సామాజిక తరగతుల్లో స్త్రీల అక్షరాస్యత శాతం పురుషుల అక్షరాస్యత శాతం కంటే తక్కువగా ఉంది. దళితుల్లో మాత్రం పురుషుల అక్షరాస్యత 32%ఉంటే స్త్రీల అక్షరాస్యత శాతం 43గా ఉంది.

## గృహవసతులు

తొంభై శాతం కుటుంబాలకు స్వంత ఇళ్లు ఉంటే 67% కుటుంబాలకు మాత్రమే పక్కా ఇళ్లు ఉన్నాయి. గిరిజనుల్లో పక్కా ఇళ్లు లేని కుటుంబాలు అధికంగా ఉన్నాయి. నివాసాల తర్వాత ముఖ్యమైన గృహవసతి లెట్రిన్లు, విద్యుత్ మరియు వంటగ్యాస్ కనెక్షన్లు. 94 శాతం నివాసాలకు విద్యుత్ కనెక్షన్లు ఉండటం విశేషం కేవలం 35 శాతం కుటుంబాలకు మాత్రమే సర్వే సమయానికి లెట్రిన్ సౌకర్యం ఉంది ఎస్టీ, ఒసీ కుటుంబాల్లో వరుసగా 13 శాతం, 11 శాతం కుటుంబాలకు లెట్రిన్ సౌకర్యం ఉంటే మిగిలిన సామాజిక తరగతుల్లో లెట్రిన్ సౌకర్యం కలిగిన కుటుంబాలు నామమాత్రంగానే ఉన్నాయి. ఈ గ్రామంలో నేటికీ 60శాతం కుటుంబాలు వంటగ్యాస్ లేకుండా వున్నాయి.

## వ్యవసాయోపకరణాలు - పశు సంపద

సర్వేలో వెల్లడైన ప్రధాన వ్యవసాయోపకరణాలు ట్రాక్టర్లు, ఎద్దులు వ్యవసాయానికి అనుబంధంగా ఉన్న పశుసంపద గ్రామంలో ఐదు ట్రాక్టర్లు ఉంటే అన్నీ అగ్రకులాల్లోని రైతాంగానికే ఉన్నాయి అటవీ ప్రాంతానికి సమీపంలో ఉండటంతో పశుసంపద విషయంలో పరిస్థితి కాస్త మెరుగ్గా ఉంది ఎద్దులు 15 కుటుంబాలకు మాత్రమే ఉంటే గేదెలు, ఆవులు కలిగి ఉన్న కుటుంబాలు అత్యధికంగా 124 కుటుంబాలకు ఉన్నాయి మొత్తం 355 పశువులు, 573 గొర్రెలు ఉన్నాయి సాంప్రదాయవత్తిగా ఉన్న యాదవుల కంటే ఈ గ్రామంలో గిరిజనులకు ఎక్కువ సంఖ్యలో గొర్రెలు ఉన్నాయి

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 46% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 3% భూమి మాత్రమే వుంది. 49% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

## వినియోగ వస్తువులు

గ్రామంలో 74 సైకిళ్లు, ఎనిమిది స్కూటర్లు, 50 మోటార్‌సైకిళ్లు, ఏడు ఆటోలు ఉన్నాయి ఒసీ కుటుంబాల్లో ఎక్కువ మోటార్ సైకిళ్లు ఉంటే ఎస్టీ కుటుంబాల్లో ఎక్కువ సైకిళ్లు ఉన్నాయి గిరిజన యువతకు ప్రభుత్వ స్వయం ఉపాధి పథకం కింద ఆటో రుణాలు సమకూర్చటంతో ఆ కుటుంబాలు ఆటోలు బాడుగకు తిప్పుతున్నాయి 54 శాతం కుటుంబాలకు మాత్రమే టివిలు ఉన్నాయి 71 శాతం కుటుంబాలకు సెల్‌ఫోన్లు ఉన్నాయి

## ఖమ్మం జిల్లా

# సుజాతనగర్

**ముఖచిత్రం**

సుందరయ్య విజ్ఞాన కేంద్రం 2013-14 లో నిర్వహించిన గ్రామీణ సామజిక అర్థిక సర్వేలో భాగంగా ఖమ్మం జిల్లా సుజాతానగర్ గ్రామాన్ని 2013 డిశంబరులో తొలి విడత, 2014 ఫిబ్రవరిలో మలి విడత సర్వే చేయటం జరిగింది గ్రామాన్ని సెన్సస్ మరియు శాంపిల్ సర్వే చేశాం. సెన్సస్ సర్వేలో వెల్లడైన అంశాలను పేర్కొంటున్నాం

ఉత్తర తెలంగాణలోని ఖమ్మం జిల్లాలోని కొత్తగూడెం మండలంలో సుజాతనగర్ గ్రామం వున్నది మండల కేంద్రానికి 10 కిలోమీటర్ల దూరంలో వుంటుంది గ్రామానికి బస్సు, ఆటో రవాణా సౌకర్యం వున్నాయి

గ్రామంలో పోస్టాఫీసు, విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్ వున్నాయి. రక్షిత మంచినీటి సౌకర్యం వున్నది. పంచాయితీ భవనం, ప్రాధమిక, ప్రాధమికోన్నత పాఠశాల, హైస్కూల్, చౌకధరల దుకాణం, అంగన్వాడీ కేంద్రం వున్నాయి గ్రామంలో వాహనాలు ఎక్కువగా వుండటం గమనించాలి. గ్రామంలో ప్రధానంగా వరి, పత్తి, సాగు చేస్తారు

**జనాభా**

మా సెన్సస్ సర్వే ప్రకారం 510కుటుంబాలు వున్నాయి మొత్తం గ్రామ జనాభా 1836 ఇందులో పురుషులు 902, స్త్రీలు 934 మంది. లింగ నిష్పత్తి 1035 అంటే ప్రతి వెయ్యి మంది పురుషులకు 1035 మంది స్త్రీలు వున్నారు స్త్రీల సంఖ్య ఎస్‌సి కుటుంబాల్లో ఎక్కువగా (1090) వుంటే, ఎస్‌టి కుటుంబాల్లో తక్కువగా వున్నది. 2011 జనాభా లెక్కల ప్రకారం రాష్ట్ర లింగ నిష్పత్తి 988. రాష్ట్ర సగటు కంటె బాగా ఎక్కువగా

వున్నది జిల్లాలో లింగ నిష్పత్తి 1003 అంటే ఈ గ్రామంలో స్త్రీల సంఖ్య రాష్ట్ర, జిల్లా సగటు నిష్పత్తుల కంటే బాగా ఎక్కువగా వున్నట్లు అర్థమౌతున్నది సామాజిక తరగతుల వారీ జనాభాను చూస్తే ఎస్‌సి 232 (13%), ఎస్‌టి 162 (7%), బిసి 1036 (56%), ఓసి 399 (23%), ఇతరులు ఏడుగురు వున్నారు. రాష్ట్రంలో ఎస్‌సి జనాభా 15 45శాతం, జిల్లాలో 16 84 శాతం వుంటే ఈ గ్రామంలో 13శాతం వున్నారు అయితే ఎస్‌టి ఇక్కడ 7శాతం మాత్రమే వున్నారు

సామాజిక పొందిక

మతాల ప్రాతిపదికన చూస్తే హిందువులు 441 కుటుంబాలు (86%) వుంటే, ముస్లిం కుటుంబాలు 64 (13%), క్రిస్టియన్ కుటుంబాలు 4 (1%) వున్నాయి ఈ గ్రామంలోని మొత్తం 510 కుటుంబాలలో ఎస్‌సి కుటుంబాలు 65 (13%), ఎస్‌టి కుటుంబాలు 38 (7%), బిసి 288 (56%), ఓసి 117 (23%) వున్నాయి కులాల వారీగా చూస్తే మొత్తం 23 కులాలు వున్నాయి వీరిలో మున్నూరు కాపు ఎక్కువగాను, తర్వాత కమ్మ రెండో స్థానంలో వున్నారు గౌడ్ 8, కొండ జాతి గిరిజనులు మూడు, కాపు నాలుగు, కమ్మ 65( 13%), కుమ్మరి మూడు, మాదిగ 21 (4%), మాల 26 (5%), ముదిరాజ్ 10 (2%), మున్నూరు కాపు 79 (15%), ముస్లింలు ఆరు, ముస్లిం బిసి 57 (11%), నాయీబ్రాహ్మణ 12, ఒడ్డెర ఎనిమిది, పద్మశాలి 5, రజక 31 (6%), రెడ్డి 14 , సుగాలీ 19 (4%), వెలమ రెండు, విశ్వబ్రాహ్మణ, వైశ్య 17 చొప్పున, యాదవ 11, ఎరుకుల 16, ఇతరులు 76 (7%) కుటుంబాలు వున్నాయి

జీవనోపాధి

గ్రామం వ్యవసాయాధారితంగా లేదు వ్యవసాయంపై ఆధారపడిన వారి సంఖ్య తక్కువగానే వున్నది వ్యవసాయం చేస్తున్న కుటుంబాలు 103 వున్నాయి వ్యవసాయ కూలీపై ఆధారపడినవి 116 వరకు వున్నాయి అంటే 40శాతం మాత్రమే ఊరు పట్టణానికి దగ్గరగా వుండటం వల్ల మౌలిక సదుపాయాలు, వాహనాలు, వ్యాపారాలు, ఇతర వృత్తులు ఎక్కువగా కన్పిస్తాయి చిన్న చిన్న కిరాణా షాపులు, హూటల్, ఇతర వ్యాపారాలు చేసుకుంటున్న కుటుంబాలు దాదాపు 38 వరకు వున్నాయి వృత్తి ఆధారంగా బ్రతుకుతున్న కుటుంబాలు 37 వున్నాయి ఉద్యోగస్తులు అంటే ప్రభుత్వ, ప్రయివేటు అన్నీ కలిపి సుమారు 50 కుటుంబాల వరకు వున్నాయి. రియల్‌ఎస్టేట్ వ్యాపారులు వున్నారు నాలుగు

ఆర్ఎంపి కుటుంబాలు వున్నాయి డ్రైవర్‌గా చేస్తూ కుటుంబ పోషణ గడుస్తున్న కుటుంబాలు 28 కుటుంబాలు వున్నాయి. ఇంటిఅద్దెలతో జీవనం గడుపుతున్న కుటుంబాలు కూడా వున్నాయి. భూమిని కౌలుకు ఇచ్చి, వ్యాపారాలు చేసుకుంటున్న కుటుంబాలు వున్నాయి స్త్రీల యాజమాన్యంలో 66 (13శాతం) కుటుంబాలు వున్నట్లు మా సర్వేలో వెల్లడైంది.

### అక్షరాస్యత

గ్రామంలో అక్షరాస్యత మెరుగ్గా వున్నది రాష్ట్ర, జిల్లా సగటులలో, సామాజిక తరగతుల సగటులతో పోల్చితే అధికంగా వున్నది ఊర్లో చదువుకున్న వారు 71 శాతం వున్నారు. ప్రభుత్వ లెక్కల ప్రకారం తెలంగాణ రాష్ట్ర సగటు 66 54శాతం. జిల్లాలో 65 75శాతం అంటే రాష్ట్ర, జిల్లా సగటు కంటే బాగా ఎక్కువగా వున్నదన్న మాట ఓసి సామాజిక తరగతిలో 81శాతం వుండటం విశేషం బిసిలలో 71శాతం వున్నది. ప్రభుత్వ లెక్క ప్రకారం ఎస్‌సిలలో అక్షరాస్యత 62 90శాతం వుంటే గ్రామంలో 62 50శాతం వున్నది ఎస్‌టిలలో జిల్లా సగటు 51 59శాతం వుంటే గ్రామంలో 65శాతం వరకు వుండటం గమనించదగ్గ విషయం

ఏయే స్థాయి వరకు ఎంతెంత మంది చదువుకున్న వారు వున్నారో పరిశీలించాం ప్రాథమిక స్థాయి వరకు చదువుకున్న వారు 346 (19%) మంది వుంటే, సెకండరీ స్థాయి వరకు 576 (31%) మంది వున్నారు ఇంటర్ చదివిన వారు 139 (8%) మంది వున్నారు వీరిలో ఓసి తరగతికి చెందిన వారే ఎక్కువగా వున్నారు డిప్లమా చేసిన వారు గ్రామంలో 17 మంది వుండటం విశేషం. డిగ్రీ వరకు చదివిన వారు 172 మంది వున్నారు. ఈ స్థాయిలో ఓసి, ఎస్‌టి తరగతికి చెందిన వారు అధికంగా వుండటం గమనించదగ్గది. పిజి వరకు చదివిన వారు ఊర్లో 48 మంది అందులో సగం బిసి, ఓసి తరగతికి చెందినవారు 40 మంది వున్నారు పిహెచ్‌డి చేసిన వారు ఎవరూ లేరు

### ఆయుఃప్రమాణం

గ్రామంలో యువత (16నుండి 40 సం వరకు ) దాదాపు 50శాతం మంది వున్నట్లు సర్వేలో తేలింది. యువత శాతం ఎస్‌సి, బిసిలలో ఎక్కువగా వున్నట్లు లెక్కలు తెలుపుతున్నాయి. జనాభాలో 71 శాతం మంది శ్రమ చేయగల్గిన వారు (16సం నుండి 60 వరకు ) వున్నారు 61 నుండి 70 సంవత్సరాల మధ్య వయస్సు

వారు గ్రామంలో 70 మంది వుంటే, వారిలో ఓసి, బిసి సామాజిక తరగతులకు చెందిన వారు 56 మంది వున్నారు ఇక 70 సంవత్సరాల పైన వున్న వారు 27 మంది వుంటే ఓసి, బిసి తరగతుల్లో 24 మంది వున్నారు దీనికి కారణం ఆర్థికంగా బలంగా వుండటం, వైద్య సౌకర్యాలు పొందడం కారణం కావచ్చు

**పశుసంపద**

గ్రామంలో సర్వే సమయానికి ఎద్దులు వున్న కుటుంబాలు నాలుగు మాత్రమే వున్నాయి ఆవులు, గేదెలు 57 కుటుంబాలకు 184 వున్నాయి అందులో 95% బిసి, ఓసిల వద్దనే వున్నాయి. ఎస్‌సి కుటుంబాలు గ్రామంలో గణనీయంగానే వున్నా పశు సంపద లేకపోవడటం గమనించాలి గొర్రెలు వున్న ఆరు కుటుంబాలలో 65 గొర్రెలు వున్నాయి ఇందులో బిసిలు ఎక్కువగా కల్గి వున్నారు

**సాగుభూమి**

గ్రామంలో మా సెన్సస్ ప్రకారం మొత్తం సాగుభూమి 515 ఎకరాలు సాగునీటి వసతి కల్గిన భూమి 326 ఎకరాలు వున్నది. మెట్టభూమి 296 ఎకరాలు. ఇందులో పడావు భూమి 8 ఎకరాలు ఊర్లో పడావు భూమి చాలా స్వల్పంగా వున్నది సాగునీటి వసతి కల్గిన భూమి దాదాపు 63శాతం వున్నది కౌలుకు చేస్తున్న సాగునీటి వసతి భూమి 113 ఎకరాలు వుంటే, మెట్టభూమి 144 ఎకరాలుగా వున్నది కౌలుకు ఇచ్చిన మాగాణి విస్తీర్ణం 74 ఎకరాలు, మెట్ట విస్తీర్ణం 41 ఎకరాలుగా నమోదైనది నికర సాగుభూమి, కౌలుకు తీసుకున్నవారి భూమి, కౌలుకు ఇచ్చిన వారి భూమి విస్తీర్ణాలలో వ్యత్యాసం వున్నది అంటే కౌలుకు తీసుకున్నవారు, ఇచ్చిన వారు పూర్తి వివరాలు చెప్పనందున, ఇతర గ్రామాల పరిధిలో వున్న భూమి కౌలుకు చేస్తున్నందువల్ల ఈ తేడా కన్పిస్తుంది

**కౌలుదారులు**

గ్రామంలో కౌలు ఎలా వుందో పరిశీలించాం మొత్తం 510 కుటుంబాల్లో 56 కుటుంబాలు (11శాతం) కౌలు చేస్తున్నాయి వీరు సుమారు 313 ఎకరాలను కౌలుసాగు చేస్తున్నారు అంటే మొత్తం సాగుభూమిలో 60శాతం కౌలుక్రింద వున్నట్లు అర్థమౌతున్నది కౌలుకుటుంబాల్లో ఆర్థిక తరగతుల వారీ చూస్తే భూస్వామ్య కుటుంబాలు

నాలుగు వున్నాయి. వీరు 64 ఎకరాలు చేస్తున్నారు. ధనిక రైతు కుటుంబాలు నాలుగు వుంటే వారి క్రింద 39 ఎకరాలు, మధ్యతరగతి 19 కుటుంబాలు వుంటే వారు సాగుచేస్తున్న భూమి 86.5ఎకరాలు సాగు చేస్తున్నారు. చిన్నకారు రైతు 14 కుటుంబాలు వుంటే వారు సాగుచేస్తున్న భూమి 43 5 ఎకరాలు, 15 సన్నకారు రైతు కుటుంబాలు 24 25ఎకరాలు సాగుచేస్తున్నట్లు మా పరిశీలనలో వెల్లడైంది కౌలుకు చేస్తున్న వారిలో మధ్యతరగతి రైతులే ఎక్కువ విస్తీర్ణం చేస్తున్నారు ఆ తర్వాత ఎక్కువ విస్తీర్ణం భూస్వాములు చేస్తున్నారు కౌలుకు ఇచ్చిన వారిలో ఎక్కువ మంది కొద్దిపాటి భూమి వున్న వ్యవసాయ కార్మికులు

కౌలు రైతులు ఏ సామాజిక తరగతికి చెందిన వారో తెలుసుకున్నాం బిసిలు మొత్తం 32 కుటుంబాలు వున్నారు వారి సాగుచేస్తున్న భూమి 125 5 ఎకరాలు కాగా, ఓసిలు 18 కుటుంబాలు 95 5 ఎకరాలు సేద్యం చేస్తున్నారు ఇక ఎస్‌సిలు నాలుగు కుటుంబాలు, ఎస్‌టిలు రెండు కుటుంబాలు వున్నారు వీరిద్దరు కలిపి 46 ఎకరాలు సాగుచేస్తున్నారు భూస్వాముల్లో వున్న నాలుగు కుటుంబాల్లో ముగ్గురు కమ్మ కులానికి చెందినరు. ధనిక రైతుల్లో వున్న నాలుగు కుటుంబాల్లో నాలుగు సామాజిక తరగతులకు చెందిన వారు వున్నారు. ఇక కులాల వారీగా పరిశీలిస్తే ధనిక రైతుల్లో ఒకరు కొండజాతి గిరిజనులు వున్నారు మొత్తం 56 కుటుంబాల్లో మున్నూరు కాపు 19 కుటుంబాలు, కమ్మ 15 కుటుంబాలు వున్నాయి.

### వర్గపొందిక ఎలా వుంది?

వర్గాల రీత్యా చూస్తే భూస్వాములు ఐదుగురు (1%), ధనిక రైతులు 11 (2%), మధ్యతరగతి రైతులు 23 (4.5%), చిన్నకారు రైతులు 22 (4.3%), సన్నకారురైతులు 42 (8%), వ్యవసాయ కార్మికులు 133 (26%), వృత్తిదారులు 32 (6%), వ్యవసాయేతర కార్మికులు 57(11%), స్వయం ఉపాధి 21 (4%), ఉద్యోగులు 49(9%), వ్యాపారులు 73 (14%), వడ్డీ వ్యాపారులు నలుగురు, ఇతరులు 38 (7%) వున్నారు. ఉద్యోగులు, వ్యాపారులు, స్వయం ఉపాధి, వ్యవసాయేతర కూలీల కుటుంబాలు ఎక్కువగా వుండటం వున్నాయి

ఆర్థిక తరగతులను నిర్ణయించేటపుడు ఆయా కుటుంబాల వద్ద వున్న నికర సాగుభూమి విస్తీర్ణాన్ని ప్రాతిపదికగా తీసుకున్నాం. ఈ రూపంలో భూకేంద్రీకరణను చూసినపుడు 1శాతంగా వున్న భూస్వాముల చేతిలో 22% భూమి వున్నది 2 శాతంగా

వున్న ధనిక రైతుల చేతుల్లో 23శాతం భూమి వుంది. అంటే ఈ రెండు వర్గాలు కలిపి 3శాతంగా వుంటే వీరి చేతుల్లో వున్న భూమి 46% వున్నది ఇక 4.5శాతంగా వున్న మధ్యతరగతి రైతు కుటుంబాల చేతిలో 28శాతం భూమి వున్నది. 12 శాతంగా వున్న చిన్న, సన్నకారు రైతు వర్గాల చేతుల్లో కేవలం 15 శాతం భూమి వున్నది అంటే భూస్వాములు, ధనిక రైతుల చేతుల్లో భూమి కేంద్రీకృతమై వున్నదని అర్థమౌతున్నది

### భూకేంద్రీకరణ

భూకేంద్రీకరణను పరిశీలించినపుడు స్వంత భూమినే ప్రాతిపదికగా తీసుకున్నాం గ్రామంలో 510 కుటుంబాల్లో 101 కుటుంబాలకు మాత్రమే 373 ఎకరాల భూమి వున్నది 409 కుటుంబాలకు భూమిలేదు. అంటే 80 శాతం మందికి సెంటు భూమి కూడా లేదు భూమి వున్న పైస్థాయి 5% శాతం కుటుంబాల చేతుల్లో 234 ఎకరాలు అంటే 62శాతం భూమి కేంద్రీకృతమై వుంటే, క్రిందిస్థాయి 60శాతం కుటుంబాలకు అసలు భూమి లేకపోవడం గమనించదగ్గ విషయం అంటే గ్రామంలో భూమి కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతమై వున్నదని అర్థమౌతున్నది గ్రామంలో వున్న మొత్తం కుటుంబాలకు నికర సాగుభూమిని పంచినట్లయితే ఒక్కో కుటుంబానికి ఎకరాకు పైగా వుండాలి కొన్ని కుటుంబాలకు 20 ఎకరాలకు పైగా వున్న కుటుంబాలు వున్నాయి

గ్రామంలో సామాజిక తరగతుల వారీ పరిశీలించాం మొత్తం బిసి కుటుంబాలు 44 వుంటే వారి చేతుల్లో 141 ఎకరాలు వున్నది 42 ఓసి కుటుంబాల చేతుల్లో 179 ఎకరాలు వున్నది ఇక ఎస్సి కుటుంబాలు నాలుగు వుంటే వారి చేతుల్లో కేవలం 7.5 ఎకరాలు వుంటే, 9కుటుంబాలుగా వున్న ఎస్టి చేతుల్లో నామమాత్రంగా 4 5 ఎకరాలు వుండటం గమనార్హం గ్రామంలో వున్న స్వంత భూమి 373 ఎకరాల్లో దాదాపు సగం భూమి ఓసి చేతుల్లోనే కేంద్రీకృతమై వున్నది బిసిల చేతుల్లో 37శాతం భూమి వున్నది ఇక అట్టడుగున వున్న ఎస్సి, ఎస్టి చేతుల్లో భూమి కేవలం 3శాతం వుంది

### గృహాలు - మౌలిక సదుపాయాలు

ఊర్లో 80 శాతం మందికే స్వంత ఇళ్లు వున్నాయి ఇంకా 20 శాతం మంది కుటుంబాలకు స్వంత ఇళ్లు లేకపోవడం గమనించదగ్గది ముఖ్యంగా ఎస్సిలలో 17%, ఎస్టిలలో 29%, బిసిలకు 21శాతం కుటుంబాలకు ఇళ్లు లేవు పక్కాగృహాలు గ్రామ

జనాభాలో 55 శాతానికి వున్నాయి ఎస్టి సామాజిక తరగతికి 44% కుటుంబాలకే వున్నాయి కచ్చా ఇళ్లల్లో 26శాతం కుటుంబాలు వున్నాయి బిసిలు ఎక్కువ శాతం కుటుంబాలు వుండటం చూస్తాం అద్దె ఇంట్లో వున్న కుటుంబాలు 96 అంటే (19%) వున్నాయి అందులో 56 కుటుంబాలు బిసిలవే కావడం గమనార్హం

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 62% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 0% భూమి మాత్రమే వుంది. 80% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

గ్రామంలో నాలుగు ట్రాక్టర్స్ వున్నాయి అందులో మూడు ఓసిలకు చెందినవి రైస్‌మిల్లులు రెండు వున్నాయి ఇది కూడా వారికే చెందినది సైకిల్స్ 133 వుంటే, బిసిలకు 60శాతంపైన వున్నాయి స్కూటర్స్ 14 వుంటే, ఓసిలకే 8 వున్నాయి బిసిలకు 4వున్నాయి బైక్‌లు గణనీయంగా 138 వున్నాయి ఇందులో ఎక్కువగా బిసిలకు, తర్వాత ఓసిల వద్ద వున్నాయి ఈ రెండు తరగతుల వద్దనే 87% వున్నాయి ఊర్లో కార్లు 7 వున్నాయి వీటిలో ఆరు బిసి, ఓసిల వద్ద వున్నాయి ఆటోలు 17 వున్నాయి వీటిలో 14 ఆటోలు ఈ తరగతుల వద్దనే వున్నాయి మొత్తం బిసి, ఓసిల వద్దనే వున్నాయి 77 శాతం కుటుంబాలకు టివిలు వున్నాయి ఓసిలకు 86శాతం కుటుంబాలకు వుంటే, ఎస్సిలకు 60శాతం కుటుంబాలకే వున్నాయి

95% ఇళ్లకు విద్యుత్ సౌకర్యం వున్నది ఎస్టి, ఎస్సిలలో 11 శాతం కుటుంబాలకు విద్యుత్ లేదు ఓసిలకు 98శాతం కుటుంబాలకు విద్యుత్ వున్నది గ్రామం మొత్తంగా 76 శాతం కుటుంబాలకు మరుగుదొడ్లు వుంటే ఓసిలకు 86 శాతం కుటుంబాలకు వున్నాయి అదే ఎస్సిలలో 58శాతం కుటుంబాలకు మాత్రమే వున్నాయి సెల్‌ఫోన్‌లు 83 శాతం కుటుంబాల వారు వాడుతున్నారు ఎస్సిలలో 71శాతం కుటుంబాలే కల్గివున్నారు వంటగ్యాస్ గ్రామంలో 71 శాతం కుటుంబాలకు వున్నది ఓసిలలో 88 శాతం, ఎస్సిలలో 51శాతం కుటుంబాలకు ఈ సౌకర్యం వున్నది.

# వరంగల్ జిల్లా

## కొత్తూరు

### స్థూల చిత్రణ

సుందరయ్య విజ్ఞాన కేంద్రం 201-2014 సంవత్సరంలో నిర్వహించిన గ్రామీణ సామాజిక ఆర్థిక సర్వేలో భాగంగా వరంగల్ జిల్లా కొత్తూరు గ్రామంలో 2013 డిసెంబరులో తొలి దఫా, 2014 ఫిబ్రవరిలో మలి దఫా సర్వే నిర్వహించాము మండల కేంద్రం ఖానాపూర్‌కు 8 కిలోమీటర్ల దూరంలో వరంగల్ - మంగపేట ప్రధాన రహదారికి దక్షిణం దిక్కున ఉన్న గ్రామం కొత్తూరు ఆటోలు, బస్ ఈ గ్రామం చేరటానికి ప్రధాన రవాణా సాధనాలు సాగునీటి వసతి కలిగిన గ్రామం గానే చెప్పుకొవచ్చు గోధుమ, మిర్చి, పసుపు, పత్తి, వరి గ్రామంలో పండించే ముఖ్యమైన పంటలు కాలువ, బావులు ఈ గ్రామానికి ప్రధాన సాగునీటి వనరులు పాకాల చెరువు ఈ గ్రామంలో సేద్యానికి ప్రధాన నీటివనరు గ్రామంలో పోస్టాఫీసు, పంచాయితీ భవనం, విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్, రక్షిత మంచినీటి సరఫరా పథకం, ప్రాధమిక మరియు ఉన్నత పాఠశాలలు, రేషన్ దుకాణం, అంగన్‌వాడీ కేంద్రం ఉన్నాయి

### జనాభా పొందిక

481 కుటుంబాల్లో 1717 జనాభా గల గ్రామం ఇది 879 మంది పురుషులు, 838 మంది స్త్రీలు వున్నారు లైంగిక నిష్పత్తి 971 రాష్ట్ర లింగనిష్పత్తి 988 జిల్లా సగటు లైంగిక నిష్పత్తి 999 వుంది ఈ నిష్పత్తుల కంటే గ్రామంలో తక్కువ దళితుల్లో లైంగిక నిష్పత్తి 804 వెనకబడిన తరగతుల్లో 974 ఎస్టీల్లో 943 ఒక్క వెనకబడిన తరగతులు తప్ప మిగిలిన అన్ని సామాజిక తరగతుల్లో లైంగిక నిష్పత్తి జిల్లా సగటు కంటే తక్కువగా ఉంది దళితుల్లో బాగా తక్కువగా ఉంది అగ్రకులాలు గ్రామంలో కేవలం ఐదు మాత్రమే కావటంతో పోల్చటానికి ప్రమాణం కాదు

**ఆయుఃప్రమాణం**

మొత్తం గ్రామ జనాభాలో సర్వే సమయం నాటికి ఏడు శాతం ఐదేళ్ల వయసులోపు ఉన్న వారు. మరో 19 శాతం పాఠశాలకెళ్లే వయస్సు 6 నుండి 15 ఏళ్ల వయస్సున్న జనాభా ఉన్నారు గ్రామంలో 65 శాతం జనాభా శ్రమ చేయగలిగిన జనాభాగా ఉన్నారు. అందులో 48 శాతం యువతే కావటం గమనార్హం 60ఏళ్ల పైబడిన వృద్ధులు ఎనిమిదిన్నర శాతం ఉన్నారు గ్రామ జనాభాలో బిసి జనాభా ఎక్కువగా ఉన్నందువల్ల అన్ని వయస్సుల్లోనూ వీరి జనాభా ఎక్కువగా ఉంది

**అక్షరాస్యత**

గ్రామంలో అక్షరాస్యత జిల్లా సగటు అక్షరాస్యతతో పోల్చినపుడు చాలా తక్కువగా ఉంది. జిల్లాలో సగటు అక్షరాస్యత 65శాతం కాగా ఈ గ్రామం కేవలం 57శాతం అక్షరాస్యతను మాత్రమే సాధించగలిగింది అగ్రకులాలు మినహా మిగిలిన అన్ని సామాజిక తరగతుల్లోనూ అక్షరాస్యత రేటు జిల్లా సగటు కంటే తక్కువగా ఉంది గ్రామ జనాభాలో 8శాతంగా వున్న దళితులు అక్షరాస్యతలో కేవలం 5శాతం మాత్రమే ఉన్నారు అదేవిధంగా 22 శాతంగా ఉన్న గిరిజనులు అక్షరాస్యుల్లో 11 శాతానికి పరిమితమయ్యారు. 68 శాతంగా ఉన్న వెనకబడిన తరగతుల్లో సగానికి సగం నిరక్షరాస్యులుగా వుండిపోయారు సంఖ్యరీత్యా బాగా తక్కువగా ఉన్న అగ్రకులాల్లో సగటు అక్షరాస్యత 83 శాతంగా ఉన్నది. గ్రామంలో అతి తక్కువ అక్షరాస్యత కలిగిన గిరిజన సామాజిక తరగతితో పోల్చినపుడు అగ్రకులాల్లో అక్షరాస్యత దాదాపు రెట్టింపుగా ఉంది గ్రామంలో సగటు అక్షరాస్యత రేటు జిల్లా సగటు కంటే తక్కువగా ఉంటే స్త్రీ పురుషుల అక్షరాస్యత విషయంలో పరిస్థితి మరింత దారుణంగా ఉంది. అక్షరాస్యులైన దళితుల్లో మహిళలు 49 శాతంగా ఉంటే, గిరిజనుల్లో కేవలం 39% మంది మాత్రమే బిసిల్లో మహిళా అక్షరాస్యత 49 శాతంగా ఉంది

**సామాజిక పొందిక**

గ్రామ జనాభాలో అత్యధికంగా 68 శాతం వెనకబడిన తరగతులకు చెందిన జనాభా ఉంటే 23శాతంతో గిరిజనులు రెండో స్థానంలో ఉన్నారు జిల్లాలో గిరిజన జనాభా నిష్పత్తి కంటే ఈ గ్రామంలో వీరి నిష్పత్తి ఎక్కువగా ఉంది జిల్లాలో 15 శాతం గిరిజన జనాభా ఉన్నట్లు 2011 గణాంకాలు తెలియచేస్తున్నాయి ఎనిమిది శాతంతో

దళితులు మూడో స్థానంలో ఉన్నారు గ్రామంలో అగ్రకులాలకు చెందిన జనాభా కేవలం ఒక్క శాతం మాత్రమే ఒక్క కుటుంబం ముస్లిం కుటుంబం ఉంది గ్రామంలో మాలలు 20 కుటుంబాలు కాగా మాదిగలు 19 కుటుంబాలు 108 సుగాలి, 16 గౌడ కుటుంబాలు, ఆరు కుమ్మరి, 104 కురుమ, 95 యాదవ, 40 ముదిరాజు, 14 పద్మశాలి, మరో 14 రజక, 12 విశ్వబ్రాహ్మణ కుటుంబాలు ఉండగా మిగిలిన కులాలు ఎరుకుల, మున్నూరుకాపు, నాయీబ్రాహ్మణ, పద్మశాలి, కాపు, రెడ్డి, వైశ్య ఒక్కోటి ఐదు కంటే తక్కువ కుటుంబాలు మాత్రమే ఉన్నాయి గ్రామంలో మొత్తం కుటుంబాల్లో ప్రధాన కులాలు చూసినపుడు 21 శాతంతో కుమ్మరి 22 శాతంతో కురుమ, 20 శాతంతో యాదవ, 22 5 శాతంతో సుగాలి కులాలు ఆధిపత్యంలో ఉన్నాయి మిగిలిన అన్ని కులాలు కలిపి 18 శాతం వరకు వాటా కలిగి ఉన్నాయి

## జీవనోపాధి వైవిధ్యం

గ్రామం ప్రధానంగా వ్యవసాయ ఆర్థిక వ్యవస్థపై ఆధారపడ్డ గ్రామం మొత్తం 480 కుటుంబాల్లో 299 కుటుంబాలు సేద్యంపై ఆధారపడ్డాయి మరో 90 కుటుంబాలు వ్యవసాయ కూలీ వేతనాలపై ఆధారపడ్డాయి. మొత్తం వ్యవసాయం మీద ప్రత్యక్షంగా ఆధారపడ్డ కుటుంబాలుగా చూస్తే 75శాతం కుటుంబాలు ఉన్నాయి తొమ్మిది కుటుంబాల్లో కుటుంబ యజమానులు పాలేర్లుగా పని చేస్తున్నారు మరో 31 కుటుంబాలు, దాదాపు తొమ్మిది శాతం వివిధ రకాలైన ఉద్యోగాలు చేస్తున్నాయి మరో 15 కుటుంబాలు సాంప్రదాయవృత్తులపై ఆధారపడి జీవనోపాధిపొందుతున్నట్లు తెలిపాయి గ్రామంలో 31 కుటుంబాలు వ్యవసాయేతర పనులే ప్రధాన జీవనోపాధి అని చెప్పాయి ఈ కుటుంబాలు గ్రామంలో మరో తొమ్మిది శాతం ఉన్నాయి మరో పది శాతం కుటుంబాలు కేవలం పెన్షన్లపై ఆధారపడి వున్నాయి గ్రామంలోని మొత్తం కుటుంబాలలో స్త్రీల యాజమాన్యంలో వున్న కుటుంబాలు 65 (14%) వున్నాయి.

## సాగుభూమి

గ్రామంలో మొత్తం 318 కుటుంబాల చేతుల్లో 610 88 ఎకరాలు స్వంత భూమి నమోదు అయ్యింది అంటే మొత్తం కుటుంబాల్లో 66 శాతం కుటుంబాలకు స్వంత భూమి ఉన్నది ఇందులో 536 ఎకరాలకు ఏదో ఒకరకమైన సాగునీటి వసతి ఉన్న భూమి అంటే మొత్తం సాగు భూమిలో 88 శాతం భూమికి సాగునీటి వసతి ఉన్నది సాగునీటి వసతి కలిగిన భూమి శాతం ఎక్కువగా ఉండటం గమనించదగ్గది

మిగిలిన 72 ఎకరాలు మెట్ట భూమి కౌలుసేద్యం కింద మనో 172 ఎకరాలు నమోదు కాగా అందులో 156 ఎకరాలు సాగునీటి వసతి కలిగిన భూమి ఉంది నికర సాగు భూమి లెక్కకు వచ్చే సరికి 731 ఎకరాలు నమోదు అయ్యింది

**సాగుదారులు - కౌల్దారులు**

మొత్తం 318 కుటుంబాల చేతుల్లో స్వంత భూమి ఉంది వీరిలో 17 కుటుంబాలు తమ భూమిని పూర్తిగా కౌలుకు ఇచ్చాయి మొత్తం 96 కుటుంబాలు కౌలు చేస్తున్నట్లు సర్వేలో వెల్లడించాయి ఈ కుటుంబాల చేతుల్లో 172 ఎకరాలు కౌలు కింద సాగవుతోంది ఇందులో స్వంత భూమి లేకుండా కౌలు భూమి సాగు చేస్తున్న కుటుంబాలు 20 కుటుంబాలు ఉన్నాయి స్వంత భూమి కలిగిన కుటుంబాల్లో 72 కుటుంబాలు కురుమ కుటుంబాలు ఉన్నాయి వీరి చేతుల్లో మూడోవంతు భూమి ఉంది 77 సుగాలి కుటుంబాల చేతుల్లో 141 ఎకరాలు, 81 యాదవ కులానికి చెందిన కుటుంబాల చేతుల్లో 165 5 ఎకరాలు స్వంత భూమి ఉన్నది కౌల్దారుల్లో 21 కుటుంబాలు కురుమ కుటుంబాలు, మరో 24 కుటుంబాలు సుగాలి కుటుంబాలు, 19కుటుంబాలు యాదవకులానికి చెందిన కుటుంబాలు ఉన్నాయి మొత్తం 96 కౌలు కుటుంబాల్లో 64 కుటుంబాలు ఈ మూడు కులాల నుండే ఉన్నాయి వీరిలో స్వంత భూమి లేకుండా కేవలం కౌలు భూమి మాత్రమే చేస్తున్నవారు కేవలం ఎనిమిది కుటుంబాలు ఉన్నాయి భూమి కలిగిన కుటుంబాల నిష్పత్తి బాగా ఎక్కువగా వున్నది

**ఆర్థిక తరగతుల పొందిక**

నికర సాగు విస్తీర్ణాన్ని, స్వంత శ్రమ, కూలికి వెళ్లిన శ్రమ వంటి అనేక ప్రమాణాలను మేళవించి గ్రామంలోని కుటుంబాలను వివిధ ఆర్థిక వర్గాలుగా విభజించటం జరిగింది. ఈ ప్రమాణాన్ని పాటించినపుడు గ్రామంలో అత్యధికశాతం కుటుంబాలు అత్యధికంగా 27 శాతం సన్నకారు రైతు కుటుంబాలుగా ఉన్నాయి 22 25 శాతంతో వ్యవసాయ కార్మికులు తర్వాతి స్థానంలో ఉన్నారు వీరిలో భూమి లేని వ్యవసాయ కార్మికులు కేవలం 17 శాతం మాత్రమే. 20 శాతం కుటుంబాలతో చిన్న రైతులు మూడో స్థానంలోనూ 13 5 శాతంతో మధ్యతరగతి రైతులు నాల్గో స్థానంలోనూ ఉన్నారు. ధనిక రైతాంగం ఒక్క శాతం ఉంటే భూస్వామి కుటుంబం ఒక్కటి మాత్రమే ఉంది. వ్యవసాయేతర తరగతుల్లో వ్యవసాయేతర కార్మికులు 3%కుటుంబాలు ఉన్నాయి వ్యాపారస్తులు, వృత్తిదారులు, ఉద్యోగుల కుటుంబాలు ఒక్కో శాతం చొప్పున ఉన్నాయి.

## భూకేంద్రీకరణ

పైన చెప్పుకున్నట్లు గ్రామంలో 66 శాతం కుటుంబాలకు స్వంత భూమి ఉంది ఇందులో పైనున్న ఐదు శాతం కుటుంబాల్లో 25 శాతం భూమి కేంద్రీకృతమై ఉంది ఏ మాత్రం భూమి లేని కుటుంబాలు 163 కుటుంబాలు ఉన్నాయి మొత్తం కుటుంబాలతో పోల్చినపుడు వీరు 34 శాతం ఉన్నారు భూమిలేని కుటుంబాల్లో కూడా కురుమ, సుగాలి కుటుంబాలు అధిక సంఖ్యలో ఉన్నాయి దిగువన ఉన్న 60 శాతం కుటుంబాల చేతుల్లో భూమి కేవలం 77 12 ఎకరాలు మాత్రమే అంటే 60%కుటుంబాల చేతుల్లో కేవలం 13% భూమి మాత్రమే ఉంది. ఆర్థిక తరగతులవారీ భూకేంద్రీకరణను పరిశీలిస్తే రెండు శాతంగా ఉన్న భూస్వాములు, ధనిక రైతు కుటుంబాల చేతుల్లో 9 శాతానికిపైగా భూమి కేంద్రీకృతమై ఉంటే 13 శాతంగా ఉన్న మధ్యతరగతి చేతుల్లో 39 శాతం భూమి కేంద్రీకృతమై ఉంది

## ఆర్థిక సామాజిక తరగతుల్లో భూకేంద్రీకరణ తీవ్రత

భూ కేంద్రీకరణ తీవ్రతను అంచనా వేయటానికి స్వంత భూమిని ప్రమాణంగా తీసుకుని సగటు కుటుంబ కమతం విస్తీర్ణం నిర్ధారించి సగటు కుటుంబ కమతం కంటే ఎక్కువ భూమి కలిగిన కుటుంబాల శాతాన్ని లెక్కించే ప్రయత్నం చేశాము గ్రామంలో సగటు కుటుంబ కమతం 1 27 ఎకరాలు ఉన్నత స్థానంలో ఉన్న ఐదు శాతం కుటుంబాల చేతుల్లో ఉన్న భూమి వరకు సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 6 5 ఎకరాలుగా ఉంది గ్రామ సగటు కుటుంబ కమతం విస్తీర్ణం కంటే ఇది ఐదు రెట్లు ఎక్కువ దిగువన ఉన్న 60 శాతం కుటుంబాల వరకు పరిశీలిస్తే సగటు కుటుంబ కమతం విస్తీర్ణం కేవలం 26 సెంట్లుగా ఉంది దిగువన ఉన్న 60 శాతం కుటుంబాల సగటు కుటుంబ కమతం విస్తీర్ణం కంటే ఎగువన ఉన్న ఐదు శాతం కుటుంబాల కుటుంబ కమతం విస్తీర్ణం 25 రెట్లు ఎక్కువగా ఉంది

ఆర్థిక తరగతుల వారీగా పరిశీలించినపుడు భూ కేంద్రీకరణ తీవ్రత మరింత ఎక్కువగా ఉన్న విషయం కనిపిస్తోంది భూస్వాములు, ధనిక రైతువర్గపు కుటుంబాల్లో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 9 41 ఎకరాలు కాగా మధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతాంగం కుటుంబాల్లో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 1.80 ఎకరాలు వ్యవసాయకార్మిక, వ్యవసాయేతర కార్మిక కుటుంబాల వరకు పరిశీలిస్తే కుటుంబ సగటు

కమతం విస్తీర్ణం కేవలం 26 సెంట్లు మాత్రమే వ్యవసాయ కార్మిక కుటుంబాల సగటు కుటుంబ కమతం విస్తీర్ణం ఈ గ్రామంలో కాస్త మెరుగ్గా 16 సెంట్లుఉంది వ్యవసాయ కార్మిక కుటుంబాల సగటు కమతం విస్తీర్ణంతో పోల్చినపుడు భూస్వామి వర్గపు కుటుంబ కమతం విస్తీర్ణం 112 రెట్లు అధికంగా ఉండటం ఈ గ్రామంలో ఉన్న భూ కేంద్రీకరణ తీవ్రతకు నిదర్శనం

కులాల వారీగా భూకేంద్రీకరణ తీవ్రతను పరిశీలించినపుడు అగ్రకులాల గ్రామ సగటు కుటుంబ కమతం విస్తీర్ణం కంటే బాగా ఎక్కువగా 4 4 ఎకరాలు ఉంది. ఇది గ్రామ సగటు కుటుంబ కమతం విస్తీర్ణం కంటే ఎక్కువ దళితుల్లో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 40 సెంట్లు కాగా గిరిజనుల్లో 1 29 ఎకరాలు, బిసిల్లో 1.32 ఎకరాలుగా ఉంది.

### గృహవసతులు

గ్రామంలో 96 శాతం కుటుంబాలకు స్వంత ఇళ్లు ఉండగా పక్కా ఇళ్లు కలిగి ఉన్న కుటుంబాలు మాత్రం 40 శాతమే. గ్రామ జనాభాలో ఎనిమిది శాతంగా ఉన్న దళితులు స్వంత ఇళ్లు కలిగిన కుటుంబాల్లో ఏడున్నర శాతం, పక్కా ఇళ్లు కలిగిన కుటుంబాల్లో ఐదున్నర శాతం మాత్రమే దళితులు ఉన్నారు పక్కా ఇళ్లు కలిగిన కుటుంబాల్లో అత్యధికులు బిసి సామాజిక తరగతికి చెందిన వారున్నారు. ఇళ్ల తర్వాత ముఖ్యమైన గృహవసతి విద్యుత్ కనెక్షన్లు, గ్యాస్ కనెక్షన్లు మరియు లెట్రిన్లు. గ్రామంలో 32 శాతం కుటుంబాలకు మాత్రమే లెట్రిన్లు ఉన్నాయి స్వంత లెట్రిన్లు కలిగిన కుటుంబాల్లో బిసి సామాజిక తరగతి ముందంజలో ఉంది విద్యుత్ కనెక్షన్ల విషయానికి వస్తే 92 శాతం కుటుంబాలు విద్యుత్ కనెక్షన్లు కలిగి ఉన్నాయని వెల్లడించాయి

### పశుసంపద – వ్యవసాయోపకరణాలు:

వ్యవసాయోపకరణాలు, అనుబంధ వృత్తులకు సంబంధించిన ఆదాయ వనరుల్లో రైసు మిల్లులు, ట్రాక్టర్లు, పశుసంపద గురించిన సమాచారం సేకరించాము గ్రామంలో మొత్తం 16 ట్రాక్టర్లు ఉంటే 10 ట్రాక్టర్లు బిసీ కులాల్లో ఉన్నాయి పశు సంపద విషయంలో

కూడా బిసీ సామాజిక తరగతి అగ్రభాగాన ఉన్నది మొత్తం 124 కుటుంబాలు పశుసంపదను కలిగి ఉంటే అందులో 98 బిసి సామాజిక తరగతికి చెందినవి 304 పశువులు నమోదయ్యాయి 20 కుటుంబాల్లో 354 గొర్రెలు ఉన్నాయి ఇవి ప్రధానంగా సాంప్రదాయవృత్తి చేసుకుంటున్న యాదవ, కురుమ కుటుంబాల్లోనే వున్నవి

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 25% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 13% భూమి మాత్రమే వుంది. 34% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

**రవాణా మరియు వినిమయసాధనాలు**

సగానికి పైగా కుటుంబాలకు సైకిళ్లే ప్రధాన రవాణా సాధనంగా ఉంది మోటార్ సైకిళ్లు 75 కుటుంబాలకు ఉంటే స్కూటర్ వినియోగిస్తున్నట్లు ఏడు కుటుంబాలు వెల్లడించాయి. ఒసీ, బిసి సామాజిక తరగతుల్లో కుటుంబానికి ఒకటి చొప్పున రెండు కార్లు ఉన్నాయి. మరో ఏడు కుటుంబాల్లో ఆటోలు ఉన్నాయి. ఇవి వ్యక్తిగత రవాణా సాధనాలుగా కంటే కుటుంబానికి అనుబంధ ఆదాయ వనరుగా ఉపయోగపడుతున్నాయి వీటి తర్వాత గ్రామ స్థాయిలో ప్రధాన వినిమయ వస్తువులుగా టివిలు, సెల్‌ఫోన్లు ఉన్నాయి గ్రామంలో 59 శాతం కుటుంబాలకు మాత్రమే టివి సెట్లు ఉంటే 72 శాతం కుటుంబాలకు సెల్‌ఫోన్లు ఉన్నాయి

# మెదక్ జిల్లా

# వెంకటాపూర్

### గ్రామ ముఖచిత్రం

సుందరయ్య విజ్ఞాన కేంద్రం నిర్వహించిన గ్రామీణ సామాజిక, ఆర్థిక సర్వేలో భాగంగా మెదక్ జిల్లా వెంకటాపూర్ గ్రామసర్వే 2013 డిశంబరులో తొలి దఫా, 2014 జూన్‌లో మలి దఫా సర్వే నిర్వహించాము సర్వే విషయాలను మీ ముందుంచుతున్నాం ఈ గ్రామం సిద్ధిపేట మండలంలో, మండల కేంద్రానికి 15 కి.మీ దూరంలో వుంది. దీనికి సమీపంలో వున్న హైవే యన్ హెచ్ 44 దగ్గర ప్రయాణాలకు ఆటోలను వుపయోగిస్తారు. గ్రామానికి విద్యుత్ సరఫరా, విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్ వున్నాయి పోస్టుఫీసు, రక్షిత మంచినీటి పథకం, ప్రజా పంపిణీ కేంద్రం, పంచాయితీ భవనం, అంగన్‌వాడీ కేంద్రం కూడా వున్నాయి విద్యా సౌకర్యం బాగుంది ప్రాధమిక, మాధ్యమిక, వున్నత పాఠశాలలు వున్నాయి ఊర్లో ఫ్లోరైడ్ సమస్య వుంది

స్త్రీలు బీడీలు చుట్టేపనిలో ఎక్కువగా వున్నారు వలసలు వున్నాయి కొందరు గల్ఫ్ దేశాలకు వలస పోతున్నారు ఉపాధి పని బాగా జరుగుతుందని కొంతమంది చెప్పారు కూలీలంతా ఏకమై కూలిరేట్లు పెంచుకోగలిగారు విద్య, వైద్యం ఖర్చులు పెరిగాయని చాలామంది చెప్పారు. పస్తులు లేకున్నా పచ్చడిమెతుకులతో సర్దుకుపోవలసిన పరిస్థితులు యెక్కువగానే వుంటాయని చెప్పారు గ్రామంలో గల్ఫ్ దేశాలకు వలసలు ఎక్కువగా వెళ్తున్న కుటుంబాలు వున్నాయి కుల వివక్ష అనేక రూపాల్లో వున్నట్లు మా సర్వేలో వెల్లడైంది

### గ్రామ జనాభా-సామాజిక తరగతులు- కులాలు

ఈ గ్రామం మొత్తం జనాభా 1280 అందులో పురుషులు 660, స్త్రీలు 620 స్త్రీ,పురుష నిష్పత్తి 939 అంటే ప్రతి 1000మంది పురుషులకు 939 స్త్రీలు మాత్రమే

వున్నారని అర్థం 2011 జనాభా లెక్క ప్రకారం రాష్ట్రంలో యీ నిష్పత్తి 988 కాగా జిల్లాలో అది 1000గా వుంది గ్రామ నిష్పత్తి యీ రెండిటి కంటె హీనంగానే వుంది యీ నిష్పత్తిని సామాజిక తరగతుల వారీ పరిశీలిస్తే మిగిలిన తరగతుల కంటె ఒ సి లలోనే యిది చాలా తక్కువగా 792 మాత్రమే వుంది యస్ సి లలో యిది 1020గా నమోదైంది ప్రభుత్వ లెక్కల ప్రకారం యస్ సి లలో యీ నిష్పత్తి 1008కాగా యస్ టి లలో అది 977 మాత్రమే మొత్తం జనాభాలో బి సి జనాభా సగం కంటే యెక్కువ, అంటే 57శాతం వుంది తరువాత స్థానంలో 31శాతంతో యస్ సి లు వున్నారు రాష్ట్రంలో వీరు 15శాతం మాత్రమే వున్నారు ఒ సి లు తక్కువగా 11శాతం మాత్రమే వున్నారు యస్ టి లు అత్యల్పంగా రెండు శాతం వున్నారు రాష్ట్రంలో వీరు 9శాతం వున్నారు స్త్రీ,పురుష నిష్పత్తి బి సి, ఒ సి లలో వెయ్యికి పైగానే వుంది కాని యస్ సి లలో యిది చాలా తక్కువగా 804 మాత్రమే వుంది

గ్రామంలో మొత్తం 297 కుటుంబాలు వున్నాయి అందులో యస్ సి లు 100కుటుంబాలు లేదా 34శాతం, యస్ టి లు 5కుటుంబాలు లేదా 1 68శాతం, బి సి లు అత్యధికంగా 159 కుటుంబాలు లేదా 54శాతం, ఒ సి లు 33కుటుంబాలు లేదా 11శాతం కులాల పరంగా చూస్తే అత్యధికంగా మాల 53 కుటుంబాలు వుంటే, మాదిగ 47, కురుమ 38 రెడ్డి 28, ఒడ్డెర 22, కుటుంబాల వారున్నారు మిగిలిన కులాలు ముదిరాజ్ 17 రజక11, విశ్వబ్రాహ్మణ 12, కుమ్మరి 8, గౌడ్ 37, నాయీబ్రాహ్మణ 6, యాదవ మున్నగునవి ఈగ్రామంలో హిందూ కుటుంబాలు 97 64శాతం వున్నాయి మిగిలిన 2 36శాతం కుటుంబాలు ముస్లిం కుటుంబాలు ఇక్కడ స్త్రీల యాజమాన్యంలో గల కుటుంబాలు 24 వున్నాయి అంటే 8 శాతం

## అక్షరాస్యత

గ్రామంలో అక్షరాస్యత 59శాతం వుంది కానీ అది పురుషులలో 68 శాతం వుండగా, స్త్రీలలో 49 శాతం మాత్రమే వున్నది ఒ సి లలో 80 శాతం అక్షరాస్యులు వున్నారు అక్షరాస్యతలో బి సి లకంటె యస్ సి లే కొంత ముందు వున్నారు బి సి ల అక్షరాస్యత 56శాతం వుంటే యస్ సి ల అక్షరాస్యత 59శాతం వుంది అయినా ఎస్సిలలో స్త్రీల అక్షరాస్యత 46శాతం మాత్రమే వున్నది వీరి కంటే బిసి స్త్రీలు 48 శాతంతో కొంతమెరుగ్గా వున్నారు 2011 జనాభా లెక్కల ప్రకారం అక్షరాస్యత తెలంగాణాలో 67% వుంటే, మెదక్ జిల్లాలో 61%వున్నది గ్రామ అక్షరాస్యత ఈ రెండింటి కంటె తక్కువగానే వుంది

ఈ గ్రామంలో 10వ తరగతి వరకు చదివిన వాళ్లు 20శాతం వున్నారు. వారిలో ఒ సి లు అత్యధికంగా 26శాతం వుండగా బి సిలు అందరికంటే తక్కువ 19 శాతం మంది మాత్రమే వున్నారు వీరికంటె యస్ సి లు ఒక శాతం ఎక్కువగా వున్నారు డిగ్రీ చదివినవారు గ్రామంలో 11శాతం వుంటే ఒ సి లలో అత్యధికంగా 18శాతం, బి సి లలో అత్యల్పంగా ఒ సి లలో సగం అంటే 9శాతం మాత్రమే వున్నారు యస్ సి లలో 13శాతం వరకు వున్నారు పైరెండు స్థాయిల్లోనూ బి సి లు యస్ సి లకంటే కూడా వెనుకబడి వున్నారు పోస్టుగ్రాడ్యుయేట్ స్థాయి వరకు చదివిన వారిలో ఈ సామాజిక తారతమ్యాలు యింకా పెరిగాయి ఈ స్థాయి వరకు చదివిన వారిలో ఒ సి లు అత్యధికంగా 4శాతానికి పైగా వుండగా యస్ సి లలో అత్యల్పంగా 0.23శాతం మాత్రమే వున్నారు. బి సి లలో 1 24శాతం వున్నారు గ్రామం మొత్తం మీద వీరు 1 48శాతం వున్నారు. యీ తారతమ్యాలకు అయా సామాజిక తరగతులకు గల భూమే కారణం ఈ సూత్రానికి యస్ సి లు దిగువ స్థాయిల్లో మినహాయింపుగా వున్నారు

**ఆయుఃప్రమాణం**

16 నుండి 60 సంవత్సరాల వయసు వున్నవారిని పని చేయగలవారిగా అనుకుంటే అలాంటి వారు ఈ గ్రామంలో 71 శాతం వున్నారు 16 నుండి 40 సంవత్సరాల వయస్సులో వున్న యువత 50% వున్నది 11 నుండి 20, 20 నుండి 30 సంవత్సరాల వ్యవధిలో వీరు అత్యధికంగా 19 శాతం, 21 శాతం వున్నారు కాని 30 నుండి 40, 40 నుండి 50, 50 నుండి 60, 60 నుండి 70 సంవత్సరాల వ్యవధుల్లో వున్నవారు క్రమంగా తగ్గిపోతూ వున్నారు వారు వరుసగా 17 శాతం, 13 శాతం, 8 శాతం, 5 శాతంగా వున్నారు 70 సంవత్సరాల పైబడి బ్రతికే వారు ఒ సి లలో అత్యధికంగా 4 35శాతం వుండగా, యస్ సి.లలో అత్యల్పంగా 1 27 శాతం మాత్రమే వున్నారు ఆర్థికంగా శక్తిలేని వారు ముందుగానే చనిపోతున్నారనేది అన్ని గ్రామాల్లోనూ రుజువు అవుతూనే వుంది గ్రామం మొత్తం మీద 70 సంవత్సరాల పైబడి వయసు కలిగిన వారు 2 27 శాతం వున్నారు

**జీవనోపాధి**

గ్రామంలో వున్న 297 కుటుంబాల్లో 119 కుటుంబాలు (40%) సేద్యమే ప్రధానంగా చేస్తున్నట్లు సర్వేలో వెల్లడైంది వ్యవసాయ కూలీపై ఆధారపడిన కుటుంబాలు

39 వున్నాయి వృత్తి ఆధారంగా జీవిస్తున్న కుటుంబాలు 23 వున్నాయి ఒడ్డెర కుటుంబాలు 22 వుంటే అందులో టాక్సీ, ట్రాక్టర్ డ్రైవర్స్‌గా జీవిస్తున్న 4 కుటుంబాలు, బిల్డింగ్ వర్కర్స్‌గా 8 కుటుంబాలు వున్నాయి ఎనిమిది కుమ్మరి కుటుంబాల్లో రెండు కుటుంబాలు వృత్తే జీవనోపాధిగా వున్నవి నాయీబ్రాహ్మణ ఆరు కుటుంబాల్లో నాలుగు కుటుంబాలు వృత్తే ప్రధానంగా వున్నవి విశ్వబ్రాహ్మణ 12 కుటుంబాల్లో 5కుటుంబాలు వృత్తిలో వున్నాయి టైలర్‌గా మాదిగ కుటుంబం చేస్తున్నది హమాలీలుగా మాల కులానికి చెందిన రెండు కుటుంబాలు చేస్తున్నాయి ప్రభుత్వ లేదా ప్రయివేటు ఉద్యోగాలు చేస్తున్న కుటుంబాలు 21 వుండటం విశేషం ప్రయివేటు ఉద్యోగం చేస్తున్న వారిలో ఒకరు వడ్డీవ్యాపారిగా కూడా వున్నారు

## వ్యవసాయం

ఈ గ్రామంలో 286 ఎకరాలు సాగునీటి వసతిగల భూమి, 375 ఎకరాల వర్షాధార భూమి మొత్తం 661 ఎకరాల స్వంత భూములున్నాయి మొక్కజొన్న, ప్రత్తి, బీన్స్, వరి, ప్రొద్దు తిరుగుడు, టమాటో, జొన్న ప్రధాన పంటలు 40 శాతానికి పైగా వ్యవసాయ భూమికి సాగునీరు అందుతుంది మిగిలిన భూమి వర్షాధారం సాగునీటి వనరులు ప్రధానంగా బోరు బావులు గ్రామంలో చెరువు కూడా వుంది 8 ట్రాక్టర్లు కూడా వున్నాయి సాగుభూమి పరంగా చూస్తే యీ ట్రాక్టర్లు ఎక్కువే భూమిలేని కుటుంబాలు 57 అంటే 19.2 శాతం భూములు ప్రధానంగా రెడ్డి, కురుమ కులాలకే వున్నాయి సెంటో, కుంటో మిగిలిన కులాలకు కూడా భూములున్నాయి వ్యవసాయంలో యాంత్రీకరణ బాగా పెరిగింది అయినా గతసమాజ దోపిడీ పద్ధతులు - మేరలు, నగదుకు బదులు ధాన్యం చెల్లింపులు, వడ్డీ కట్టుబాట్లు వగైరా యేదో ఒక మోతాదులో కొనసాగుతున్నాయి అప్పు యిచ్చిన భూస్వామికి తప్పకుండా కూలికిపోవాలని చెప్పారు అప్పు యిచ్చిన వారికే ధాన్యం అమ్మాలి

## వర్గపొందిక

మొత్తం 297 కుటుంబాలను సాగు భూమి, శ్రమల ఆధారంగా వర్గీకరించగా ఆ కుటుంబాలలో ఒక భూస్వామి, ఒక ధనిక రైతు మాత్రమే వున్నట్లుగా సమాచారం అందింది అంటే వీరు మొత్తం కుటుంబాలలో 0 66 శాతం మాత్రమే వున్నారు మధ్యతరగతి రైతులు 15 అంటే 5 1 శాతం, చిన్నకారు రైతులు 90, అంటే 30.3

శాతం, సన్నకారు రైతులు 104, అంటే 35శాతం కుటుంబాలు వున్నాయి భూమిగల వ్యవసాయ కార్మికులు 21అంటే 7శాతం కుటుంబాలు వున్నాయి. భూమిలేని వ్యవసాయ కార్మికులు 12 అంటే 4శాతం కుటుంబాలు, వ్యవసాయేతర కార్మికులు 12, అంటే 4శాతం కుటుంబాలు వున్నాయి. మిగిలిన వర్గాలు మొత్తం (వృత్తిదార్లు, స్వయం వుపాధి గలవారు, ప్రయివేటు వుద్యోగులు, ప్రభుత్వ వుద్యోగులు, వ్యాపారులు, ఇతరులు) కలిసి 41, లేదా 13.8 కుటుంబాలు వున్నాయి ఆ విధంగా యీ గ్రామంలో 70శాతానికి పైగా మధ్యతరగతి, చిన్నకారు, సన్నకారు రైతులే వున్నారు కాని ఇక్కడ ప్రధానంగా శ్రమశక్తిని అమ్ముకొని బ్రతికే కుటుంబాలు చాలా తక్కువగా 15శాతం వున్నాయి కాని సన్నకారు, ,చిన్నకారు, కౌలు రైతులలో గణనీయమైన భాగం కూలి పనులు చేస్తారు వీరిని కూడా కలుపుకుంటే గ్రామంలో వ్యవసాయ కూలీ కుటుంబాలు సగాని కంటె పైగానే వుంటాయి మొత్తం కుటంబాలను వ్యవసాయ, వ్యవసాయేతర కుటుంబాలుగా విభజిస్తే వ్యవసాయ కుటుంబాలు 244 అంటే మొత్తం కుటుంబాల్లో 82 15 శాతం వున్నాయి మిగిలిన 53 లేదా 18శాతం వ్యవసాయేతర కుటుంబాలు

**భూకేంద్రీకరణ**

గ్రామంలో భూమి వున్న కుటుంబాలు 240 వున్నాయి కేవలం 57 కుటుంబాలకు భూమి లేకపోవడం గమనార్హం భూమిలేని కుటుంబాల్లో బిసి కుటుంబాలు 31, ఓసిలు 5, ఎస్సి 15, ఎస్టి 2 వున్నాయి గ్రామంలో ఒక భూస్వామి కుటుంబానికి 30 ఎకరాలు వున్నట్లు వెల్లడైంది భూస్వాములు, ధనిక రైతులు రెండు కుటుంబాల వారే వున్నారు. వారి కుటుంబాలు 0 66శాతం, వారి వద్ద వున్న భూమి 5శాతం భూమి కేంద్రీకరణ యీ వర్గాల మధ్య వుండాలి కాని 90శాతం భూమి 70శాతం కుటుంబాలు గల మధ్యతరగతి, చిన్నకారు, సన్నకారు రైతుల మధ్యనే పంపకమై వుంది భూస్వాములు, ధనికరైతుల కుటుంబాలు రెండే కాబట్టి వారి వద్ద భూకేంద్రీకరణ యెక్కువగా లేదు దానికితోడు గ్రామంలో భూమిలేని కుటుంబాలు 19 2శాతం మాత్రమే అంటే యీ గ్రామంలో భూమి పంపకంలో వివిధ తరగతుల మధ్య పెద్ద అంతరాలు కన్పించటం లేదు. కాబట్టి సేకరించిన సమాచారం మేరకు యిక్కడ భూకేంద్రీకరణ పెద్దగాలేదనే చెప్పాలి భూమి వున్న కుటుంబాల్లో ఎగువ 5శాతం కుటుంబాలకు 19శాతం మాత్రమే భూమి వుంది దిగువ 60శాతం కుటుంబాలకు 25శాతం భూమి వున్నట్లుగా చూస్తాము ఈ విధంగా చూసినా భూకేంద్రీకరణ తక్కువగా వున్నట్లుగా వెల్లడవుతుంది

సామాజిక తరగతుల వారీగా భూకేంద్రీకరణను (స్వంతభూమి) పరిశీలిస్తే సాపేక్షంగా ఓసిల వద్దనే ఎక్కువ భూమి వున్నట్లుగా వున్నది ఎస్‌సి కుటుంబాలు 34 శాతం వున్నాయి వారికున్న భూమి కూడా 34 శాతమే బిసి కుటుంబాలు 54 శాతం వున్నాయి కానీ వారికున్నది 44 శాతం భూమి మాత్రమే కానీ ఓసి కుటుంబాలు 11 శాతం మాత్రమే వున్నా వారి వద్ద 21 శాతం భూమి పోగుపడి వున్నది

### కౌలుసేద్యం

ఈ గ్రామంలో కౌలుసేద్యం బాగా తక్కువగా వుంది మొత్తం 297 కుటుంబాల్లో 21 కుటుంబాలు కౌలుసేద్యం చేస్తున్నారు అంటే 7శాతం కౌలు కుటుంబాలు గ్రామంలోని మొత్తం భూమి 661 ఎకరాలు అందులో 45ఎకరాలు (7%) మాత్రమే కౌలుభూమిగా వున్నది కౌలు సాగుభూమిని 47% చిన్నకారు రైతులు, 29 శాతం మధ్యతరగతి రైతులు సేద్యం చేస్తున్నారు కులాల వారీగా చూస్తే కురుమ కులానికి చెందిన 6 కుటుంబాలు 22 ఎకరాలను, మాదిగ కులంలో 4 కుటుంబాలు 8 25 ఎకరాలు చేస్తున్నారు కౌలుకు 14 కుటుంబాలు ఇచ్చిన భూమి కేవలం 29 ఎకరాలు మాత్రమే ఈ భూమిలో అత్యధిక విస్తీర్ణం మెట్టభూమిగానే వున్నది సామాజిక పరంగా చూస్తే రెడ్డి కులస్థుల కుటుంబాలే ఎక్కువగా వున్నారు

### వసతులు-ఆర్థిక తరగతులు

స్కూటర్లు, మోటారుసైకిళ్లు కలిపి 34శాతం కుటుంబాలకు వున్నాయి కానీ ఇవి భూస్వాములు, ధనిక రైతులలో అందరికి వున్నాయి. పేద రైతాంగానికంటే వ్యాపారులు, వుద్యోగస్థులకు యెక్కువగా దాదాపు రెట్టింపు కుటుంబాలకు వున్నాయి ఈ వాహనాలు పూర్తిగా లేని తరగతులు వ్యవసాయేతర కార్మికులు, ఇతరులు, స్వయం ఉపాధి గలవారు

ఈ గ్రామంలో సెల్‌ఫోన్ 82శాతం కుటుంబాలకు వుంది భూమిలేని వ్యవసాయ కార్మికులకు మాత్రం 67శాతం కుటుంబాలకే యీ సౌకర్యం వుంది యితరులకు యిది మరింత తక్కువగా 20శాతం కుటుంబాలకు మాత్రమే వుంది

భూస్వాములు, ధనిక, మధ్యతరగతి రైతుల వరకు లెట్రిన్ సౌకర్యం అన్ని కుటుంబాలకు వుంది చిన్నకారు, సన్నకారు రైతులకు కూడా 90శాతం కుటుంబాలకు పైగానే ఈ సౌకర్యం వుంది ప్రైవేటు ఉద్యోగులు, వ్యవసాయేతర కార్మికులు, భూమిలేని

వ్యవసాయ కార్మికులు 67 శాతం చొప్పున ఈ సౌకర్యం కలిగి వున్నారు

**వసతులు - సామాజిక తరగతులు**

ఈ గ్రామంలో 95 శాతం కుటుంబాలకు స్వంత ఇళ్లు వున్నాయి పక్కా ఇళ్ళు 89 శాతం కుటుంబాలకు వున్నాయి ఇవి అందరికి దాదాపు సమానంగానే వున్నాయి. 32 శాతం కుటుంబాలకు సైకిళ్లు వున్నాయి. అందులో యస్ సి.లకే ఎక్కువగా 35 శాతం కుటుంబాలకు వున్నాయి

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 19% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 25% భూమి మాత్రమే వుంది. 19% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

ఈ గ్రామంలో గొర్రెలు మినహా పశుసంపద పెద్దగా లేదు గొర్రెలు మాత్రం 159 బి సి కుటుంబాలకు 237 వున్నాయి. స్కూటర్లు, మోటారుసైకిళ్లు కలిసి 34శాతం కుటుంబాలకు వున్నాయి అవి అందరికంటే ఒ సి లకు యెక్కువగా 55శాతం కుటుంబాలకు, యస్.సి లకు తక్కువగా 20శాతం కుటుంబాలకు వున్నాయి . గ్రామంలో ఆటోలు 5 వున్నాయి అవి బి సి, యస్ సి కుటుంబాలకు వున్నాయి టి వి లు మొత్తం మీద 72శాతం కుటుంబాలకు వున్నాయి అవి ఒ సి లలో అత్యధికంగా 90శాతం కుటుంబాలకు వున్నాయి బి సి, యస్ సి లకు 70శాతం చొప్పున వున్నాయి విద్యుత్ సరఫరా 93శాతం కుటుంబాలకు వున్నది ఈ సౌకర్యం దాదాపు అందరికి సమానంగానే వుంది సెల్‌ఫోనులు 82శాతం కుటుంబాలకు వున్నాయి అవి ఒ సి లకు 97 శాతం కుటుంబాలకు వున్నాయి కాని యస్ సి లకు 72శాతం కుటుంబాలకు మాత్రమే వున్నాయి. లెట్రిన్ సౌకర్యం 86శాతం కుటుంబాలకు వుండటం విశేషం. అవి ఒ సి లలో 97శాతం, మిగిలిన తరగతులన్నింటికి కూడా 80శాతంపైగానే వున్నాయి అట్లాగే వంటగ్యాస్ 71శాతం కుటుంబాలకు వుంది అది ఒ సి లకు అత్యధికంగా 88శాతం కుటుంబాలకు వుండగా యస్ సి లకు అత్యల్పంగా 53శాతం కుటుంబాలకు మాత్రమే వుంది కార్లు యస్ సి, బి సి, ఒ సి.లకు రెండేసి చొప్పున వున్నాయి

# కరీంనగర్ జిల్లా

## నాగంపేట

**ముఖచిత్రం**

సుందరయ్య విజ్ఞాన కేంద్రం 2013-14 లో నిర్వహించిన గ్రామీణ సామజిక ఆర్థిక సర్వేలో భాగంగా కరీంనగర్ జిల్లా నాగంపేట గ్రామాన్ని 2013 డిసెంబరులో తొలి విడత, 2014 ఫిబ్రవరిలో మలి విడత సర్వే చేయటం జరిగింది. గ్రామాన్ని సెన్సెస్ మరియు శాంపిల్ సర్వే చేశాం సెన్సస్ సర్వేలో వెల్లడైన అంశాలను మీ ముందుంచుతున్నాం

ఉత్తర తెలంగాణ ప్రాంతంలోని కరీంనగర్ జిల్లా గంభీరవపేట మండలంలో నాగంపేట గ్రామం వున్నది మండల కేంద్రం 28 కిలోమీటర్ల దూరంలో వున్నది సిరిసిల్ల పట్టణం 28 కిలోమీటర్ల దూరంలో వుంటుంది గ్రామానికి ప్రధాన రవాణా ఆటోల ద్వారా జరుగుతున్నది. గ్రామంలో కుల పట్టింపులు ఎక్కువగా వున్నాయని గ్రామస్తులు చెప్పారు దళితుల పట్ల వివక్ష వున్నది కొన్ని ఫంక్షన్‌లకు వారిని దూరంగా వుంచుతారని చెప్పారు గ్రామంలో బీడీలు చేసే కుటుంబాలు పలు ఇబ్బందులు పడుతున్నట్లు సర్వేలో వెల్లడైంది ఘాటు వాసన భరించలేకపోవడం, దగ్గు, నడుం నొప్పి, ఇతర అనారోగ్య సమస్యలు ఎదురౌతున్నట్లు తెలియజేశారు కుటుంబ పోషణ కోసం అప్పులు చేసి విదేశాలకు వెళ్తున్న కుటుంబాలు వున్నవి గ్రామంలో పోస్టాఫీసు, విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్, రక్షిత మంచినీటి పధకం, ప్రాథమిక పారశాల, పంచాయితీ భవనం, చౌకధరల దుకాణం, అంగన్వాడీ కేంద్రం వున్నాయి గ్రామంలో కుటుంబాలు ఒక మోస్తరుగా వున్నా, ప్రాథమికోన్నత పారశాల, ఆరోగ్య కేంద్రం లేవు ప్రధాన పంటలుగా వరి, పత్తి, మొక్కజొన్న, కందులు, పెసలు, చెరకు పండిస్తారు

**జనాభా వివరాలు**

గ్రామంలో మొత్తం కుటుంబాలు 463 వున్నాయి మొత్తం జనాభా 1821 ఇందులో పురుషులు 922 స్త్రీలు 899 స్త్రీ పురుష నిష్పత్తి 975. అంటే ప్రతి వెయ్యి మంది పురుషులకు 975 మంది స్త్రీలు వున్నారు 2011 ప్రభుత్వ జనాభా లెక్కల ప్రకారం తెలంగాణ రాష్ట్రసగటు స్త్రీ పురుష నిష్పత్తి 988 అంటే రాష్ట్ర సగటు కంటే స్త్రీల సంఖ్య తక్కువగా వున్నది ఎస్‌టి, ఎస్‌సిలలో స్త్రీల సంఖ్య తక్కువగా వున్నది కరీంనగర్ జిల్లా లైంగిక నిష్పత్తి 1015. జిల్లా నిష్పత్తి కంటే గ్రామ నిష్పత్తి బాగా తక్కువగా వున్నది జనాభాలో ఎస్‌సి 317 (17%), ఎస్‌టి 137 (7%), బిసిలు 1028 (56%), ఓసిలు 339(19%) వున్నారు మొత్తం జనాభాలో బిసి తరగతే సగానికిపైగా వున్నారు. ఆ తర్వాత ఓసిలు వున్నారు

**సామాజిక పొందిక**

మతాల వారీగా చూస్తే హిందువుల కుటుంబాలు 459 (99 14%), మూడు ముస్లిం కుటుంబాలు (0 65%), ఒకక్రిస్టియన్ కుటుంబం(0 22%) ఇతరులు ఒకరు (0 36%) వున్నారు

ఈ గ్రామంలో వున్న 463 కుటుంబాల్లో సామాజిక తరగతుల వారీ చూస్తే ఎస్‌సి కుటుంబాలు 83 (18%), ఎస్‌టి కుటుంబాలు 34 (7%), బిసి కుటుంబాలు 257 (56%) వుంటే ఓసి కుటుంబాలు 89 (19%) వున్నాయి. కులాల వారీగా కుటుంబాలను చూస్తే గంగపుత్ర 31 కుటుంబాలు (7%), గౌడ్ 28 (18%), కాపు మూడు, కుమ్మరి 22 (5%), కురుమ నాలుగు, మాదిగ 57 (12%), మాల 15 (3%), ముదిరాజ్ 37 (8%), మున్నూరు కాపు ఒకరు, నాయీబ్రాహ్మణ 23 (5%), ఒడ్డె 22 (5%), పద్మశాలి 22 (5%), రజక తొమ్మిది, రెడ్డి 82 (18%), సుగాలి 32 (7%), విశ్వబ్రాహ్మణ ఎనిమిది, వైశ్య ఐదు, యాదవ 42 (9%), ఎరుకుల రెండు, ఇతరులు 18 కుటుంబాలు వున్నాయి

**జీవనోపాధి**

గ్రామంలో వున్న మొత్తం కుటుంబాల్లో 239 కుటుంబాలు వ్యవసాయం చేస్తున్నాయి. వ్యవసాయ కూలీపై ఆధారపడుతున్న కుటుంబాలు 80 వరకు వున్నాయి

అంటే వ్యవసాయరంగంపై ఆధారపడుతున్న కుటుంబాల శాతం 69శాతం వున్నది వృత్తినే ప్రధాన ఆదాయ వనరుగా వున్న కుటుంబాలు 10 వరకు వున్నాయి బీడీ పనిలో నాలుగు కుటుంబాలు వున్నాయి. బిల్డింగ్ నిర్మాణ పనుల్లో 10 కుటుంబాలు వుంటే, అందులో 9 కుటుంబాలు మాదిగ కులానికి చెందినవి కల్లుగీత కుటుంబాలు 5వున్నాయి అందరూ గౌడ కులం వారే ఉద్యోగ కుటుంబాలు నామామాత్రంగా రెండు వున్నాయి మాదిగ కుటుంబానికి చెందిన ఒక కుటుంబం టైలర్‌గాను, పద్మశాలికి చెందిన కుటుంబం ఆర్ఎంపిగా ను వున్నారు గౌడ్ కుటుంబం హెూటల్ నడిపిస్తున్నది మహిళల యాజమాన్యంలో దాదాపు 68 కుటుంబాలు (15%) వున్నాయి

అక్షరాస్యత

గ్రామంలో 55శాతం చదువుకున్నవారు వున్నారు ప్రభుత్వ సమాచారం ప్రకారం రాష్ట్ర సగటు 66 54శాతం జిల్లాలో 64 15 శాతం ప్రభుత్వ లెక్కలతో పోలిస్తే దాదాపు 10శాతం చదువుకున్న వారి సంఖ్య తక్కువగా వున్నది కానీ ఓసిలలో 62శాతం వున్నది ఎస్‌సిలలో అక్షరాస్యత 59శాతం, ఎస్‌టిలలో 51శాతం అక్షరాస్యత వున్నట్లు ప్రభుత్వ లెక్కలు చెపుతున్నాయి అయితే గ్రామంలో ఎస్‌టిలలో 37శాతం, ఎస్‌సిలలో 54శాతం చదువుకున్న వారు వున్నారు అంటే ఎస్‌టిలలో 63శాతం కుటుంబాలు ఇంకా చదువుకు దూరంగా వున్నాయని అర్థమౌతున్నది గ్రామంలో స్త్రీ, పురుష అక్షరాస్యత శాతాలు63%, 46% వున్నాయి రాష్ట్రసగటుతో పోలిస్తే తక్కువగా వున్నాయి స్త్రీలలో చదువుకున్న వారి సంఖ్య ఎస్‌టిలలో బాగా తక్కువగా (25%) వున్నది బిసి, ఎస్‌సిలలో 45% వరకు వున్నది.

ఏయే విద్యాస్థాయి వరకు చదువుకున్నారో పరిశీలించాం చదువులేని వాళ్లు 45శాతం మంది వున్నారు ప్రాథమిక విద్యను అభ్యసించిన వారు 14శాతం మంది వున్నారు సెకండరీ స్థాయి వరకు చదువుకున్న వారు 27 శాతం మంది వున్నారు ఈ స్థాయిలో బిసిలు 30 శాతం వున్నారు ఇక ఇంటర్ వరకు చదువుకున్న వారు 8 శాతం వుంటే, అందులో ఓసి తరగతి వారు ఎక్కువగా (11%) వున్నారు డిగ్రీ స్థాయి వరకు చూస్తే 87 మంది వుంటే అందులో బిసిలు 46 మంది వున్నారు పిజి చేసిన వారు 12 మంది వున్నారు వారిలో ఓసి వారే సగం మంది వున్నారు అంటే పై స్థాయి చదువుల్లో ఓసి తరగతి ముందంజలో వున్నదని అర్థమౌతున్నది. పిహెచ్‌డి చేసిన వారు గ్రామంలో లేరు

**ఆయుఃప్రమాణం**

గ్రామ జనాభాలో యువత (16 సం నుండి 40వరకు) దాదాపు 924 మంది వున్నారు అంటే దాదాపు 51%మంది వున్నారు శ్రమ చేయగల్గిన వారు అంటే 16 నుండి 60 సంవత్సరాల వరకు చూస్తే 70% మంది వున్నట్లు సర్వేలో వెల్లడైంది ఎక్కువ కాలం జీవిస్తున్న వారి సంఖ్య కూడా తీసాం 61 నుండి 70 సంవత్సరాల మధ్య వున్న వారి శాతం చూస్తే ఓసిలలో 6శాతం మంది వుంటే, ఎస్టిలలో కేవలం 2శాతం మంది వున్నారు 70 సంవత్సరాల పైబడి జీవిస్తున్న వారు 33 మంది వుంటే అందులో గ్రామంలోనే సంఖ్యరీత్యా ఎక్కువగా వున్న బిసిలే 20 మంది వున్నారు

**పశుసంపద**

సర్వే సమయానికి ఎద్దులు చాల నామమాత్రంగా 9 కుటుంబాలకే వున్నాయి. గేదెలు, ఆవులు మొత్తం 101 కుటుంబాలకు 372 వున్నాం అందులో బిసి, ఓసి తరగతులకు 88% వున్నాయి అంటే పశుసంపద నిమ్నకులాలకు దాదాపు శూన్యం. గొర్రెలు 10 కుటుంబాలకు 190 వున్నాయి ఇందులో అత్యధిక భాగం బిసిల వద్దనే వున్నాయి ఒక ఎస్టి కుటుంబం గొర్రెలను కల్గివున్నది

**సాగుభూమి**

సర్వే వివరాలు ప్రకారం మొత్తం నికర సాగుభూమి655 ఎకరాలు వున్నది. సాగునీటి వసతి కల్గిన భూమి 329 ఎకరాలు. మెట్ట భూమి 278 ఎకరాలు వుంది ఇందులో పడావుగా వున్న భూమి 32 38 ఎకరాలు. కౌలు క్రింద సాగునీటి వసతి గల భూమి 80 ఎకరాలు, మెట్ట భూమి 31.5 ఎకరాలు, మొత్తం 111.80 ఎకరాలు సేద్యం అవుతున్నది కౌలుకు ఇచ్చిన భూమి పరిశీలిస్తే సాగునీటి వసతి వున్నది 32 ఎకరాలు, మెట్ట 32.5 ఎకరాలు మొత్తం 64.6 ఎకరాలుగా వున్నది అంటే కౌలుకు ఇచ్చిన కుటుంబాలన్నీ పూర్తి వివరాలు చెప్పలేదని అర్థమౌతున్నది. ఇరుగుపొరుగు గ్రామాల పరిధిలో వున్న భూమిని కౌలుకు చేస్తున్నట్లయితే సాగు విస్తీర్ణంలో తేడా కన్పించే అవకాశం వున్నది కౌలు చేస్తున్న వారిలో మధ్యతరగతి, చిన్నకారు రైతులే ఎక్కువ విస్తీర్ణం కౌలుకు చేస్తున్నారు. కౌలుకు ఇచ్చేవారిలో ఎక్కువ కుటుంబాలు వ్యవసాయ కార్మిక, వృత్తిదార్ల కుటుంబాలు వున్నాయి

### కౌలు

గ్రామంలో కౌలు తక్కువగానే వున్నది మొత్తం 463 కుటుంబాల్లో 47 కుటుంబాలు మాత్రమే కౌలుసేద్యం చేస్తున్నాయి అంటే 10శాతం కుటుంబాలు వ్యవసాయం చేస్తున్న కుటుంబాలతో పోలిస్తే 20 శాతం వున్నది ఈ కుటుంబాలు సాగుచేస్తున్న విస్తీర్ణం 111 75 ఎకరాలు సాగుభూమి విస్తీర్ణంతో పోలిస్తే కౌలుభూమి విస్తీర్ణం 17% వున్నది కౌలురైతుల్లో ఆర్థిక తరగతుల వారీగా చూస్తే ధనిక రైతు కుటుంబాలు నాలుగు వున్నాయి వీరు 25 ఎకరాలు సాగు చేస్తున్నారు మధ్యతరగత రైతు కుటుంబాలు 20 వున్నాయి 49 5 ఎకరాలు సాగుచేస్తున్నారు చిన్నకారు రైతు కుటుంబాలు 22 వుంటే, వీరు సాగు చేస్తున్న భూమి 36.25 ఎకరాలు వున్నది ఒక్క సన్నకారు రైతుకుటుంబం ఒక ఎకరా సాగుచేస్తోంది. వ్యవసాయ కార్మిక కుటుంబాలు కౌలుసాగు చేయడం లేదు ఇపుడిపుడే రివర్స్ కౌలు పద్ధతి జొరబడుతున్నదని చెప్పవచ్చు

సామాజిక కోణంలో చూస్తే ధనిక రైతుల్లో ఓసిలు ముగ్గురు, ఎస్‌టి ఒకరు, మధ్యతరగతి రైతుల్లో ఓసిలు 9, బిసిలు 6, ఎస్‌టిలు 3, ఎస్‌సిలు ఇద్దరు వున్నారు చిన్నకారు రైతుల్లో ఓసిలు ముగ్గురు, బిసిలు 13, ఎస్‌టిలు 4, ఎస్‌సిలు ఇద్దరు వుంటే, సన్నకారు రైతుల్లో ఒకరు ఎస్‌సిలకు చెందినవారు వున్నారు ఏయే కులంలోని వారు ఎంతెంత సాగు విస్తీర్ణంలో కౌలు చేస్తున్నారో చూస్తే కౌలురైతుల్లో ఎక్కువ మంది రెడ్డి కులానికి చెందిన వారు వున్నారు. 14 మంది 42 5 ఎకరాలు చేస్తున్నారు తర్వాత సుగాలీలు 8 కుటుంబాలు 24 5 ఎకరాలు చేస్తున్నారు యాదవ, గంగపుత్ర కుటుంబాలు ఆరేసి కుటుంబాలు చొప్పున వున్నారు వీరు 10 ఎకరాల లోపు సాగుచేస్తున్నారు

### వర్గపొందిక ఎలా వుంది?

గ్రామంలో భూస్వాములు లేరని మా సర్వేలో వెల్లడైంది అబ్సెంటీ భూస్వాములు కూడా లేరు చిన్న, సన్నకారు రైతుల సంఖ్య ఎక్కువగా వున్నది ధనిక రైతులు ఐదు కుటుంబాలు (1%) వున్నారు మధ్యతరగతి రైతు 52కుటుంబాలు (11%), చిన్నకారు రైతు కుటుంబాలు 101 (22%), సన్నకారు రైతులు 81 కుటుంబాలు (17%) వున్నారు. భూమి కల్గివున్న వ్యవసాయ కార్మిక కుటుంబాలు 9 (2%), భూమిలేని వ్యవసాయ కార్మిక కుటుంబాలు 71 (15%), వృత్తిదార్ల కుటుంబాలు 31 (7%), వ్యవసాయేతర కార్మిక కుటుంబాలు 64 (14%), స్వయం ఉపాది కుటుంబాలు 4 (1%), వ్యాపారంలో

ఏడు కుటుంబాలు(1 5%), అలాగే ప్రభుత్వ, ప్రైవేటు ఉద్యోగులు 12 కుటుంబాలు (2%) ఇతరులు 26 కుటుంబాలు 26 (5%) వున్నట్లు సర్వేలో వెల్లడైంది

వివిధ ఆర్థిక తరగతుల మధ్య భూకేంద్రీకరణను పరిశీలించాం. వర్గాలను నిర్ణయించేటపుడు ఆయా కుటుంబాల చేతుల్లో వున్న నికర సాగుభూమి విస్తీర్ణాన్ని ప్రాతిపదికగా తీసుకున్నాం. 5శాతంగా వున్న ధనిక రైతుల చేతుల్లో 7% భూమి వున్నది 11శాతంగా వున్న మధ్యతరగతి రైతుల చేతుల్లో 39% భూమి వుంది 22 శాతంగా వున్న సన్నకారు రైతుల చేతుల్లో 39శాతం భూమి వుంది చిన్నకారు రైతులు 17శాతం వుంటే వీరి చేతుల్లో వున్న భూమి 13% వున్నది

ధనికరైతులు 5 కుటుంబాల్లో నలుగురు రెడ్డి కులానికి చెందినవారు కాగా ఒకరు సుగాలీ కుటుంబం మధ్యతరగతి రైతుకుటుంబాల్లో సగం కుటుంబాలు రెడ్డి కులానికి చెందినవే

**భూకేంద్రీకరణ**

స్వంత భూమిని ప్రాతిపదికగా తీసుకొని భూమి వున్న కుటుంబాలు, భూమి లేని కుటుంబాలను పరిశీలించాం. గ్రామంలో మొత్తం స్వంత భూమి 607 ఎకరాలు వున్నట్లు సర్వేలో వచ్చింది భూమి వున్న కుటుంబాలు 267 (57%) వుంటే, భూమి లేని కుటుంబాలు 196 వున్నాయి భూమి వున్న పైస్థాయి 5 శాతం కుటుంబాల చేతిలో 21శాతం భూమి వుంటే, క్రిందిస్థాయిలో వున్న 60% కుటుంబాల చేతిలో కేవలం 12% భూమి మాత్రమే వున్నది అంటే కొద్దిగా భూకేంద్రీకరణ వున్నట్లు అర్థమౌతున్నది. ఆర్థిక తరగతుల వారీగా చూస్తే ధనిక రైతుల చేతుల్లో సగటు కమతం భూమి విస్తీర్ణం 4 7 ఎకరాలుగా వుంటే, సన్నకారు రైతువర్గం చేతిలో వున్న సటగు భూవిస్తీర్ణం ఒక ఎకరా వున్నది అదే వ్యవసాయకార్మికుల చేతుల్లో సగటు 0 35సెంట్లు వున్నది అంటే ధనిక రైతుల చేతుల్లో వున్న భూమితో పోలిస్తే 10రెట్లు పైగా వున్నది

సామాజిక తరగతుల వారీగా చూస్తే ఏయే సామాజిక తరగతులకు ఎంతెంత భూమి వున్నదో చూశాం. ఓసిలు 89 కుటుంబాలు వుంటే వారి చేతుల్లో 240 ఎకరాలు వున్నది ఓసి కుటుంబాలకు సగటు 2 69 ఎకరాలు. 257 బిసి కుటుంబాలు వుంటే వారికి వున్న స్వంత భూమి 280 ఎకరాలు వుంది అంటే బిసిలకు సగటు విస్తీర్ణం 1 08 ఎకరాలు వచ్చింది ఇక ఎస్‌టిలు 34 కుటుంబాలు వుంటే 40.16 ఎకరాలు వున్నట్లు సర్వేలో వెల్లడైంది. గ్రామంలో మొత్తం సాగుభూమి 655 ఎకరాలు సగటు

కుటుంబ కమతం విస్తీర్ణం ఎంత వుంటుందో పరిశీలిస్తే 1 41 ఎకరాలు వుండాలి

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 21% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 12% భూమి మాత్రమే వుంది. 42% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

గృహాలు - మౌలిక సదుపాయాలు

ఊర్లో 88% కుటుంబాలకు స్వంత ఇళ్లు వున్నాయి 12%నికి ఇంకా స్వంత ఇళ్లు లేవు. బిసి సామాజిక తరగతిలో 84% కుటుంబాలకు స్వంత ఇళ్లు వున్నాయి పక్కాఇళ్లల్లో 78%కుటుంబాలు వుంటే, కచ్చా ఇళ్లల్లో 12% వున్నారు ఇక అద్దె ఇళ్లల్లో 48 కుటుంబాలు వున్నాయి ఇందులో 75% బిసి సామాజిక తరగతుల వాళ్లే వున్నారు

గ్రామంలో ట్రాక్టర్లు 8 వున్నాయి ఇందులో ఓసి 5, బిసి 3 కల్గివున్నారు రైస్‌మిల్లులు లేవు సైకిల్స్ 190 (41%) కుటుంబాల వారు కల్గివున్నారు బిసిలకే ఎక్కువగా వున్నాయి స్కూటర్స్ 15 వుంటే అత్యధిక భాగం ఓసి, బిసి తరగతులకు వున్నాయి కార్లు, ఆటోలు వున్నట్లు రికార్డు కాలేదు టివిలు గ్రామంలో 69శాతం కుటుంబాలకు వున్నాయి ఓసి సామాజిక తరగతిలో 83శాతం కుటుంబాల వారు కల్గి వున్నారు గ్రామంలో అన్ని సామాజిక తరగతులు 97 శాతం గృహాలకు విద్యుత్ సౌకర్యం పొందివున్నారు మరుగుదొడ్డి సౌకర్యం కేవలం 59% కుటుంబాలకే వున్నది ఓసిలకు 79శాతం కుటుంబాలకు వుంటే, ఎస్‌సిలకు కేవలం 40% కుటుంబాలకే వున్నది సెల్‌ఫోన్ లు దాదాపు అన్ని సామాజిక తరగతుల్లో 90% కుటుంబాల వారు కలిగివున్నారు వంటగ్యాస్ సౌకర్యం గ్రామంలో 57 శాతం కుటుంబాలకు వున్నది ఓసి తరగతిలో 85% కుటుంబాలకు వుంటే, ఎస్‌సి, ఎస్‌టి తరగతిలో 30శాతం కుటుంబాలకే ఈ సౌకర్యం వున్నది

# నల్లగొండ జిల్లా

# వెంకేపల్లి

### గ్రామ ముఖచిత్రం

సుందరయ్య విజ్ఞాన కేంద్రము ఆధ్వర్యములో 2013-14లో నిర్వహించిన గ్రామీణ ఆర్థిక సర్వేలో భాగంగా నలగొండ జిల్లాలోని వెంకేపల్లి గ్రామాన్ని 2013 డిశంబరులో తొలి విడత, 2014 ఫిబ్రవరిలో మలి విడత సర్వే చేయటం జరిగింది గ్రామాన్ని సెన్సస్ మరియు శాంపిల్ సర్వే చేశాం. దక్షణ తెలంగాణ ప్రాంతములోని నలగొండ జిల్లా, నూతనకల్ మండల కేంద్రానికి 15కిలోమీటర్ల దూరంలో వెంకేపల్లి గ్రామము ఉన్నది సూర్యాపేట్ పట్టణము ఈ గ్రామానికి 35 కిలోమీటర్ల దూరంలో ఉన్నది గ్రామములో హైస్కూలు, అంగన్‌వాడీ కేంద్రము, పంచాయితీ భవనము, చౌక ధరల దుఖాణము, విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్, గ్రామీణ రక్షిత మంచినీటి సదుపాయం ఉన్నది. కాలువ ద్వారా కొంత భూమి సాగు చేయబడుచున్నది బోర్‌వెల్స్ ద్వారా ఎక్కువ వ్యవసాయ భూమి సాగు చేయబడుతున్నది కందులు, పత్తి, పెసర, వరి, వేరుశనగ మామిడి ముఖ్యమైన పంటలుగా ఉన్నాయి

### జనాభా నిష్పత్తులు

గ్రామములో 387 కుటుంబాల్లో 1363 జనాభా ఉన్నది పురుషుల జనాభా 698(51%), స్త్రీల జనాభా 665 (49%)గా ఉన్నది. ప్రతి వెయ్యిమంది పురుషులకు 953 మంది స్త్రీలున్నారు అగ్రకులాలలో ఈ లైంగిక నిష్పత్తి కేవలం 792 మాత్రమే ఉన్నది 2011 జనాభా లెక్కలతో పోల్చినపుడు దళితుల్లో లైంగిక నిష్పత్తి (1020) అధికంగా ఉన్నది వెనుకబడిన తరగతుల్లో (954) తక్కువగా ఉన్నది సామాజిక తరగతుల

వారీ చూస్తే 170(44%) దళిత కుటుంబాలు, ఒక యస్ టి కుటుంబము, 130(34%) వెనుకబడిన తరగతులకు చెందిన కుటుంబాలు, 85(22%) ఓసిలకు చెందిన కుటుంబాలు ఉన్నాయి దళితుల జనాభా 614, యస్ టి జనాభా2, వెనుకబడిన తరగతుల జనాభా 467, అగ్రకులాల జనాభా 276గా ఉన్నది 99% కుటుంబాలు హిందువులు కాగా, మూడు కుటుంబాలు క్రిష్టియన్ మతానికి చెందినవిగా ఉన్నాయి 1 నుండి 4సం॥ల మధ్య వయసు గల మగపిల్లలు 31(4%), ఆడపిల్లలు 32 (5%) ఉన్నారు 5 నుండి 14 సం॥ల మధ్య వయసుగల మగపిల్లలు 100(14%), ఆడపిల్లలు 87(13%) ఉన్నారు 15 నుండి 59సం॥ల మధ్య వయసు గల జనాభా పురుషులు (65%), స్త్రీలు (68%) ఉన్నారు ఎక్కువ కాలం (60సం॥ల వయసుపై బడినా) జీవించే జనాభా పురుషులలో 16% ఉండగా, స్త్రీలలో 14% మాత్రమే ఉన్నారు.

### సామాజిక పొందిక - జీవనోపాధి

గ్రామములో మాదిగ, రెడ్డి, రజక, గౌడు, మాల, యాదవ, కుమ్మరి, పద్మశాలి, విశ్వబ్రాహ్మణ, ముదిరాజ్, మున్నూర్‌కాపు, వైశ్య, నాయిబ్రాహ్మణ, ఎరుకల కులాలు ముఖ్యమైనవిగా ఉన్నాయి 146(38%)కుటుంబాలు మాదిగ కులానికి చెందినవి కాగా, 73కుటుంబాలు(50%)రైతులుగా, 36కుటుంబాలు(25%)వ్యవసాయ కార్మికులుగా, 37కుటుంబాలు సన్నకారు రైతులుగా ఉన్నారు భూమి రీత్యా మధ్యతరగతిగా ఉన్న ఒకరైతు పాలేరుగా పని చేస్తున్నాడు

రెడ్డి కులానికి చెందిన 65 కుటుంబాలు రైతులుగా, 6 కుటుంబాలు వ్యవసాయ కార్మికులుగా, 7 కుటుంబాలు వ్యవసాయేతర వృత్తుల ద్వారా ఉపాధి పొందుతున్నాయి వ్యవసాయముతో 71(91%)కుటుంబాలు సంబంధాన్ని కలిగి వున్నాయి మొత్తం 78 కుటుంబాలు ఈ కులానికి చెందినవిగా ఉన్నాయి రజక కులానికి చెందిన 28(7%) కుటుంబాలలో 9కుటుంబాలు రైతులుగా, 6కుటుంబాలు వ్యవసాయ కార్మికులుగా, 13 కుటుంబాలు వ్యవసాయేతర వృత్తుల ద్వారా ఉపాధి పొందుతున్నాయి మొత్తము 15కుటుంబాలు వ్యవసాయంతో సంబంధాన్ని కలిగి వున్నాయి గౌడు కులానికి చెందిన 13కుటుంబాలు రైతులుగా, 6కుటుంబాలు వ్యవసాయకార్మికులుగా, 5కుటుంబాలు వ్యవసాయేతర వృత్తుల్లో ఉపాధి పొందుతున్నాయి. 19కుటుంబాలు వ్యవసాయంతో సంబంధాన్ని కలిగి వున్నాయి మొత్తం కుటుంబాల్లో 24కుటుంబాలు మాత్రమే ఈ కులానికి చెందినవిగా ఉన్నాయి మాల కులానికి చెందిన 5కుటుంబాలు వ్యవసాయేతర

వృత్తుల ద్వారా ఉపాధి పొందుతున్నాయి 13 కుటుంబాలు వ్యవసాయంపై ఆధారపడి జీవిస్తున్నాయి. ఈ కులానికి చెందిన కుటుంబాలు గ్రామములో24 ఉన్నాయి యాదవ కులానికి చెందిన కుటుంబాలు 22 ఉన్నాయి 17కుటుంబాలు రైతులుగా, ఒక కుటుంబము వ్యవసాయ కార్మికునిగా, రెండు కుటుంబాలు వ్యవసాయేతర వృత్తుల ద్వారా ఉపాధి పొందుతున్నాయి. గ్రామములో మొత్తం 16 కుటుంబాలు వ్యవసాయంతో సంబంధాన్ని కలిగి వున్నాయి పద్మశాలి కులంలో 3 కుటుంబాలు రైతులుగా, 4 కుటుంబాలు వ్యవసాయ కార్మికులుగా, 6 కుటుంబాలు వ్యవసాయేతర వృత్తులపై ఆధారపడి జీవిస్తున్నాయి 5 కుటుంబాలు విశ్వబ్రాహ్మణ, 4 కుటుంబాలు ముదిరాజ్, మరో 4 కుటుంబాలు మున్నూరు కాపు, వైశ్య కుటుంబాలు 4, నాయి బ్రాహ్మణ కుటుంబాలు2, ఒక ఎరుకలి కుటుంబం గ్రామములో వున్నాయి మహిళలు యజమానులుగా వున్న కుటుంబాలు 53 (14%) వున్నాయి

## అక్షరాస్యత

గ్రామములో 61% అక్షరాస్యత ఉన్నది గ్రామములో పురుషుల అక్షరాస్యత 71%, స్త్రీల అక్షరాస్యత కేవలం 50% మాత్రమే ఉన్నది. దళితుల్లో 54%, వెనుకబడిన తరగతుల్లో 61%, అగ్రకులాలకు చెందిన కులాల్లో అక్షరాస్యత 74%గా ఉన్నది 2011సం॥ము జనాభా లెక్కల అక్షరాస్యత శాతముతో మెరుగ్గా ఉన్నది ఇతర సామాజిక తరగతులతో పోల్చినపుడు అగ్రకులాల అక్షరాస్యత శాతం అధికంగా ఉన్నది దళితులలో పురుషుల అక్షరాస్యత 62% గా ఉన్నది వెనుకబడిన తరగతుల పురుషుల అక్షరాస్యత 73%, అగ్రకులాల పురుషుల అక్షరాస్యత 86%గా ఉన్నది దళితుల్లో స్త్రీల అక్షరాస్యత 47%, వెనుకబడిన తరగతుల్లో 50%, అగ్రకులాలలో 60% అక్షరాస్యతలున్నాయి. స్త్రీ,పురుషుల అక్షరాస్యతలో అంతరము అగ్రకులాలలో ఎక్కువగా ఉన్నది. 2011 సెన్సెస్ లెక్కలతో పోల్చినపుడు స్త్రీ, పురుషుల అక్షరాస్యతలు తక్కువగా ఉన్నాయి గ్రామములో ప్రాధమిక విద్యాస్థాయి వరకు చదువుకున్న జనాభా 15% ఉన్నారు 13% జనాభా డిగ్రీ వరకు చదువుకున్నారు 11మంది మాత్రమే బి ఎడ్ చదువుకున్నారు 20మంది పీజీ వరకు చదువుకున్నారు. పిహెచ్‌డి ఎవరూ లేరు.

## సాగుభూమి

గ్రామములో సాగునీటి వసతి గల భూమి 401.51 ఎకరాలు ఉన్నది. వర్షాధారభూమి 420.37 ఎకరాలు, ఇందులో బీడుభూమి 110.6 ఎకరాలు వున్నట్లుగా

సర్వేలో వెల్లడైంది ఇందులో సాగునీటి వసతి గలిగిన కౌలుభూమి 54 75 ఎకరాలు కాగా, వర్షంపై ఆధారపడిన కౌలుభూమి 85 ఎకరాలుగా నమోదైంది మొత్తం కౌలుభూమి 139 75 ఎకరాలుగ ఉన్నది మొత్తం 67 68 ఎకరాలు కౌలుకిచ్చిన భూమిగా నమోదైంది ఇందులో 23 ఎకరాలు సాగునీటి వసతి గలిగిన భూమి, 44 68 ఎకరాలు వర్షాధారభూమి, కౌలుభూమి పరిమాణం కౌలుకిచ్చిన భూమి పరిమాణం కంటే ఎక్కువగా ఉన్నది ఆమేరకు ఎక్కువ వున్న భూమి వివరాలు కౌలుకిచ్చిన రైతులు చెప్పి ఉండకపోవచ్చును లేదా పక్క గ్రామాలకు చెందిన భూమిగానైనా ఉండవచ్చును

భూ కేంద్రీకరణ

భూయాజమాన్యములో అంతరాలు గ్రామములో ఈ క్రింది విధంగా ఉన్నాయి 252(65%) కుటుంబాలకు స్వంత భూమి ఉన్నది 135 కుటుంబాలకు (35%) భూమిలేదు 100(59%) దళిత కుటుంబాలకు స్వంతభూమి ఉన్నది వెనుకబడిన తరగతులలో 81 కుటుంబాల(62%)కు స్వంత భూమి ఉన్నది అగ్రకులాలలో 70 కుటుంబాల (82%)కు స్వంత భూమి ఉన్నది మొత్తం భూమిలో దళితులు 19% భూమిని కలిగి వున్నారు అగ్ర కులాలు 50%, వెనుకబడిన తరగతులు 31% స్వంత భూమిని కలిగి ఉన్నాయి యస్ టి కుటుంబానికి భూమిలేదు ఎక్కువ భూమి వున్న మొదటి 5% కుటుంబాలకు మొత్తం భూమిలో 29% కల్గి వుంటే, క్రింది నుండి 60శాతం కుటుంబాలు కేవలం 11% భూమిని మాత్రమే కల్గివున్నారు.

గ్రామములో 22% ఉన్న అగ్రకులాలు 50% భూమిని కలిగి ఉన్నాయి 44% ఉన్న దళితులు 19% భూమిని మాత్రమే కలిగి ఉన్నారు. సామాజిక తరగతుల వారీగా తలసరి కుటుంబానికి ఉన్న భూమి విస్తీర్ణములో కూడా అంతరాలు ఎక్కువగా ఉన్నాయి దళితుల్లో ఒక కుటుంబానికి (సగటు) ఉన్న భూమి 1 03 ఎకరాలు వెనుకబడిన తరగతుల్లో ఒక కుటుంబానికున్న భూమి 2 25 ఎకరాలు, ఒక అగ్రకుల కుటుంబానికి 5 45 ఎకరాలు ఉన్నది ఒక దళిత కుటుంబానికున్న భూపరిమాణముతో 5రెట్లు అధికంగా ఒక అగ్రకుల కుటుంబానికి ఉన్నది అదే వెనుకబడిన తరగతులతో దాదాపు 2 50 రెట్లు అధికంగా ఉన్నది 22% ఉన్న అగ్రకులాలలో 82% కుటుంబాలకు స్వంత భూమి ఉంటే, 44% ఉన్న దళితులలో కేవలం 59% కుటుంబాలకు మాత్రమే స్వంత భూమి ఉండటం గమనార్హం

## ఆర్థిక తరగతులు - భూయాజమాన్యము

గ్రామములో రెండు భూస్వామ్య కుటుంబాలున్నాయి. ధనిక రైతులు 15(4%) కుటుంబాలు, మధ్యతరగతి రైతులు 41(11%), చిన్నరైతులు 69(18%) కుటుంబాలు, సన్నకారు రైతులు 84(22%), భూమి ఉన్న వ్యవసాయ కార్మికులు 22(6%), భూమిలేని వ్యవసాయ కార్మికులు 52(13%) ఉన్నారు సాంప్రదాయ వృత్తులపై ఆధారపడిన కుటుంబాలు 4, స్వయం ఉపాధి కుటుంబాలు 4, ప్రయివేటు ఉద్యోగము చేస్తున్న కుటుంబాలు 19(5%), రెండు కుటుంబాలు ప్రభుత్వ ఉద్యోగులుగా, మరో నాలుగు కుటుంబాలు వ్యాపారం నిర్వహిస్తున్నాయి వ్యవసాయేతర కార్మికులు 28(7.24%) ఉన్నారు.

అయా వర్గాలకున్న నికర సాగుభూమి మొత్తము విస్తీర్ణాన్ని ప్రాతిపదికగా తీసుకుని ఆ వర్గానికి సగటు సాగుభూమిని లెక్కించాం ఈ ప్రకారం భూస్వాముల్లో ఒక కుటుంబము 33 50 ఎకరాల భూమిని కలిగి వున్నది. ధనికరైతు 13 75 ఎకరాలు, మధ్యతరగతి రైతు 7.46 ఎకరాలు, చిన్నరైతు 3 95ఎకరాలు, సన్నకారు రైతు 1 71ఎకరాలు, భూమి కలిగిన వ్యవసాయకార్మికులు0.42 ఎకరాలు కలిగిఉన్నారు. ఒక వ్యవసాయ కార్మికునికున్న భూమితో 79 రెట్లు అధికంగా ఒక భూస్వామి కుటుంబానికున్నది సన్నకారు రైతుతో 19 రెట్లు, చిన్నరైతుతో 8 రెట్లు, మధ్యతరగతి రైతుతో 4 రెట్లు, ధనిక రైతుతో రెండు రెట్లు అధికంగా ఒక భూస్వామ్య కుటుంబం కలిగి ఉన్నది 22% సన్నకారు రైతుల వద్ద మొత్తం నికర సాగుభూమిలో 14% ఉంటే, కేవలం రెండు కుటుంబాలు (0 52%) మాత్రమే ఉన్న భూస్వాముల వద్ద 7% భూమి ఉన్నది నికర సాగుభూమి 30శాతం మధ్యతరగతి రైతుల వద్ద ఉన్నది

## కౌలుసేద్యము

గ్రామములో కౌలుసేద్యం చేస్తున్న కుటుంబాలు 40 ఉన్నాయి. మొత్తం భూమిలో కౌలుభూమి 15% ఉన్నది. ధనిక రైతుల్లో 7 కుటుంబాలు (47%), మధ్యతరగతి రైతుల్లో 16 కుటుంబాలు (39%), చిన్నకారు రైతుల్లో 7 కుటుంబాలు (20%), సన్నకారు రైతుల్లో 3 కుటుంబాలు (4%), కౌలుసేద్యము చేస్తున్నాయి. భూస్వామి మరియు వ్యవసాయ కార్మికులకు చెందిన ఒక్క కుటుంబం కూడా కౌలుసేద్యం చేయడం లేదు. గ్రామములోని మొత్తం భూమిలో ధనిక రైతులు 4% భూమిని, మధ్యతరగతి రైతులు 7% భూమిని, చిన్నరైతులు 4% భూమిని, సన్నకారు రైతులు 0.48% భూమిని కౌలుకు చేస్తున్నారు.

గ్రామములోని మొత్తం కౌలు భూమిలో 44% భూమిని మధ్యతరగతి రైతులు కౌలుకు చేస్తుండగా 28% భూమిని ధనిక రైతులు, 24%భూమిని చిన్నకారు రైతులు, 3% భూమిని సన్నకారు రైతులు సేద్యం చేస్తున్నారు మొత్తం కౌలు కుటుంబాల్లో 40% కుటుంబాలు మధ్యతరగతికి చెందిన వారుకాగా, 17 50% ధనిక రైతులు, 35% చిన్నకారు రైతులు, సన్నకారు రైతులు 7.50% ఉన్నారు.

గ్రామములో 19 దళిత కుటుంబాలు (11% దళితుల మొత్తం కుటుంబాల్లో శాతం) కౌలుసేద్యం చేస్తున్నాయి 13 కుటుంబాలు (10%) వెనుకబడిన తరగతులకు చెందిన కుటుంబాలు, 8 కుటుంబాలు అగ్రకులాలకు చెందినవి కౌలుసేద్యం చేస్తున్నాయి మొత్తం కౌలుభూమిలో 44%భూమిని దళితులు చేస్తుండగా, 29% భూమిని వెనుకబడిన తరగతులు, 27%భూమిని అగ్రకులాలు చేస్తున్నాయి. గ్రామములోని మొత్తం భూమిలో 7% భూమిని దళితులు కౌలుకు చేస్తుండగా, వెనుకబడిన తరగతులు 4%, అగ్రకులాలు 4%భూమిని చేస్తున్నాయి

**పశుసంపద**

పశుసంపద ఉన్న కుటుంబాలు 101 ఉన్నాయి గొర్రె కాపరుల కుటుంబాలు 20 ఉన్నాయి గ్రామములో గొర్రెలు 262 ఉన్నాయి ఆయా వర్గాల వారీగా భూస్వాముల్లో ఒక కుటుంబము, ధనిక రైతుల్లో 9 కుటుంబాలు, మధ్యతరగతి రైతుల్లో 32(78%) కుటుంబాలు, చిన్నకారు రైతుల్లో 34(49%) కుటుంబాలు, సన్నకారు రైతుల్లో 21(25%) కుటుంబాలు, భూమిలేని వ్యవసాయ కార్మికుల్లో 2 కుటుంబాలు మాత్రమే పశుసంపదను కలిగి వున్నాయి సాంప్రదాయ వృత్తులు చేసే కుటుంబాల్లో ఒకరు, వ్యాపారం చేసే కుటుంబాల్లో మరొకరికి మాత్రమే పశుసంపద ఉన్నది నలుగురు ధనిక రైతులు, ఒక మధ్య తరగతి రైతు, ముగ్గురు చిన్నకారు రైతులు, ఆరుగురు సన్నకారు రైతుల కుటుంబాలకు అనుబంధంగా గొర్రెల పెంపకం కూడా ఉన్నది 4 భూమిలేని వ్యవసాయకూలీ కుటుంబాలు, రెండు సాంప్రదాయ వృత్తులకు చెందిన కుటుంబాలు గొర్రెలను కల్గివున్నాయి

**వసతులు :**

గ్రామములో 86% కుటుంబాలకు స్వంత ఇళ్ళున్నాయి కాని 31% కుటుంబాలకు మాత్రమే పక్కా ఇళ్ళున్నాయి అగ్రకులాలలో 8 53% కుటుంబాలకు మాత్రమే పక్కా ఇళ్ళున్నాయి ఇద్దరు భూస్వామ్య కుటుంబాలలో ఒక కుటుంబానికి స్వంత ఇళ్ళున్నది మరో కుటుంబం అద్దె ఇంటిలో నివాసముంటున్నది భూమిలేని

వ్యవసాయ కార్మికుల్లో కేవలం 63% కుటుంబాలకు మాత్రమే స్వంత ఇళ్ళున్నాయి వ్యవసాయ కార్మికుల్లో 21% కుటుంబాలు అద్దె ఇళ్ళల్లో నివాస ముంటున్నాయి 33% చిన్నకారు రైతు కుటుంబాలకు, 37% సన్నకారు రైతులకు, 13% భూమిలేని వ్యవసాయ కార్మికులకు 23% భూమి కలిగిన వ్యవసాయ కార్మికులకు మాత్రమే పక్కా ఇళ్ళున్నాయి

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 29% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 11% భూమి మాత్రమే వుంది. 34% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

89% కుటుంబాలకు కరెంటు సౌకర్యము ఉన్నది. ఇరత వర్గాలకు 90% వరకు వుంటే, వ్యవసాయ కార్మికుల్లో కేవలం 71% కుటుంబాలకు మాత్రమే వున్నది గ్రామములో 41% కుటుంబాలకు లెట్రిన్ సౌకర్యము ఉన్నది అగ్రకులాలలో 78% కుటుంబాలకు లెట్రిన్ సౌకర్యం ఉంటే, 12% మాత్రమే దళితుల్లో వున్నది. వ్యవసాయ కార్మికుల్లో 12% కుటుంబాలకు మాత్రమే లెట్రిన్ సౌకర్యము ఉన్నది గ్రామములో 42% కుటుంబాలకు వంటగ్యాస్ సౌకర్యము ఉన్నది 18% మాత్రమే దళితులకున్నది

**వినిమయ వస్తువులు :**

గ్రామములో 6 కుటుంబాలకు స్కూటర్లున్నాయి 55 కుటుంబాలకు మోటారు సైకిళ్ళున్నాయి అన్ని వర్గాల్లో కంటే ఎక్కువశాతం ధనిక రైతుల్లో 8 కుటుంబాలు (53%)కు మోటార ్సైకిళ్ళున్నాయి. గ్రామములో సైకిళ్ళు130 కుటుంబాలకు ఉన్నాయి. ఆటోలు 18 కుటుంబాలకు, ట్రాక్టర్లు గ్రామములో 12 కుటుంబాలకున్నాయి ఇద్దరు భూస్వాములకు, నలుగురు ధనిక రైతులకు, 2 మధ్యతరగతి రైతులకు, మరో రెండు చిన్నకారు రైతులకు స్వంత ట్రాక్టర్లున్నాయి ఒక కుటుంబానికి రైస్‌మిల్ ఉన్నది 58% కుటుంబాలకు మాత్రమే టి వి లున్నాయి దళితుల్లో కేవలం 44% కుటుంబాలకు మాత్రమే టి వి లున్నాయి 72% కుటుంబాలకు సెల్‌ఫోన్ ఉన్నాయి

# కరీంనగర్ జిల్లా

## అక్కెనపల్లి

**ముఖచిత్రం**

సుందరయ్య విజ్ఞాన కేంద్రం 2013-14 లో నిర్వహించిన గ్రామీణ సామాజిక ఆర్థిక సర్వేలో భాగంగా కరీంనగర్ జిల్లా అక్కెనపల్లి గ్రామాన్ని 2013 డిసెంబరులో తొలి విడత, 2014 ఫిబ్రవరిలో మలి విడత సర్వే చేయటం జరిగింది. గ్రామాన్ని సెన్సెస్ మరియు శాంపిల్ సర్వే చేశాం సెన్సెస్ సర్వేలో వెల్లడైన అంశాలను పేర్కొంటున్నాం

ఉత్తర తెలంగాణ ప్రాంతంలోని కరీంనగర్ జిల్లా రామగుండం మండలంలో అక్కెనపల్లి గ్రామం వున్నది మండల కేంద్రం 18 కిలోమీటర్ల దూరంలో వున్నది సమీపంలో వున్న పట్టణం రామగుండమే గ్రామానికి రాకపోకలు బస్సు, ఆటోల ద్వారా జరుగుతున్నది గ్రామంలో పోస్టాఫీసు, విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్, రక్షిత మంచినీటిపథకం, ప్రాథమిక పాఠశాల, హైస్కూలు, పంచాయితీ భవనం, చౌకధరల దుకాణం, అంగన్వాడీ కేంద్రం వున్నాయి ఆరోగ్య కేంద్రం లేదు ప్రధాన పంటలుగా వరి, పత్తి , చెరకు తదితర పంటలు పండిస్తారు

**జనాభా వివరాలు**

గ్రామంలో మొత్తం కుటుంబాలు 288 వున్నాయి మొత్తం జనాభా 991 ఇందులో పురుషులు 505 స్త్రీలు 486 స్త్రీ పురుష నిష్పత్తి 962 అంటే ప్రతి వెయ్యి మంది పురుషులకు !962 మంది స్త్రీలు వున్నారు. 2011 ప్రభుత్వ జనాభా లెక్కల

ప్రకారం తెలంగాణ రాష్ట్రసగటు స్త్రీ పురుష నిష్పత్తి 988 అంటే రాష్ట్ర సగటు కంటే గ్రామంలో స్త్రీల సంఖ్య తక్కువగా వున్నది ఎక్కువ జనాభా వున్న బిసిలలోనే తక్కువగా (948) వున్నది కరీంనగర్ జిల్లా లింగ నిష్పత్తి 1015 జిల్లా నిష్పత్తి కంటే గ్రామ నిష్పత్తి బాగా తక్కువగా వున్నది. గ్రామంలో ఎస్‌టిలు లేరు జనాభాలో ఎస్‌సి 216 (21%), బిసిలు 752 (76%), ఓసిలు 23 (3%) వున్నారు అంటే మొత్తం జనాభాలో బిసి సామాజిక తరగతుల వారే అత్యధికంగా వున్నారు

## సామాజిక పొందిక

మతాల వారీగా చూస్తే హిందువుల కుటుంబాలు 281 (98%), ఏడు ముస్లిం కుటుంబాలు (2%) వున్నారు క్రిస్టియన్ కుటుంబాలు లేనట్లు సర్వేలో వెల్లడయింది

ఈ గ్రామంలో వున్న 288కుటుంబాల్లో సామాజిక తరగతుల వారీ చూస్తే ఎస్‌సి కుటుంబాలు 61 (21%), బిసి కుటుంబాలు 219(76%) వుంటే ఓసి కుటుంబాలు 8 (3%) వున్నాయి కులాల వారీగా చూస్తే బోయ 5, మాదిగ 24 (8%), మాల 18 (6%), ముదిరాజ్ 60 (21%), మున్నూరు కాపు 28 (10%), ముస్లిం బిసి 4, నాయీబ్రాహ్మణ 4, పద్మశాలి 28(10%), రజక 17(6%), రెడ్డి నాలుగు, విశ్వబ్రాహ్మణ6, వైశ్య నాలుగు, యాదవ 45 (16%), ఇతరులు 41 కుటుంబాలు వున్నాయి

## జీవనోపాధి

గ్రామంలో వున్న మొత్తం288 కుటుంబాల్లో 175 కుటుంబాలు వ్యవసాయం చేస్తున్నాయి వ్యవసాయ కూలీపై ఆధారపడి 67 కుటుంబాలు వున్నట్లు సర్వేలో వెల్లడైంది. అంటే మొత్తం 242 కుటుంబాలు (80%పైగా) వ్యవసాయరంగంపై ఆధారపడి వున్నారని అర్థమౌతున్నది. అయితే కూలీ చేసుకుంటున్న కుటుంబాలు ఇతర పనులు కూడా చేస్తుంటారు అందువల్ల ఈ సంఖ్య కాస్త అధికంగా కన్పడుతోంది వృత్తులపై ఆధారపడి 18 కుటుంబాలు వున్నాయి అందులో 7 కుటుంబాలు గొర్రెల కాపరులు ఉద్యోగ కుటుంబాలు 8 వున్నాయి. అందులో ప్రయివేటు ఉద్యోగస్తుల కుటుంబాలు మూడు, ప్రభుత్వ ఉద్యోగ కుటుంబాలు 5 (ముగ్గురు మున్నూరుకాపు) వున్నాయి. బీడీలు చేసే కుటుంబాలు వున్నాయి. నిర్దిష్టంగా సంఖ్య లేదు డ్రైవర్స్‌గా మొత్తం 9 కుటుంబాలు వుంటే అందులో ముదిరాజ్ 4, ముస్లింబిసి రెండు కుటుంబాలు వున్నాయి విశ్వబ్రాహ్మణ

కుటుంబాల్లో ఒకరు వడ్డీవ్యాపారిగా వున్నారు రజక కుటుంబాల్లో ఒకరు వృత్తిలో పూర్తిగా వున్నారు మున్నూరు కాపులో ఒకరు వ్యాపారం చేస్తున్నారు నాయీ బ్రాహ్మణ కుటుంబాల్లో అందరూ వ్యవసాయం చేస్తున్నారు క్షౌరవృత్తిదార్ల కుటుంబాలు దాదాపు 20 వున్నా, అందులో ఎక్కువ కుటుంబాలు వ్యవసాయం చేస్తున్నారు పద్మశాలిలో ఒకరు ఆర్ఎంపి గా వున్నారు గ్రామంలో స్త్రీ యాజమాన్యంలో గల కుటుంబాలు 34 (12%) వున్నాయి

**అక్షరాస్యత**

గ్రామంలో 57శాతం చదువుకున్నవారు వున్నారు ఇంకా 43శాతం మందికి ఇంకా చదువురాని వారుగా వున్నారు ప్రభుత్వ సమాచారం ప్రకారం రాష్ట్ర సగటు అక్షరాస్యత 66 54శాతం జిల్లాలో 64 15 శాతం ప్రభుత్వ లెక్కలతో పోలిస్తే దాదాపు 10శాతం తక్కువగా వున్నది బిసి, ఎస్‌సిలలో చదువుకున్న వారి శాతం ఒకే విధంగా వుంటే ఓసిలలో 65శాతం వున్నది. ప్రభుత్వ లెక్కల ప్రకారం ఎస్‌సిలలో అక్షరాస్యత 59శాతం ఈ గ్రామంలో 57శాతం వున్నది స్త్రీల అక్షరాస్యత శాతం 49శాతం వుంటే, పురుషుల్లో 65శాతం వున్నది. రాష్ట్రసగటుతో పోలిస్తే తక్కువగా వున్నది.

ఏయే విద్యాస్థాయి వరకు ఎంతెంత మంది చదువుకున్నారో పరిశీలించాం. ప్రాథమిక విద్యను అభ్యసించిన వారు 18శాతం (179మంది) వున్నారు సెకండరీ స్థాయి వరకు చదువుకున్న వారు 26 శాతం (255 మంది) వున్నారు ఇక ఇంటర్ వరకు చదువుకున్న వారు 7శాతం (69మంది), డిగ్రీ స్థాయి వరకు చూస్తే 50 మంది(5%) వున్నారు డిగ్రీ చేసిన వారిలో ఎస్‌సి సామాజిక తరగతికి చెందిన వారి శాతం ఎక్కువగా వున్నది పిజి చేసిన వారు 12 మంది వున్నారు. పిహెచ్‌డి చేసిన వారు లేరు

**ఆయుఃప్రమాణం**

గ్రామ జనాభాలో యువత (16 సం నుండి 40వరకు) దాదాపు 472 మంది వున్నారు అంటే దాదాపు 47% వున్నారు శ్రమ చేయగల్గిన వారు అంటే 16 నుండి 60 సంవత్సరాల వరకు చూస్తే 67% మంది వున్నట్లు సర్వేలో వెల్లడైంది ఎక్కువ కాలం జీవిస్తున్న వారి సంఖ్య కూడా తీసాం 61-70 సంవత్సరాల మధ్య వున్న వారి శాతం చూస్తే బిసిలలో 7% వుంటే, ఎస్‌సిలో కేవలం 5%వున్నారు. 70 సం పైబడి జీవిస్తున్న వారు 21మంది వుంటే అందులో బిసిలు 13 మంది వున్నారు

### పశుసంపద

సర్వే సమయానికి గ్రామంలో 29 కుటుంబాలకు 67 ఎద్దులు వున్నాయి అందులో 26 కుటుంబాలు బిసిలకు చెందినవి గేదెలు, ఆవులు మొత్తం 55 కుటుంబాలకు 102 వున్నాయి. అత్యధిక భాగం బిసి తరగతి వాళ్లవే అంటే ఎస్సిలకు పశుసందప నామామాత్రంగా వున్నట్లు అర్థమౌతున్నది మొత్తంగా చూస్తే ఆవులు, గేదెలు గ్రామంలో తక్కువగానే వున్నాయి. గొర్రెలు 30కుటుంబాలకు 678వున్నాయి ఇందులో అత్యధిక భాగం బిసిల వద్దనే వున్నాయి గొర్రెల సంఖ్య కాస్త ఎక్కువగానే వున్నది

### సాగుభూమి

సర్వే వివరాలు ప్రకారం మొత్తం నికర సాగుభూమి540ఎకరాలు వున్నది సాగునీటి వసతి కల్గిన భూమి 277 ఎకరాలు. మెట్ట భూమి 294 ఎకరాలు వుంది ఇందులో పడావుగా వున్న భూమి 21 ఎకరాలు కౌలు క్రింద సాగునీటి వసతి గల భూమి 58 5 ఎకరాలు, మెట్ట భూమి 112 ఎకరాలు, మొత్తం 170 ఎకరాలు సేద్యం అవుతున్నది కౌలుకు ఇచ్చిన భూమి పరిశీలిస్తే సాగునీటి వసతి వున్నది 28 ఎకరాలు, మెట్ట 25 ఎకరాలు మొత్తం 63 ఎకరాలుగా వున్నది. అంటే కౌలుకు ఇచ్చిన కుటుంబాలన్నీ పూర్తి వివరాలు చెప్పలేదని అర్థమౌతున్నది. ఇరుగుపొరుగు గ్రామాల పరిధిలో వున్న భూమిని కౌలుకు చేస్తున్నట్లయితే సాగు విస్తీర్ణంలో తేడా కన్పిస్తుంది. కౌలు చేస్తున్న వారిలో మధ్యతరగతి, చిన్నకారు రైతులే ఎక్కువ విస్తీర్ణం చేస్తున్నారు కౌలుకు ఇచ్చేవారిలో ఎక్కువ కుటుంబాలు వ్యవసాయ కార్మిక, వృత్తిదార్ల కుటుంబాలు వున్నాయి

### వర్గపొందిక ఎలా వుంది?

గ్రామంలో భూస్వాములు లేరని మా సర్వేలో వెల్లడైంది అబ్సెంటీ భూస్వాములు కూడా లేరు ధనిక రైతులు 11 కుటుంబాలు (4%) వున్నారు మధ్యతరగతి రైతు 47కుటుంబాలు (16%), చిన్నకారు రైతు కుటుంబాలు 67 (23%), సన్నకారు రైతులు 50 కుటుంబాలు (17%) వున్నారు భూమి కల్గివున్న వ్యవసాయ కార్మిక కుటుంబాలు 4 , భూమిలేని వ్యవసాయ కార్మిక కుటుంబాలు 63 (21%), వృత్తిదార్ల కుటుంబాలు 5 (2%), వ్యవసాయేతర కార్మిక కుటుంబాలు 4, స్వయం ఉపాది కుటుంబాలు 3,

వ్యాపారంలో మూడు కుటుంబాలు(1%), అలాగే ప్రభుత్వ, ప్రైవేటు ఉద్యోగులు 15 కుటుంబాలు (4%) ఇతరులు 16 కుటుంబాలు (6%) వున్నట్లు సర్వేలో వెల్లడైంది

వర్గాలను నిర్ణయించేటపుడు ఆయా కుటుంబాల చేతుల్లో వున్న నికర సాగుభూమి విస్తీర్ణాన్ని ప్రాతిపదికగా తీసుకున్నాం ఏయే తరగతుల చేతిలో ఎంతెంత భూమి వున్నదో చూశాం 4శాతంగా వున్న ధనిక రైతుల చేతుల్లో 19% భూమి వున్నది 16శాతంగా వున్న మధ్యతరగతి రైతుల చేతుల్లో 42% భూమి వుంది 23 శాతంగా వున్న చిన్నకారు రైతుల చేతుల్లో 29శాతం భూమి వుంది సన్నకారు రైతులు 17 శాతం వుంటే వీరి చేతుల్లో వున్న భూమి 9% వున్నది అంటే ధనిక రైతుల చేతుల్లో కొద్దిపాటి భూమి కేంద్రీకరించబడి వున్నదని అర్థమౌతున్నది

భూకేంద్రీకరణ

స్వంత భూమిని ప్రాతిపదికగా తీసుకొని భూమి వున్న కుటుంబాలు, భూమి లేని కుటుంబాలను చూస్తే మొత్తం 288 కుటుంబాల్లో 172కుటుంబాలకు (60శాతం) భూమి వున్నది అంటే 116 కుటుంబాలకు (40%) ఒక్క సెంటు భూమికూడా లేకపోవడం గమనార్హం ఇందులో బిసిలు 88 కుటుంబాలు, ఎస్‌సిలు 25కుటుంబాలు, ఓసిలు మూడు కుటుంబాలు వున్నాయి ఎస్‌సిలలో దాదాపు సగం కుటుంబాలకు భూములు లేకపోవడం చూస్తాం భూమి వున్న కుటుంబాల్లో పై స్థాయిలో వున్న 5% కుటుంబాలకు 24% భూమి వున్నది అదే సందర్భంలో క్రిందిస్థాయిలో వున్న 60% కుటుంబాలకు 9 9శాతం భూమి వున్నది ఆర్థిక తరగతుల వారీగా చూస్తే ధనిక రైతువర్గానికి సగటు కమతం ఆరున్నర ఎకరాలు వుంటే, మధ్యతరగతి వర్గానికి 3 ఎకరాలు, సన్నకారు రైతువర్గానికి 0 72 సెంట్లు వున్నది వ్యవసాయ కార్మిక వర్గానికి 0 5సెంట్లు వున్నట్లు సర్వేలో వెల్లడైంది అంటే వ్యవసాయకార్మిక కుటుంబానికి ధనిక రైతువర్గానికి పోలిస్తే ఎన్నో రెట్లు ఎక్కువగా భూమి కల్గివున్నట్లు అర్థమౌతున్నది

ఏయే సామాజిక తరగతులకు ఎంతెంత భూమి వున్నదో చూశాం బిసిలకు 322 ఎకరాలు, ఓసిలకు 30 ఎకరాలు, ఎస్‌లకు 70 ఎకరాలు వున్నది గ్రామంలో మొత్తం స్వంత భూమి 422 ఎకరాలు సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 1 46 ఎకరాలు వుండాలి

## కౌలు

గ్రామంలో మొత్తం 69 కుటుంబాలు కౌలుసేద్యం చేస్తున్నాయి అంటే మొత్తం కుటుంబాల్లో 24శాతం కుటుంబాలు కౌలురైతు కుటుంబాలుగా వున్నాయి వ్యవసాయం మాత్రమే చేస్తున్న కుటుంబాల్లో చూస్తే ఈ శాతం 39% ఈ కుటుంబాలు సాగుచేస్తున్న భూమి విస్తీర్ణం 171 ఎకరాలు (32%) కౌలుకు చేస్తున్న కుటుంబాలను ఆర్థిక తరగతుల వారీగా చూస్తే ధనిక రైతులు 11 మందిలో 6గరు వున్నారు వీరు దాదాపు 30 ఎకరాలు చేస్తున్నారు. మధ్యతరగతి రైతు కుటుంబాలు 47లో 31 కుటుంబాలు కౌలు రైతులు వీరు 86 ఎకరాలు చేస్తున్నారు 67 కుటుంబాలుగా వున్న చిన్నకారు రైతుల్లో 21 కుటుంబాలు 43 ఎకరాలను సాగుచేస్తున్నారు సన్నకారు రైతులు 50 వుంటే అందులో 11 కౌలురైతు కుటుంబాలు కేవలం 12 ఎకరాలు మాత్రమే చేస్తున్నారు.

ఇక సామాజిక కోణంలో చూస్తే ధనిక రైతుల్లో వున్న ఆరు కుటుంబాల్లో5గరు బిసిలే. ఒకరు మాదిగ. మధ్యతరగతిలో వున్న 31 మందిలో ఒకరే ఎస్‌సి చిన్నకారు కౌలురైతులంతా బిసిలే సన్నకారు సగం బిసిలు, సగం ఎస్‌సిలు వున్నారు కులాల పరంగా చూస్తే ముదిరాజ్‌లు 27 కుటుంబాలు 70ఎకరాలను సాగుచేస్తుంటే, మున్నూరు కాపు 7 కుటుంబాలు 24 ఎకరాలును, యాదవ కులంలో 12 కుటుంబాలు 22 ఎకరాలను సాగుచేస్తున్నారు మిగిలిన కులాలు స్వల్పంగా కౌలురైతులుగా వున్నారు.

## గృహాలు - మౌలిక సదుపాయాలు

గ్రామంలో 91శాతం కుటుంబాలకు స్వంత ఇళ్లు వున్నాయి 9%నికి ఇంకా స్వంత ఇళ్లు లేవు బిసి సామాజిక తరగతిలో 93% కుటుంబాలకు స్వంత ఇళ్లు వుంటే. ఎస్‌సిలకు 83% కుటుంబాలకు మాత్రమే స్వంతిళ్లు వున్నాయి పక్కాఇళ్లల్లో 78 శాతం కుటుంబాలు వుంటే, ఎస్‌సి తరగతిలో కేవలం 66శాతం కుటుంబాలకే వున్నాయి. కచ్చా ఇళ్లల్లో 14% వున్నారు. ఎస్‌సిలు 20% కుటుంబాలు వున్నాయి. ఇక అద్దె ఇళ్లల్లో 19 కుటుంబాలు వున్నాయి. అందులో 11 కుటుంబాలు బిసిలకు చెందినవి.

గ్రామంలో ట్రాక్టర్లు 6 వున్నాయి ఇందులో బిసి 5, ఒకటి ఎస్‌సిలు కల్గివున్నారు రైస్‌మిల్లులు లేవు సైకిల్స్ 123 (43%) కుటుంబాల వారు కల్గివున్నారు బిసిలకే ఎక్కువగా వున్నాయి స్కూటర్స్ 5 వుంటే అత్యధిక భాగం బిసి తరగతులకు వున్నాయి ఆటోలు నాలుగు వున్నాయి. టివిలు 66శాతం కుటుంబాలకు వున్నాయి బిసి సామాజిక తరగతిలో 70%కుటుంబాల వారు కల్గి వుంటే, ఎస్‌సిలలో 50% కుటుంబాలే కలిగి వున్నారు గ్రామంలో 91% గృహాలకు విద్యుత్ సౌకర్యం పొందివున్నారు మరుగుదొడ్డి సౌకర్యం కేవలం 49% కుటుంబాలకే వున్నది ఎస్‌సిలకు 40% కుటుంబాలకే వున్నది సెల్‌ఫోన్ లు దాదాపు 73% కుటుంబాల వారు కలిగివున్నారు ఎస్‌సిలలో 60% కుటుంబాలకే వున్నాయి వంటగ్యాస్ సౌకర్యం గ్రామంలో 54శాతం కుటుంబాలకు వున్నది. బిసిలలో 61% కుటుంబాలకు వుంటే, ఎస్‌సిలకు 29% కుటుంబాలకే ఈ సౌకర్యం వున్నది

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 24% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 10% భూమి మాత్రమే వుంది. 40% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

# నిజామాబాద్ జిల్లా

## గగ్గుపల్లి

సుందరయ్య విజ్ఞాన కేంద్రం(శోధన) 2013-14 వ్యవసాయ సీజన్‌లో నిర్వహించిన గ్రామీణ సామాజిక ఆర్థిక సర్వేలో భాగంగా గగ్గుపల్లి గ్రామాన్ని 2013 డిశంబరులో తొలి దఫా, 2014 జూన్‌లో మలి దఫా సర్వే నిర్వహించాము. సర్వేలో సేకరించిన సమాచారాన్ని స్థూలంగా పరిశీలిద్దాం.

**గ్రామ ముఖచిత్రం**

తెలంగాణ రాష్ట్రంలోని ఉత్తర ప్రాంతంలో నిజామాబాద్ జిల్లాలో గగ్గుపల్లి గ్రామం వుంది ఆర్మూర్ మండలకేంద్రానికి 6 కిలోమీటర్లు దూరంలో వున్నది. నిజామాబాద్ నుండి అదిలాబాద్‌కు వెళ్లే రహదారికి సమీపంలో వున్నది జిల్లాకేంద్రమైన నిజామాబాద్ 40 కిమీల దూరంలో వుంది. గ్రామానికి ఆర్మూర్ దగ్గరి పట్టణము ఆర్‌టిసి బస్‌లు, ఆటోలే ఇక్కడి రవాణా సాధనాలు ఇక్కడ అంతా నల్లరేగడి భూమి సాగునీటి వసతి లేదు బోర్లు, బావులు క్రింద కొంతభూమి సాగవుతుంది. మిగిలిన భూమి అంతా వర్షాధారమే వరి, పసుపు, మొక్కజొన్న టమాటో, సోయాబీన్, నువ్వులు, జొన్న పంటలు పండిస్తారు గ్రామంలో దీర్ఘకాల వలసలు ఉన్నట్లు నమోదైంది కొందరు లక్షలు అప్పులు చేసి కతార్, సౌదీ వంటి అరబ్ దేశాలకు పనులకోసం వలసలు వెళుతున్నారు శ్రామిక మహిళలకు బీడీలు చుట్టేపని ఏడాది పొడవునా కొనసాగుతున్నది "జీతగాళ్ళ" వృత్తి అమలులో వుంది. ధాన్యం కొనుగోళ్ళు కిలోలలో తూకం పద్ధతి ఇక్కడ అమలు కావటం లేదు "కడాలు" డబ్బాకొలతల పద్ధతి అమలులో వుంది అంటే ఈ గ్రామంలో ఇంకా ఫ్యూడల్ పద్ధతులు కొనసాగుతున్నాయనేది అర్ధమౌతున్నది

## జనాభా- సామాజిక పొందిక

గ్రామ జనాభా 1205 పురుషులు 594 స్త్రీలు 611 స్త్రీ, పురుష లైంగిక నిష్పత్తి 1029 అంటే ప్రతి 1000 మంది పురుషులకు 1029 మంది స్త్రీలు వున్నారని అర్థం గ్రామంలో స్త్రీల సంఖ్య ఎక్కువగా వున్నది రాష్ట్ర లింగ నిష్పత్తి కంటే గ్రామంలో ఎక్కువగా వున్నది. అయితే జిల్లా నిష్పత్తి 1047 కంటే తక్కువగా వున్న విషయాన్ని గమనించాలి లింగనిష్పత్తి ఎస్‌సి 1055, తర్వాత బిసిలలో 1053, ఒసిలలో 750తో వుంది ఓసిలలో బాగా తక్కువగా వుండటం గమనార్హం

సంఖ్యరీత్యా బిసిలు అధిపత్యంలో వున్న గ్రామం ఇక్కడి 299 కుటుంబాలలో బిసిలు 53%తో ప్రథమ స్థానంలో వున్నారు తర్వాత ఎస్‌సి లు 38%, ఆతర్వాత ఒసిలు 7 55% కుటుంబాలన్నాయి ఒక్క యస్‌టి కుటుంబం మాత్రమే వున్నది బిసిలు అత్యధికంగా 72%, ఎస్‌సిలు 14% (దాదాపు ఆజిల్లా ఎస్‌సిల సగటుతో సమానముగా వున్నది) ఎస్‌టిలు (ఐదుమంది)0 41% మాత్రమే వున్నారు (ఈ తరగతి జిల్లా సగటు 7 56 కంటే చాలా తక్కువగా వున్నది )

జనాభాలో 96% హిందువులే ముస్లిం ఒక్క కుటుంబం వున్నది 10 క్రిష్టియన్ కుటుంబాలున్నాయి కులాలుగా చూస్తే మొత్తం 299 కుటుంబాలలో మాలలు 94 (31%), పద్మశాలి 14శాతం, కురుమ 21, మాదిగ 17, వడ్డెర 19, విశ్వబ్రాహణ 14 కుటుంబాలు వున్నాయి 10 కుటుంబాల కంటే తక్కువగా వున్న కులాలలో బోయ 2, గంగపుత్ర 3, గౌడ 8, కమ్మ 4, కుమ్మరి 2, ముదిరాజులు 9, మున్నూరుకాపు 9, ముస్లిం 1, రజక 8, రెడ్డి 7, యాదవ 8, ఇతరులు 9 కుటుంబాలు వున్నాయి.

## వర్గవిభజన

గ్రామంలోని కుటుంబాలను శ్రమ ఆధారంగా 4 తరగతులుగా విభజించి పరిశీలిద్దాము మొదటిది- రెండు భూస్వామ్య కుటుంబాలు, ధనికరైతు కుటుంబాలు 9 వున్నాయి. ఈ రెండు వర్గాలవారూ ప్రధానంగా ఇతరుల శ్రమపై ఆధారపడి వ్యవసాయంలో మిగులును సంపాదిస్తున్నారు రెండవది- మధ్యతరగతి రైతులు 17 కుటుంబాలు, చిన్నరైతులు 31 కుటుంబాలు, సన్నకారురైతులు 47 వున్నాయి ఈ మూడు వర్గాలు తమ కుటుంబాలపరంగా అత్యధికంగా శ్రమచేస్తూ, ఇతరుల శ్రమను కూడా కొంతమేర వినియోగించుకుంటారు వారి ఫలసాయంలో గరిష్టభాగం వారి స్వంత

శ్రమ ఫలితంగానే సాధించుకుంటున్నారు మూడవది- వ్యవసాయకార్మికులకుటుంబాలు కొద్దిగా భూమి కలవారు 16 కుటుంబాలు, భూమి లేనివారు 80 కుటుంబాలు, వృత్తిదారులు12 కుటుంబాలు, వ్యవసాయేతరకార్మికులు 41 వున్నాయి పై వర్గాలు పూర్తిగా తమ శ్రమఫలితంపై ఆధారపడి జీవిస్తున్నారు నాల్గవది-ఉద్యోగులు, చిరువ్యాపారులు, స్వయం వుపాధులులలో పనిచేసుకుంటున్నవారు తదితరులు వున్నారు

**జీవనోపాధి**

గ్రామంలోని భూస్వాములలో ఒకరు కమ్మ కులస్తులు.ఇతనికి స్వంత భూమి15ఎకరాల మాగాణి ,10ఎకరాల కౌలుభూమి వున్నది మరొకరు మాల వుపకులానికి చెందినవారు. అతనికి స్వంత భూమి 15ఎకరాల మాగాణి, 42 ఎకరాల కౌలుభూమి వున్నది ధనికరైతులు 9మందిలో మాల ఇద్దరు, మాదిగ ఒక్కరు, కమ్మ ,కాపు ఇద్దరువంతున, ముదిరాజు ముగ్గురు,రజక,యాదవ ఒకరువంతున వున్నారు మధ్యతరగతి రైతులు 17లో మాల7, మాదిగ ఒక్కరు, చిన్నరైతులు 31లో 21మాలలు, సన్నకారురైతులు 47మందిలో 27మాల, మాదిగ 8మంది, వ్యవసాయకార్మికులు (భూముకలవారు)16లో 11మందియస్సిలున్నారు , వ్యవసాయకార్మికులు(భూమిలేనివారు) 80మందిలో 55మంది బిసిలు, 20మంది ఎస్సిలున్నారు వృత్తిదారులు 12లో విశ్వబ్రాహ్మణ, రజక నల్గురివంతున వున్నారు. వుద్యోగులు-ప్రైవేటురంగంలో 12 మంది వున్నారు ముగ్గురు పద్మసాలీలు. ప్రభుత్వ ఒక్కరు(మాల), టైలర్స్ 5మందిలో అందరూ పద్మశాలీలే వ్యవసాయేతరకార్మికులు 41మందిలో పద్మశాలీలు 16మంది వున్నారు గ్రామం బయటికివెళ్ళిన వలసదారులు 13లో మాలలు ఆరుగురు వున్నారు. ముగ్గురు పాలేర్లు వున్నారు. అందరూ బిసిలే. డ్రైవర్లుగా మూడు కుటుంబాలు వున్నాయి వ్యాపారులు ఏడుగురు వుంటే వారిలో పద్మశాలి నలుగురు చేనేత, వడ్రంగం, క్షురక , చేపలు పట్టడంవంటి సాంప్రదాయవృత్తులు తగ్గుతున్నాయి. బ్రతుకుదెరువుకోసం సాంప్రదాయేతర వుపాధులలో స్థిరపడేందుకు ఈగ్రామస్తులు యత్నిస్తున్నారు వారి జీవనోసాధిలలో పలు మార్పులు జరుగుతున్నాయి

**కులాలు - వృత్తులు**

గతంలోకొన్ని కులాలకే పరిమితమైన సాంప్రదాయ వృత్తులలో కొన్ని మార్పులు జరుగుతున్నాయి. ఉదాహరణకు- గతంలో అగ్రకులాలకే పరిమితమైన వ్యవసాయంలోకి కొత్త కులాలవారు ప్రవేశిస్తున్నారు సాంప్రదాయకంగా వైశ్యులు నడిపే వ్యాపారాలను

పద్మశాలి కుటుంబాలు నడుపుతున్నాయి టైలరింగు పని చేసే ముస్లింలు స్థానంలో పద్మసాలీలు చేస్తున్నారు ఎస్‌సి లలో కొందరు విద్యావంతులైన యువత ముందుకొచ్చింది పలు రంగాల్లో స్థిరపడుతున్నారు తమ సాంప్రదాయవృత్తులు కొనసాగించలేక ముదిరాజ్, రజకులు, క్షురకులు, గౌడ ,యాదవ, గంగపుత్ర ,నాయీబ్రాహ్మణ, విశ్వబ్రాహ్మణ, పద్మశాలి, తదితరులు వ్యవసాయం, వ్యవసాయేతర రంగాల్లోకి క్రమంగా ప్రవేశించి, ఆత్మగౌరవంతో జీవించడం ప్రారంభమైందని సర్వేలో వెల్లడైన అంశాలతో నిర్ధారణకు రావచ్చు

భూకేంద్రీకరణ

సామాజిక గ్రూపులవారీ పరిశీలిస్తే గ్రామంలో మొత్తంగా వున్న స్వంత భూమి 418 ఎకరాలు అందులో మాగాణి 328ఎకరాలు మెట్ట 90 ఎకరాలు జనాభాలో 38%గా వున్న ఎస్‌సిలకు మాగాణి , మెట్ట రెంటిలో 62% వంతున భూమివుంది 53%గా వున్న బిసిలకు మాగాణిలో 19%, మెట్టలో 62%గా వుంది, 8%గా వున్న ఒసిలకు మాగాణిలో19% ,మెట్టలో కూడాఅంతే శాతం వాటా వున్నది ఎస్‌టి కుటుంబం 2 5 ఎకరాలు మాగాణి కల్గివున్నది మొత్తం భూమిలో ఎస్‌సిలు 62% ,బిసిలు, ఒసిలు చెరి 19% పై యాజమాన్యం కల్గివున్నారు. ఈ గ్రామంలో కుటుంబం సగటుభూమి 1 40 ఎకరాలుగా వున్నది

ఆర్థికవర్గాలవారీ చూస్తే భూస్వాములు ధనికరైతులు కలిపి(13) 4% కుటుంబాలకు మొత్తం మాగాణిలో 22%వాటా వుంది పై రెండు సంపన్నవర్గాలు కలసి మొత్తంభూమిలో 23% పై యాజమాన్యం కల్గివున్నారు 31 77%గావున్నమధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతులు మూడు వర్గాలు కలిపి మాగాణిలో 51%, మొత్తం భూమిలో 60% కల్గివున్నారు. వ్యవసాయకార్మికులలో భూమి కలవారు, లేనివారు కలసి 32%వున్నారు వీరిలో కొందరు కొద్దిపాటి తమ భూములను కౌలుకిచ్చి వ్యవసాయ రంగంలో శ్రమిస్తున్నారు పై వర్గాలకు మాగాణిలో14% వుంది మొత్తం భూమిలో6% మాత్రమే వాటాగా దక్కింది. మిగిలిన వర్గాలలో ఒక్కొక్కరికి 2ఎకరాల లోపు భూములున్నాయి అసలు ఎలాంటి వ్యవసాయభూమి లేని కుటుంబాలు 166 (56) వున్నాయి.

భూమి కల్గిన పైస్థాయిలోని 5 శాతం కుటుంబాల చేతిలో 37శాతం భూమి వుంటే, దిగువ 60 కుటుంబాల చేతిలో 1 5 శాతం భూమి వున్నది. అంటే గ్రామంలో భూకేంద్రీకరణ తీవ్రంగా వున్నట్లు అర్థమౌతున్నది. ఈ ప్రాంతంలో గతంలో నడచిన

కమ్యూనిష్టు వుద్యమాలు, భూపోరాటాల వల్లనే ఎస్‌సి,ఎస్ టి లకు భూమిలో కొంతయినా వాటా దక్కిందని అక్కడి వారు చెప్పారు

### మరికొన్ని ఆస్తులు

గ్రామంలోని 8 ట్రాక్టర్లు వున్నాయి. అందులో ఎస్‌సిలకే 7 వున్నాయి బిసిలకు కేవలం ఒక్క ట్రాక్టరు మాత్రమే వున్నది గ్రామంలో రైస్ మిల్స్ లేవు పశు సంపదను సేకరించాం మొత్తం 84 ఆవులు, దూడలు వున్నాయి ఎస్‌సిలకు 58, బిసిలకు 23 వున్నాయి 210 గొర్రెలలో బిసిలకు అత్యధికంగా 200లున్నాయి

### కౌలు సేద్యము

గ్రామంలో 20 మంది కౌలుదార్లు వున్నారు వీరు 77ఎకరాల కౌలుభూమి సాగుచేస్తున్నారు. భూస్వాములు, ధనికరైతులు మొత్తం కౌలుభూమిలో (52 ఎలు) 68% సాగు చేస్తున్నారు రివర్స్ కౌలు విధానం అమలులో వుంది కొందరు మధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతులు కలసి (25 ఎకరాలు) 32% కౌలుభూమి చేస్తున్నారు. మిగిలిన వర్గాల వారెవ్వరూ కౌలు చెయ్యటం లేదు ఒక ధనికరైతు తన భూమిలో 4 ఎకరాలను యితరులకు కౌలు కిచ్చాడు సామాజిక గ్రూపులవారి చూస్తే మొత్తం కౌలు భూమిలో గరిష్టంగా 43% ఎస్‌సి (ఎనిమిది మంది) లు చేస్తున్నారు వారిలో ఒక భూస్వామి, మరొకరు ధనిక రైతులుగా వున్నారు ఒసి (కమ్మ) లు ముగ్గురు 35%, బిసిలు 5మంది 21%కౌలు భూమి చేస్తున్నారు.

### అక్షరాస్యత

తెలంగాణ రాష్ట్ర అక్షరాస్యత (2011 జనాభా లెక్కల ప్రకారం) గ్రామీణ ప్రాంతాలలో 57 99%గా వుంది రాష్ట్రంతో పోల్చినపుడు గ్రామంలో 49.87%తో అక్షరాస్యతలో వెనుకబడి వున్నారు ఈ జిల్లాలో సాధారణ అక్షరాస్యత 61.25%గావుంది ఇక్కడ అక్షరాస్యతలో ఒసిలు 78%తో అగ్రస్థానంలోను, 58%తో బిసి లు, యస్‌సిలు సమానంగా వున్నారు ఈ జిల్లాలోయస్‌సిలసగటు అక్షరాస్యత (53%) కంటే ఈగ్రామంలో కొంచం ఎక్కువగా వుంది స్త్రీలలో అక్షరాస్యత చూస్తే ఒసిలలో గరిష్టంగా 72% మహిళలు అక్షరాస్యులుగా వున్నారు.ఆతర్వాత 53%తో ఎస్‌సి మహిళలు అక్ష రాస్యులు జనాభాలో 75%గావున్న బిసి మహిళలు 50%తో అక్షరాస్యతలో దిగువన వున్నారు.

ఒక్క ప్రాధమికవిద్యలో మాత్రమే మూడొంతులు జనాభాగల బిసిలు 19%తో ముందున్నారు. ఆ తర్వాత సెకండరీ, ఇంటర్, డిగ్రీ, పిజి అన్నిస్థాయిల విద్యలోనూ వెనుకబడిపోయారు జనాభాలో 7 55%గా వున్న ఒసిలు అన్నిస్థాయిలలో అగ్రస్థానంలో నిలిచారు మిగిలిన సామాజికగ్రూపులు వెనుకబడిపోయాయి సెకండరీవిద్యలో ఒసిలలో 27%, బిసిలలో26%,ఎస్సిలలో 24% చదవగల్గారు ఇంటర్లో చదువరుల సంఖ్య గణనీయంగా తగ్గింది ఈ స్థాయిలో ఎస్సిలలో9%కు ,బిసిలలో 7%కు పడిపోయింది డిగ్రీలో కూడా ఒసిలలో 19%తో ముందుండగా, బిసిలలో కేవలం 4%కు తగ్గిపోగా, ఎస్సిలలో9% వద్ద నిలబడినారు పిజిలో 1%తో ఒసిలు ముందుండగా మిగిలినవారు బాగా వెనుకబడిపోయారు

**ఆయుఃప్రమాణం**

మొత్తం జనాభాలో 16నుండి 40 సంవత్సరముల మధ్య వయసుగలయువత జనాభాలో 61% వున్నారు అలాంటివారు గ్రామ జనాభాలో అత్యధికంగా 44% బిసిలలో, తర్వాత ఎస్సిలలో 11% వున్నారు అత్యల్పంగా 7మంది ఒసిలలో వున్నారు పనిచేయగల వయసులో (16నుండి60సం ముల మధ్య ) వున్నవారు ఎస్.సి 66%,ఎస్టి ,బిసిలలో 60%,ఒసి 75%వున్నారు 60 సంవత్సరములు ఆపైన జీవించివున్న వారు జనాభాలో (94)8% మంది మాత్రమే ఈ కేటగిరీలో, ఎస్ సి మరియు ఒసిలలో గరిష్టంగా 8%వున్నారు , ఎస్టి లలోఒక్కరు కూడా లేరు 74% జనాభాగల బిసిలలో కేవలం 0 08% మాత్రమే జీవించి వున్నారు

**కనీస అవసరాలు**

గృహవసతి - పక్కాగృహాలు కల్గినవారిలో ఎస్ సిలు 80%తో ప్రధమస్థానం లోనూ, తర్వాత 72% కుటుంబాలున్న బిసిలు 82%తో ద్వితీయ స్థానంలోనూ, 7 69%గావున్నఒసిలు 61% పక్కాగృహాలు కలిగివున్నట్లు సర్వే తెల్పుతున్నది ప్రభుత్వ గృహనిర్మాణ పధకాలద్వారా ఎస్ సిలు ఈ స్థితికి చేరారు (62) 25% కచ్చాఇళ్ళతో బిసిలు ఈకేటగిరిలో బాగా వెనుకబడి వున్నారు అద్దెఇళ్ళలో నివసించేవారు అత్యధికంగా ఒసిలలో 35%వున్నట్లు సర్వేసమాచారం విద్యుత్ కనెక్షన్లు-283 కుటుంబాలకు అందుబాటులో వుంది 92 నుండి 98% కుటుంబాలు ఈ సౌకర్యం కల్గివున్నారు టాయిలెట్స్ సదుపాయం -179లో ఒసిలలో గరిష్టంగా 89%కల్గివున్నారు, గ్రామంలో సగం జనాభాగల బిసిలలో

63 శాతానికి , ఎస్సిలలో సగం కుటుంబాలకు మాత్రమే ఈసౌకర్యం వుంది వంటగ్యాసు-213 కనెక్షన్‌లలో ఒసిలలో 96% గరిష్టంగా వినియోగించుకుంటున్నారు , బిసిలలో 72%, ఎస్ సిలలో 65%కు మాత్రమే ఈ వసతి అందుబాటులో వుంది

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 37% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 1.5% భూమి మాత్రమే వుంది. 56% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

కొన్నిసౌకర్యాలు

69 మోటారు సైకిళ్ళలో మధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతులు సగం వాడుతున్నారు వ్యవసాయేతర కార్మికులు 5, భూస్వాములు, ధనిక రైతులు 7 వినియోగిస్తున్నారు. 16 స్కూటర్‌లలో 5 వ్యవసాయేతర కార్మికులు వద్ద వున్నాయి 4 కార్లలో రెండు భూమిలేని వ్యవసాయ కార్మికుల యాజమాన్యంలో వున్నట్లు సర్వేలో వెల్లడయింది ఈ వాహనాలను వారు అద్దెలకు తిప్పుతున్నట్లు తెలిసింది 75సైకిళ్ళలో 36 బిసి, ఎస్సి సామాజిక గ్రూపులవారు వాడుతున్నారు 234 టివిలలో భూమిలేని వ్యవసాయ కార్మికులు గరిష్టంగా (47), సన్నకారు రైతులు(44), వ్యవసాయేతర కార్మికులు(33) కలిసి 53% వినియోగిస్తున్నారు ఎస్ సిలలో సగం మందికే ఈ వసతి వున్నది. 261 సెల్‌ఫోన్‌లలో ఎస్సిలలో 84%, బిసిలలో 89%,ఎసిలలో 87శాతానికి వున్నాయి

# ఖమ్మం జిల్లా

# సీతారాంపురం

**ముఖచిత్రం**

సుందరయ్య విజ్ఞాన కేంద్రం 2013-2014 సంవత్సరంలో నిర్వహించిన గ్రామీణ సామాజిక ఆర్థిక సర్వేలో భాగంగా ఖమ్మం జిల్లా సీతారాంపురం గ్రామంలో 2013 డిశంబరులో తొలి దఫా, 2014 జూన్‌లో మలి దఫా సర్వే నిర్వహించాము మండల కేంద్రం దుమ్ముగూడెం ఇది 22 కిలోమీటర్ల దూరంలో వుంటుంది బోర్లు ప్రధాన సాగునీటి వనరుగా ఉన్నాయి ప్రముఖ పర్యాటక పట్టణం భద్రాచలం 20 కిలోమీటర్ల దూరంలో ఉంది ఆర్టీసీ బస్ సౌకర్యంతో పాటు ఆటోలు రవాణా సాధనాలుగా ఉన్నాయి మిర్చి, వరి, శనగ ఈ గ్రామంలో ప్రధాన పంటలు పోస్టాఫీసు, విద్యుత్ ట్రాన్స్‌ఫార్మరు, గ్రామీణ రక్షిత మంచినీటి సరఫరా పథకం, పంచాయితీ భవనం, ప్రాథమమిక, మాధ్యమిక పాఠశాల, రేషను దుకాణం, అంగన్‌వాడీ కేంద్రం ఉన్నాయి

**జనాభా పొందిక**

గ్రామంలో మొత్తం 479 కుటుంబాల్లో 869 మంది పురుషులు, 897 మంది స్త్రీలు ఉన్నారు. లైంగికక నిష్పత్తి 1032 రాష్ట్ర సగటు కంటే చాలా ఎక్కువ అంటే వెయ్యి మంది పురుషులకు 1032 మంది స్త్రీలు ఉన్నారు గ్రామ సగటు లైంగిక నిష్పత్తి కంటే గిరిజనుల్లో లైంగిక నిష్పత్తి ఎక్కువ, 1011, దళితుల్లో 1039గా ఉంది ఒసీల్లో అతి తక్కువగా ఉంటే 800 మాత్రమే ఉంది. వెనకబడిన తరగతుల్లో అత్యధికంగా 1062 ఉంది 2011 జనాభా లెక్కల ప్రకారం జిల్లాల్లో లైంగిక నిష్పత్తి 999 గ్రామ

స్థూల లైంగిక నిష్పత్తి జిల్లా సగటు కంటే ఎక్కువగా ఉండటం ఒక ప్రత్యేకత అయితే అగ్రకులాలు మినహా మిగిలిన అన్ని సామాజిక తరగతుల్లో లైంగిక నిష్పత్తి రాష్ట్ర సగటు కంటే చాలా ఎక్కువగా ఉండటం మరో ప్రత్యేకతగా చెప్పుకోవాలి. సర్వే కుటుంబాల్లో అగ్రకులాలకు చెందిన కుటుంబాలు కేవలం 16. అందువల్ల అగ్రకులాల్లోనూ ఉన్న లైంగిక నిష్పత్తిని ప్రామాణికంగా పరిగణించటానికి వీలు లేదు

**అయుఃప్రమాణం**

గ్రామ ప్రజల అయుఃప్రమాణం వివరాలు ఇలా ఉన్నాయి గ్రామంలో ఏడు శాతం జనాభా (122 మంది) సెన్సెస్ సర్వే సమయానికి ఐదేళ్ల లోపు వయసున్న వారు కాగా మరో ఆరున్నర శాతం జనాభా 6నుండి 10 ఏళ్ల లోపు వయసు కలిగిన వారు 6 సంవత్సరాల నుండి 15 సంవత్సరాల వయసు వరకు పాఠశాలకెళ్లే వయసు అని నిర్ధారించుకుంటే మొత్తం గ్రామంలో దాదాపు 16 శాతం జనాభా (276 మంది) పాఠశాలకు వెళ్లగలిగిన వయసులో ఉన్న జనాభా 16 సంవత్సరాల నుండి 60 సంవత్సరాల వయసు కలిగిన జనాభాను శ్రమ చేయగలిగిన జనాభాగా పరిగణిస్తే ఈ గ్రామంలో 72 5 శాతం జనాభా ఈ వయసులకు చెందిన వారు ఉన్నారు అంటే గ్రామంలో 72 శాతం ప్రజలు శ్రమ చేయటానికి వీలైన వయస్సులో ఉన్న జనాభాగా ఉన్నారు గ్రామంలో నాలుగున్నర శాతం వృద్ధులు ఉన్నారు గ్రామ జనాభాలో 54 శాతం మంది యువకులే కావటం విశేషం

**సామాజిక పొందిక**

గ్రామంలో మొత్తం 479 కుటుంబాల్లో 195 (41 శాతం) కుటుంబాలు దళితులు, మరో 189 (39 శాతం) ఎస్టీ కుటుంబాలే. బిసి కుటుంబాలు 75 (16శాతం) వున్నాయి. అగ్రకులాలకు చెందిన కుటుంబాలు కేవలం 3 శాతం మాత్రమే జిల్లాల్లో 2011 జనాభా లెక్కల ప్రకారం సగటు దళిత జనాభా నిష్పత్తి 17 54 శాతంగా ఉంది దీంతో పోల్చి చూస్తే ఈ గ్రామంలో అగ్రకులాల జనాభా చాలా తక్కువగా ఉంది కులాల వారీగా పరిశీలిస్తే 185 కుటుంబాలు కొండతెగలకు చెందిన గిరిజన కుటుంబాలు 109 మాల కుటుంబాలు, 44 మాదిగ కుటుంబాలు ఉన్నాయి. ఒక్కో కుటుంబం గౌడ, మున్నూరుకాపు, రెడ్డి, వెలమ మరియు రాజుల కుటుంబాలు, మూడు కుటుంబాలు గంగపుత్ర, నాలుగు సుగాలి కుటుంబాలు, ఎనిమిది విశ్వబ్రాహ్మణ, తొమ్మిది కుటుంబాలు కమ్మ, 10 కుటుంబాలు కుమ్మరి,17 ముస్లిం కుటుంబాలు 23 యాదవ కులానికి చెందిన

కుటుంబాలు ఉన్నాయి సామాజిక ఆధిపత్యం సంఖ్య రీత్యా చూసుకున్నపుడు దళితులు, కొండ తెగలు ఆధిపత్యం కలిగి ఉన్నారు వీరి తర్వాత చెప్పుకోదగ్గ స్థాయిలో సంఖ్య కలిగిన కులం యాదవులు మిగిలిన కులాలన్నీ గ్రామంలో నామమాత్రంగానే ఉన్నాయి. స్త్రీలు యజమానులుగా 65 కుటుంబాలు (14%) వున్నాయి

### జీవనోపాధి

గ్రామంలో చెప్పుకోదగ్గ రీతిలో ఉపాధి వైవిధ్యం కనిపిస్తుంది సెన్సెస్ సర్వే పత్రంలో ప్రధమ ప్రాధాన్యత కలిగిన ఉపాధి, ద్వితీయ ప్రాధాన్యత కలిగిన ఉపాధి, తృతీయ ప్రాధాన్యత కలిగిన ఉపాధిల గురించిన సమాచారాన్ని తెలుసుకునే ప్రయత్నం చేశాము మొత్తం 35 రకాల ఉపాధి వనరులు గ్రామంలో ఉన్నాయి సెన్సెస్ సర్వేలో వెల్లడించిన వివరాల ప్రకారం 264 కుటుంబాలు సేద్యమే ప్రధాన ఉపాధి అని పేర్కొన్నాయి మొత్తం గ్రామంలోని కుటుంబాల్లో వీరు 51 శాతంగా ఉన్నారు వీరిలో 65 కుటుంబాలు, అంటే సేద్యం ప్రధాన ఉపాధి అని చెప్పిన వారిలో నాల్గోవంతుమంది , వ్యవసాయకూలీ ద్వితీయ ప్రాధాన్యత కలిగిన వృత్తి అని వెల్లడించారు 146 కుటుంబాలు వ్యవసాయ కూలీ ప్రధాన జీవనోపాధి అని చెప్పాయి వీరి నిష్పత్తి మొత్తం కుటుంబాల్లో 30 శాతంగా ఉంది గ్రామంలోని కుటుంబాల్లో ఎనిమిది శాతం కుటుంబాలు (32) కుటుంబాలు వివిధ రకాలైన ఉద్యోగాలు, ప్రభుత్వ ఉద్యోగాలు, ప్రైవేటు ఉద్యోగాలు, స్వయం ఉపాధి పనులపై జీవనోపాధి కోసం ఆధారపడుతున్నట్లు వ్యక్తం చేశాయి అంతే స్థాయిలో వ్యవసాయేతర వృత్తులపై ఆధారపడిన కుటుంబాలు ఉన్నాయి ఏడు కుటుంబాలు వ్యాపారం చేస్తున్నట్లు వెల్లడించారు 11 కుటుంబాలు జీవనోపాధి కోసం సాంప్రదాయ కులవృత్తులపై ఆధారపడుతున్నట్లు సెన్సెస్ సర్వే సందర్భంగా వెల్లడించాయి వీటిలో చేపలు పట్టడం పని 6కుటుంబాలు, కార్పెంటర్స్‌గా నాలుగు కుటుంబాలు వున్నాయి టైలర్స్‌గా ఆరు కుటుంబాలు పనిచేస్తున్నాయి డ్రైవర్స్‌గా 9 కుటుంబాలు వుంటే, ఇందులో ఎస్‌సిలు మూడు, బిసిలు మూడు కుటుంబాలు వున్నాయి గ్రామంలో పెన్షన్‌పై ఆధారపడిన కుటుంబాలు ఏడు వున్నట్లు సర్వేలో తేలింది

### సాగుభూమి

గ్రామంలో మొత్తం 823 ఎకరాల నికర సాగు భూమి నమోదు అయ్యింది ఇందులో 683 ఎకరాలు స్వంత భూమి కాగా మిగిలింది కౌలు భూమి. స్వంత భూమిలో

57 శాతం సాగు భూమికి (394 ఎకరాలకు) ఏదో ఒకరకమైన సాగునీటి వసతి ఉన్నట్లు నిర్ధారణ అవుతుంది మిగిలింది మెట్ట భూమి వంద ఎకరాలు, నికర సాగు భూమిలో ఎనిమిదో వంతు పడావుగా ఉన్నదని నమోదు అయ్యింది 207 ఎకరాలు కౌలు భూమిగా నమోదైంది సర్వేలో నమోదైన నికర సాగు భూమిలో సగానికి సగం కొండ తెగ గిరిజనుల చేతుల్లో సాగవుతోంంది కేవలం 29ఎకరాలు అగ్రకులాల చేతుల్లో ఉంది కౌలుకు చేస్తున్న వారిలో ఎక్కువ విస్తీర్ణం సన్న, చిన్నకారు రైతులే వున్నారు. కౌలుకు ఇచ్చిన భూమి 67 ఎకరాలుగా నమోదైంది కౌలుకు ఇచ్చిన వాళ్లలో ఎక్కువ మంది వ్యవసాయ కార్మికులు వుంటే, కొద్దిమంది సన్నకారు రైతులు వున్నారు కారణం పెట్టుబడి లేకపోవడం ఒక కారణంగా చెప్పవచ్చు

**పశుసంపద**

గ్రామంలో ఎద్దులు 53 కుటుంబాలకు 117 వున్నాయి అన్నీ ఎస్సి, ఎస్టిలకే వున్నాయి ఓసి, బిసి తరగతుల్లో ఒక్కటి కూడా లేకపోవడం గమనించాలి ఆవులు, గేదెలు 96 కుటుంబాలకు237 వుంటే వాటిలో అత్యధిక భాగం ఎస్సి, ఎస్టి తరగతులకే వున్నాయి గొర్రెలు కేవలం 6 కుటుంబాలకు వున్నాయి

**సాగుదారులు - కౌల్దారులు**

గ్రామంలో మొత్తం కౌలుభూమి 207 ఎకరాలు వున్నది మొత్తం నికరసాగు భూమిలో కౌలుభూమి 25శాతం వున్నది కౌల్దార్ల కుటుంబాలు మొత్తం 80 వున్నాయి. సాగుదార్ల కుటుంబాల్లో కౌలుదార్ల శాతం 33 కుటుంబాలు వున్నాయి మొత్తం 261 కుటుంబాలు భూమి కలిగిన కుటుంబాలు కాగా 30 కుటుంబాలు భూమిని కౌలుకు ఇచ్చి ఇతర ఉపాధి వైపు మళ్లినట్లు గణాంకాలు చెప్తున్నాయి కౌల్దార్ల కుటుంబాల్లో 33 మంది స్వంత భూమి లేని కౌల్దారులు కాగా మిగిలిన వారంతా ఎంతో కొంత స్వంత భూమి సేద్యం చేస్తూ అదనంగా భూమిని కౌలుకు తీసుక్నునట్లు వెల్లడవుతోంది కౌల్దారుల్లో 31 మంది గ్రామంలో ఆధిపత్య తరగతి, కొండ తెగలకు చెందిన కుటుంబాలే. వీరి చేతుల్లో 49 ఎకరాల కౌలు మాత్రమే భూమి సాగవుతోంది మరో 24 ఎస్సీ కుటుంబాలు 38 ఎకరాలు కౌలు సేద్యం చేస్తున్నాయి 18బిసి కుటుంబాల చేతుల్లో 77 ఎకరాలు కౌలు సేద్యం చేస్తున్నారు. మిగిలింది ఒసీ కులాల వారు సాగు చేస్తున్నారు ఆర్థిక

తరగతుల వారీ పరిశీలిస్తే ధనిక రైతువర్గం 43 ఎకరాలు, మధ్యతరగతి రైతువర్గం 55 ఎకరాలు, చిన్నకారు రైతువర్గం 65 ఎకరాలు, సన్నకారు రైతులు 44 ఎకరాలను సాగుచేస్తున్నారు

**భూ కేంద్రీకరణ**

గ్రామంలో పైన చెప్పుకున్నట్లు 479 కుటుంబాల్లో 261 కుటుంబాలకు స్వంత భూమి ఉన్నది అంటే మొత్తం గ్రామంలో 55 శాతం కుటుంబాలకు స్వంత భూమి ఉన్నది మిగిలిన 45 శాతం కుటుంబాలకు స్వంత భూమి లేదు స్వంత భూమి మొత్తం 683 ఎకరాలు కాగా ఇందులో గ్రామంలోని మొత్తం కుటుంబాల నిష్పత్తిలో 34 శాతంగా ఉన్న కొండదొరల చేతుల్లో 72 శాతం భూమి కేంద్రీకృతమై ఉంది మిగిలి అన్ని కులాల చేతుల్లో 38 ఎకరాలు కేంద్రీకృతమై ఉంది భూమి కలిగిన పైస్థాయిలో ఉన్న 5 శాతం కుటుంబాల చేతుల్లో అంటే 25 కుటుంబాల చేతుల్లో 166 ఎకరాలు కేంద్రీకృతమై ఉంటే దిగువన ఉన్న 60 శాతం, అంటే 285 కుటుంబాల చేతుల్లో కేవలం 57 ఎకరాలు మాత్రమే ఉంది.

**భూ కేంద్రీకరణ తీవ్రత**

గ్రామంలో సర్వే సందర్భంగా వెల్లడైన నికర సాగు భూమి 823 ఎకరాలు కాగా స్వంత భూమి 683 ఎకరాలు అని పైన చెప్పుకున్నాము భూ కేంద్రీకరణ తీవ్రతను అంచనా వేయటానికి స్వంత భూమిని ప్రమాణంగా తీసుకుని సగటు కుటుంబ కమతం విస్తీర్ణం నిర్ధారించి సగటు కుటుంబ కమంత కంటే ఎక్కువ భూమి కలిగిన కుటుంబాల శాతాన్ని లెక్కించే ప్రయత్నం చేశాము ఈ గ్రామంలో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 1 42 ఎకరాలు అగ్రభాగాన ఉన్న 25 కుటుంబాల చేతుల్లో కేంద్రీకతమై ఉన్న భూమి 166 ఎకరాలు సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 6 64 ఎకరాలు అంటే ఈ కుటుంబాలు గ్రామ కుటుంబ సగటు కమతం విస్తీర్ణం కంటే నాల్గున్నర రెట్లు ఎక్కువ విస్తీర్ణం కలిగి ఉన్నాయి అట్టగున ఉన్న 60 శాతం కుటుంబాల చేతుల్లో ఉన్న భూమి కేవలం 20 ఎకరాలు వీరి సగటు కుటుంబ కమతం 20 సెంట్లు మాత్రమే భూమి లేని కుటుంబాలను పక్కన పెట్టినా భూమి కలిగిన కుటుంబాల్లో సైతం మరో 20 శాతం కుటుంబాలు సగటు కుటుంబ కమతం కంటే తక్కువ విస్తీర్ణంలో స్వంత భూమిని కలిగి ఉన్నాయి ఆర్థిక తరగతుల వారీ భూ కేంద్రీకరణలో వ్యత్యాసాలు ఇలా ఉన్నాయి

టాప్‌న ఉన్న ఐదు శాతం కుటుంబాల చేతుల్లో 26శాతం భూమి కేంద్రీకృతమై వుంటే, క్రిందిస్థాయి 60శాతం కుటుంబాల చేతుల్లో 8శాతం భూమి వున్నది ఒక్క సెంటు భూమి కూడా లేని కుటుంబాలు 46శాతం వున్నాయి

### వర్గపొందిక ఎలా వుంది?

నికర సాగు విస్తీర్ణాన్ని, స్వంత శ్రమ, కూలికి వెళ్లిన శ్రమ వంటి అనేక ప్రమాణాలను మేళవించి గ్రామంలోని కుటుంబాలను వివిధ ఆర్థిక వర్గాలుగా విభజించటం జరిగింది. ధనిక రైతులు 1 5 శాతంగా, మధ్యతరగతి రైతులు 4 5 శాతం, చిన్న రైతులు 20 శాతం, సన్నకారు రైతులు 24 5 శాతం, భూమి కలిగిన వ్యవసాయ కార్మికులు 4 6 శాతం, భూమి లేని వ్యవసాయ కార్మికులు 27 4%, వృత్తి దారులు రెండు శాతం, వ్యవసాయేతర కార్మికులు 3 4%, వ్యాపారస్తులు ఒకటిన్న శాతం, ఉద్యోగులు 4 39 శాతం ఉన్నారు ఇతరులు రెండు శాతం నమోదయ్యారు నికరసాగు విస్తీర్ణం ప్రాతిపదికన ఈ వర్గీకరణ చేశాం వివిధ ఆర్థిక వర్గాల మధ్య నికర సాగు భూమి పంపిణీ ఎలా ఉందో పరిశీలిద్దాం గ్రామంలో 1 5 శాతంగా ఉన్న ధనిక రైతులు తొమ్మిది శాతం భూమి సాగు చేస్తుంటే మధ్యతరగతి రైతాంగం 16 శాతం భూమి సాగు చేస్తున్నారు 20 శాతంగా ఉన్న చిన్న రైతులు 43 శాతం భూమి సాగు చేస్తుంటే 24.5 శాతంగా ఉన్న సన్నకారు రైతులు కేవలం 29 శాతం సాగుభూమి సాగు చేస్తున్నారు ఈ వివరాలు గమనిస్తే ఈ గ్రామంలో ప్రధానంగా సేద్యం చిన్న కమతాల సేద్యంగా వర్గీకరించవచ్చు

### అక్షరాస్యత

గ్రామంలో అక్షరాస్యత 69శాతం వున్నది 2011 జనాభా లెక్కల ప్రకారం జిల్లా, రాష్ట్ర సగటు 66శాతం వున్నది ఈ సగటు అక్షరాస్యతో పోలిస్తే గ్రామంలో చదువుకున్న వారి సంఖ్య ఎక్కువగా వుండటం విశేషం ఓసిలలో 77 శాతం వుంటే, ఎస్‌సిలలో 54శాతం మాత్రమే వున్నది అయితే ఎస్‌సిలలో జిల్లా సగటు కంటే తక్కువ అక్షరాస్యత నమోదైంది ఎస్‌టిలలో జిల్లా సగటు కంటే కాస్త ఎక్కువగానే వున్నది. జిల్లా సగటు 52శాతం వుంటే గ్రామ సగటు అక్షరాస్యత 54శాతం వున్నది ఇక స్త్రీ, పురుషులో అక్షరాస్యతను చూస్తే గ్రామంలో పురుషుల అక్షరాస్యత 65శాతం వుండగా, స్త్రీలలో 54 శాతం వున్నది. దాదాపు 11 శాతం తక్కువ ఎస్‌టిలలో వున్న స్త్రీలలో అక్షరాస్యత బాగా తక్కువగా 48శాతం మాత్రమే వున్నది పురుషుల్లో ఓసి తరగతిలో అత్యధికంగా 77శాతం వుండటం గమనించదగ్గ విషయం.

ప్రాధమిక స్థాయి వరకు చదువుకున్న వారు గ్రామంలో 17 శాతం వున్నారు సెకండరీ విద్యా స్థాయిలో 24శాతం మంది వున్నారు ఇంటర్ వరకు చదువుకున్నవారు 8 శాతం వుంటే, డిగ్రీ స్థాయి చదువుకున్న వారు 7 శాతం వున్నారు పిజి వరకు చదివిన వారు 11 మంది వుంటే, అందులో ఎస్‌సి, ఎస్‌సిలు ఎక్కువ భాగం వుండటం విశేషం పిహెచ్‌డి చేసిన వారు ఎవరూ లేరు

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 26% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 8% భూమి మాత్రమే వుంది. 45% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

### గృహవసతులు-వినిమయ వస్తువులు

స్వంతిళ్లు వున్న కుటుంబాలు 90శాతం వున్నాయి పక్కాఇళ్లు 30 శాతం కుటుంబాలకే వున్నాయి కచ్చాఇళ్లల్లో 60శాతం కుటుంబాలు నివసిస్తున్నాయి పక్కాఇళ్లు ఎస్‌సి తరగతికే ఎక్కువగా వున్నాయి కారణం ప్రభుత్వ పధకాల ద్వారా ఇళ్లు వచ్చివుండొచ్చు ఎస్‌టిలు ఎక్కువగా కచ్చాఇళ్లల్లో వున్నారు అద్దె ఇళ్లల్లో 38 కుటుంబాలు వున్నాయి వీటిలో ఎక్కువ కుటుంబాలు ఎస్‌సి, ఎస్‌టి తరగతులే

ట్రాక్టర్లు గ్రామంలో ఆరు వుంటే అందులో 5 ట్రాక్టర్లు ఓసి, బిసి తరగతులకే వున్నాయి. రైస్‌మిల్లులు రెండూ ఓసి తరగతి వారివే సైకిల్స్ ఎక్కువ భాగం ఎస్‌సి, ఎస్‌టి తరగతికే వున్నాయి. ఓసి, బిసిలకు నామమాత్రంగా వున్నాయి. స్కూటర్స్ చాలా తక్కువ బైక్స్ 52 వున్నాయి దాదాపు అన్ని తరగతులకు ఒకే విధంగా వున్నాయి. కార్లు మూడు వుంటే అన్నీ ఓసి, బిసి తరగతులకే వున్నాయి ఆరు ఆటోలు వున్నాయి. అన్నీ ఎస్‌సి, ఎస్‌టి, బిసి తరగతులకు సమానంగా వున్నాయి టివిలు 57 శాతం కుటుంబాలు కల్గివున్నాయి ఎస్‌టిలలో 46శాతం కుటుంబాలకు వున్నాయి 89శాతం కుటుంబాలకు విద్యుత్ సౌకర్యం వున్నది అన్ని సామాజిక తరగతులకు ఒకే విధంగా వున్నది మరుగుదొడ్ల సౌకర్యం 32శాతం కుటుంబాలకు వున్నది ఓసి కుటుంబాలకు 81శాతం కుటుంబాలకు వుంటే, ఎస్‌టిలకు కేవలం 17 శాతం కుటుంబాలకు మాత్రమే వున్నది సెల్‌ఫోన్‌లు 61 శాతం కుటుంబాల వారు వాడుతున్నారు. ఎస్‌సిలలో 54శాతం కుటుంబాలకే వున్నది వంటగ్యాస్ సౌకర్యం 39 శాతం కుటుంబాలకు వున్నది

# మహబూబ్‌నగర్ జిల్లా

## జమిస్తాపూర్

గ్రామ స్వభావం

సుందరయ్య విజ్ఞాన కేంద్రం 2013-2014 సంవత్సరంలో నిర్వహించిన గ్రామీణ సామాజిక ఆర్థిక అధ్యయనంలో భాగంగా జమిస్తాపూర్ గ్రామాన్ని రెండుసార్లు సందర్శించి అధ్యయనం చేయడం జరిగింది

దక్షిణ తెలంగాణ ప్రాంతంలోని మహబూబ్‌నగర్ జిల్లా తెల్కపల్లి మండలంలో ఈ గ్రామం వుంది. మండల కేంద్రానికి 20 కిలోమీటర్ల దూరంలో ఉంటుంది మండల కేంద్రం కంటే నాగర్‌కర్నూల్ పట్టణం దగ్గరగా 15 కిలోమీటర్ల దూరం లోనే ఉంటుంది గ్రామానికి బస్సు ఉన్నప్పటికీ ప్రధానంగా ప్రయాణం ఆటోల ద్వారానే సాగుతుంది వ్యవసాయానికి సాగునీటి ఆధారం బోరుబావులు, చెరువు ఉన్నప్పటికీ సరిపడు నీటిని అందించలేవు వర్షాలు బాగా పడితేనే ఇవి అందుబాటులోకి వస్తున్నాయి ఈ గ్రామ వ్యవసాయం వర్షాధారం మీదనే ఆధారపడిందని చెప్పవచ్చు గ్రామంలో భూములు ఎర్రమట్టి, నల్లమట్టి మరియు సాధారణ చెలక భూములు ఇలా అన్ని రకాలుగా కలగలిసి ఉన్నాయి. ప్రధానంగా మొక్కజొన్న, ప్రత్తి, వరి పంట పండిస్తున్నారు ఒక ఆర్‌ఎంపి డాక్టరు పక్క గ్రామం నుండి వస్తాడు.

గ్రామంలో ప్రాధమిక, ప్రాధమికోన్నత పాఠశాల ఉన్నది హైస్కూల్ వెళ్ళాలంటే ప్రక్క గ్రామమైన కారువంగకు వెళ్ళాలి. కాలేజీ చదువులకు నాగర్ కర్నూల్ వెళ్ళాలి. గ్రామానికి కాన్వెంట్ స్కూల్ బస్సులు కూడా వస్తున్నాయి ట్రాన్స్ ఫార్మర్, పంచాయితీ ఆఫీసు, అంగన్‌వాడీ కేంద్రం, ప్రజాపంపిణీ కేంద్రం ఉన్నాయి

## గ్రామ జనాభా

గ్రామ జనాభా 807. పురుషులు 421 మరియు స్త్రీలు 386 ఉన్నారు ప్రతి వెయ్యి మంది పురుషులకు 917 మంది స్త్రీలు ఉన్నారు ప్రభుత్వ లెక్కల ప్రకారం రాష్ట్ర లైంగిక నిష్పత్తి 988 వుంటే, జిల్లా నిష్పత్తి 977గా వుంది ఇది రాష్ట్ర ,జిల్లా సగటులతో పోల్చిస్తే చాలా తక్కువ వెనుకబడితరగతులలో అయితే మరీ తక్కువగా 899 మంది స్త్రీలే ఉన్నారు జనాభాలో ఓసీ 16%, ఎస్సీ 38%, వెనుకబడిన తరగతులు 50%, ఎస్టీలు ఒక శాతం కంటే తక్కువగా వున్నారు

## గ్రామ సామాజిక పొందిక

సర్వే ప్రకారం 179 కుటుంబాలు ఉన్నాయి. స్త్రీ యాజమాని గల కుటుంబాలు 28 (16%) వున్నాయి గ్రామంలో కుటుంబాలను పరిశీలిస్తే దళితులు 60, వెనుకబడిన తరగతులు 90, ఓసీలు 28, ఎస్టీలు ఒక కుటుంబం ఉంది కులాల వారిగా చూస్తే మొత్తం 179 కుటుంబాలలో ముదిరాజ్ 14(8%), రజక 12(7%), రెడ్డి 20(11%), బోయ 20(11%), కురుమ 25(14%), మాదిగ 60(34%), వెలమ 5(3%), విశ్వబ్రాహ్మణ 8(4%),వైశ్య, గౌడ్, కుమ్మరి, ముస్లిం(బిసి)2 చోప్పున ఉన్నాయి ఎరుకల వాయి బ్రాహ్మణ, ముస్లిం, 1 చొప్పున ఉన్నాయి ఇతరులు 4(2%) వున్నారు గ్రామం మొత్తంగా చూస్తే హిందువులు 98%, ముస్లింలు 2% కుటుంబాలు ఉన్నాయి

## ప్రధాన జీవన ఆధారం

కుటుంబం గడవడానికి ప్రధాన ఆదాయం యిస్తున్న వృత్తిని పరిశీలిస్తే వ్యవసాయంపై ఆధారపడిన కుటుంబాలు 88 వ్యవసాయ కూలీలు 37, వ్యవసాయేతర కార్మికులు 15, వృత్తిదారులు 10, ఇతరుల వృత్తులు కలిగిన కుటుంబాలు 18 ఉన్నాయి పాలేర్లు 4 ప్రభుత్వ, ప్రయివేటు ఉద్యోగులు 2, కిరాణా, ఇతర వ్యాపారులు 2, కౌలు 1, కాంట్రాక్టరు 1 కుటుంబం చొప్పున వున్నాయి

## పశుసంపద

సర్వే లెక్కల ప్రకారం గ్రామంలో మొత్తం పశుసంపద 621 ఉన్నాయి. గ్రామంలో మొత్తం ఎద్దులు 61 ఉన్నాయి వీటిలో 48 ఎద్దులు బిసిల దగ్గరే ఉన్నాయి. ఇక్కడ వ్యవసాయానికి బిసిలు కొంత వరకు ఎద్దులను ఉపయోగిస్తున్నారని తెలుస్తుంది.

గేదెలు, ఆవుల మొత్తం163 వున్నాయి  వాటిలో ఒసిలకు 70 ఉన్నాయి  ఒసిలలో ఒక కుటుంబం దగ్గరే దాదాపు సగం ఆవులు గేదెలు ఉన్నాయి  గొర్రెలు, మేకలు 82% బిసీల దగ్గరే ఉన్నాయి  వీరు కురుమ కులానికి చెందిన గొర్రెలకాపరులు వృత్తిదారులుగా ఉన్నారు  వీరు కాకుండా బిసిలలో బోయ, ముస్లిం, రజక, విశ్వబ్రహ్మణ, ముదిరాజ్ కులాల చెందినవారు వున్నారు  గొర్రెలు,మేకలు కలిగినవారు ముగ్గురు ధనికరైతులు కాగా మిగిలినవారు మధ్యతరగతి, చిన్న, సన్నకారురైతులు మరియు వృత్తిదారులు వున్నారు  ఇద్దరికి మినహా అందరికి స్వంతభూములు వున్నాయి  ఇద్దరిలో కూడా ఒకరు కౌలు చేస్తున్నారు

**సాగుభూమి**

సర్వేకు అందిన సమాచారం ప్రకారం మొత్తం 756 5 యకరాల భూమి ఉంది  దీనిలో సాగునీటివసతి గల భూమి కేవలం 241 యకరాలు మాత్రమే 515 యకరాలకు నీటి వసతి లేదు  దీనికి వర్షమే ఆధారం  నికరంగా సాగుచేస్తున్న భూమిని పరిశీలిస్తే ఒక్క శాతం కూడా లేని భూస్వాములు 8% భూమిని సాగుచేస్తున్నారు. అలాగే 7% గల ధనికరైతు 29%, భూమి సాగు చేస్తున్నారు  8% లోపే వున్నా పై రెండు వర్గాలు 37% భూమిని సాగుచేస్తున్నారు  63% గల మధ్యతరగతి, చిన్నకారు సన్నకారు రైతులు 62% భూమిని మాత్రమే సాగచేస్తున్నారు  వీరు దాదాపుగా వారి దామాషా ప్రకారం భూమిని కలిగి వున్నారు. 17% గల వ్యవసాయకార్మికులు సాగుచేసేది దాదాపు శూన్యం

**కౌలుసేద్యం**

గ్రామంలో 179 కుటుంబాలలో కౌలు చేస్తున్న కుటుంబాలు 35 ఉన్నాయి వీరు సాగుచేస్తున్న భూమి 200 యకరాలు  7 గురు ధనికరైతులు 82 ఎకరాలు, 17మంది మధ్యతరగతి రైతులు 91 ఎకరాలు కౌలు చేస్తున్నారు  వారి తర్వాత సన్నకారు రైతులు ఉన్నారు  కౌలు భూమిలో 41% ధనికరైతులే తీసుకున్నారు గ్రామంలో కౌలుకు ఇచ్చినవారిలో అత్యధికం వ్యవసాయ కార్మికులే. దీన్నిబట్టి గ్రామంలో రివర్స్ కౌలు అధికంగా ఉన్నట్లు తెలుస్తుంది. ఎందుకంటేవారికి పెట్టుబడి, ఇతర సౌకర్యాలు ఉండటం కలిసివచ్చే అంశం. కౌలుకు చేస్తున్న రైతులు గ్రామంలోనే కాకుండా అనుకూల పరిస్థితి ఉంటే ఇతర గ్రామ పరిధి భూములను కూడా కౌలుకు చేస్తున్నారు

దళిత, బిసిలకు స్వంత భూములు తక్కువ ఉండటం వల్ల ఎక్కువ భూమి కౌలుకు చేస్తున్నది బిసిలు వారి తర్వాత దళితులు ఉన్నారు బిసిలలో కురుమ, బోయ కులాలకు చెందిన వారు ఎక్కువ. కురుమలు వృత్తిరీత్యా గొర్రెలకాపరులు

## వర్గపొందిక

వర్గాలుగా విభజించేటపుడు నికర సాగుభూమి ప్రాతిపదికగా తీసుకొని వర్గాలను నిర్ణయించాం మొత్తం కుటుంబాలలో ఏయే వర్గాలు ఏలా వున్నాయో తెలుసుకుందాం ఆర్థిక తరగతుల వారీ పరిశీలించినపుడు మొత్తం కుటుంబాల్లో భూస్వాములు ఒక్కశాతంలోపే వున్నారు ధనికరైతులు 7, మధ్యతరగతి రైతాంగం 13, చిన్నకారురైతులు 23, సన్నకారురైతులు 27, శాతం చొప్పున వున్నారు అలాగే వ్యవసాయకార్మికులు 17శాతం, వ్యవసాయేతరకార్మికులు 4శాతం వుంటే వృత్తిదారులు, ప్రభుత్వఉద్యోగులు, ఇతరులు 2శాతం చొప్పున వున్నారు

## భూ కేంద్రీకరణ

గ్రామంలో భూకేంద్రీకరణను పరిశీలించాం భూకేంద్రీకరణకు ప్రాతిపదికగా స్వంత భూమిని తీసుకున్నాం భూమి కల్గివున్న పైస్థాయి 5% కుటుంబాల చేతిలో 30% భూమి వుండగా, చివరి 60% కుటుంబాల చేతిలో కేవలం 22% భూమి మాత్రమే వుంది ఇదే సందర్భంలో 13% కుటుంబాలకు సెంటుభూమి లేదు గ్రామంలోని స్వంత భూమి కల్గిన వర్గాలను పరిశీలిస్తే ఎక్కువ భూమి ఏ వర్గాల చేతుల్లో బందీ అయిఉందో చూపవచ్చు ఒక్క శాతం లోపుఉన్న భూస్వాములు 9% భూమిని కలిగి ఉన్నారు 7% ఉన్న ధనిక రైతులు 23% భూమి కలిగిఉన్నారు 8% లోపు ఉన్న పై ఈ రెండు వర్గాలు గ్రామంలో 32% భూమి వీరి నియంత్రణలోనే ఉంది మధ్యతరగతి, చిన్నకారు, సన్నకారురైతులు కలిపి 63శాతం వుంటే 49శాతం భూమిని మాత్రమే కలిగివున్నారు 17% గల వ్యవసాయ కార్మికులు కేవలం 7% భూమిని కలిగివున్నారు. 4% గల వ్యవసాయేతర కార్మికులు మరియు వృత్తిదారులు, ప్రభుత్వ ఉద్యోగులు, ఇతరులు ఒక్కొక్కరు 2% పైగా ఉన్నప్పటికీ వీరికి ఒక్కొక్క తరగతికి 1% లోపు భూమియే ఉంది

సామాజికతరగతుల వారిగా పరిశీలిస్తే ఎక్కువ భూమి ఏ సామాజిక తరగతి నియంత్రిస్తున్నదో చూడవచ్చు 34% ఉన్న ఎస్సీలు 19% భూమిని మాత్రమే కలిగివున్నారు వెనుకబడిన తరగతులు 50% ఉంటే 42% భూమినే కలిగివున్నారు 16% ఉన్న ఓసీలకు మాత్రం అందరికంటే అత్యధికంగా 39% భూమిని నియంత్రిస్తుండడం చూడవచ్చు దీన్ని బట్టి దళితులలో మరియు బలహీన వర్గాలలో

అత్యధికులు, మరియు మధ్య, చిన్న, సన్నకారు రైతులు, వ్యవసాయ కార్మికులు, వృత్తిదారులు, వీరందరూ వారి శ్రమను అమ్ముకునేవారే

**అక్షరాస్యత**

గ్రామంలో అక్షరాస్యత 53% ఉంది ఇది పురుషులలో 60%ఉంటే, స్త్రీలలో 46%మాత్రమే ఉంది ప్రభుత్వ లెక్కల ప్రకారం రాష్ట్ర సగటు అక్షరాస్యత 66శాతం జిల్లా సగటు 51% వుంది రాష్ట్రసగటుతో పోలిస్తే బాగా తక్కువగా వుంటే, జిల్లా సగటుకు దగ్గరగా వున్నది దళితులలో 43% అక్షరాస్యులు ఇది జిల్లాలోని ఎస్సీల అక్షరాస్యత 48% కంటే తక్కువగా ఉంది బిసిలలో అక్షరాస్యత 53% గ్రామ అక్షరాస్యతకు సమానంగా జిల్లా అక్షరాస్యతకు కొద్దిగా ఎక్కువ, రాష్ట్రానికి తక్కువగా ఉంది అగ్రకులాలలో 74% అక్షరాస్యులు ఉన్నారు. ఇది జిల్లానే కాదు, రాష్ట్ర అక్షరాస్యత కంటే కూడా ఎక్కువే. స్త్రీల అక్షరాస్యతలో దళితులు 37% తో చాలా వెనకబడి వున్నారు.

పదవతరగతి చదివినవారిని పరిశీలిస్తే ఎస్సీలలో 14%, బిసిలలో 20%, ఉంటే ఒసిలలో 28% ఉన్నారు ఇది దళితులకంటే రెండు రెట్లు ఎక్కువ అలాగే ఇంటరు చదివిన వారు ఒసిలలో బిసిల కంటే రెండు రెట్లు , ఎస్సీల కంటే 3 రెట్లు అధికం. పిజి చదివిన వారిని చూస్తే ఎస్సీలలో పూర్తిగానే లేకపోగా, బిసిలలో చాలా నామమాత్రంగా ఉన్నారు ఒసీలలో మాత్రం 3% ఉన్నారు మనం పైన చెప్పుకున్నట్లు ఆదాయ ముఖ్యవనరు అయిన భూమి అధికంగా ఉండటం వల్లే ఒసిలకు ఇది సాధ్యమైంది భూమి సరిపడినంత లేకపోవడం ఇతర ఆదాయ వనరులు కూడా నామమాత్రంగా ఉండటం వల్ల దళితులు, బిసిలు చదువులో వెనుకబడ్డారు

**ఆయుఃప్రమాణం**

గ్రామంలో పని చేయగల వయస్సు 16 నుంచి 60 మధ్య గలవారు 65% ఉన్నారు అదేవిధంగా 16 నుండి 40 సంవత్సరాలు గల యువత 45శాతం వున్నారు. వీరు షెడ్యూల్ కులాలు, వెనుకబడిన తరగతులలో సమానంగా 46% ఉండగా, ఓసీలలో కొంతతక్కువ ఉన్నారు 70 సంవత్సరాలకు పైబడి ఉన్నవారు గ్రామంలో 2% ఉన్నారు సామాజిక తరగతుల వారిగా పరిశీలిస్తే ఎస్సీలలో కేవలం 1%, మాత్రమే ఉన్నారు బిసిలలో కూడా 1 40%, ఒసిలలో 6% ఉన్నారు ఇది ఎస్సీల కంటే 6 రెట్లు మరియు బిసిల కంటే 4 28 రెట్లు ఎక్కువ 60 నుండి 70 సంవత్సరాల మధ్య వారిని చూసినా ఇదే విధమైన తారతమ్యాలు కనిపిస్తున్నాయి దీనికి కూడా వారి ఆర్థికస్థితి మూలకారణం

మౌలిక సౌకర్యాలు

గృహ వసతి స్వభావాన్ని పరిశీలిస్తే గ్రామంలో 80% కుటుంబాలకు పక్కా ఇండ్లు ఉన్నాయి ఇవి సామాజిక తరగతుల వారిగా దళితులు, వెనుకబడిన తరగతులకు దాదాపు సమానంగా 78% చొప్పున ఉన్నారు ఒసీలలో మాత్రం 89% కుటుంబాలు పక్కా ఇండ్లు కలిగి ఉన్నారు. మరుగుదొడ్డి సౌకర్యం గ్రామంలో కేవలం 23% కుటుంబాలకే ఉంది ఇది ఒసీలలో 68%, బిసిలలో 21%, దళితులలో చాలా నామమాత్రంగా 7% కుటుంబాలకు మాత్రమే మరుగుదొడ్డి సౌకర్యం వున్నది వంటగ్యాస్ సౌకర్యం గల కుటుంబాలు కూడా గ్రామంలో 24% మాత్రమే ఉన్నాయి ఈ సౌకర్యం ఒసీలలో 71%, వెనుకబడిన తరగతులలో 21%, దళితులలో 7 కుటుంబాలకు మాత్రమే ఉంది దళిత, బిసిలలో నెలనెలా వంటగ్యాస్‌కు ఖర్చులు కూడా వారి ఆర్థిక స్థితి వల్ల వెనకాడుతున్నారు అందుకే ఆర్థికస్థితి మెరుగ్గా ఉన్న ఓసీలు ఈ సౌకర్యం ఎక్కువ కుటుంబాలు కలిగి ఉన్నాయి

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 30% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 22% భూమి మాత్రమే వుంది. 13% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

మొత్తం ట్రాక్టర్లు 7 వున్నాయి ట్రాక్టర్ సౌకర్యం గల కుటుంబాలు ఒక్కటి (ఎస్‌సి - మాదిగ) మినహా అన్ని అగ్రకులాలకు చెందినవే అని సర్వే నిర్ధారణలు నిరూపిస్తున్నాయి ట్రాక్టరు సౌకర్యం గలవారు భూస్వామ్య, ధనిక, మధ్య, చిన్నకారురైతులు కూడా వున్నారు వీరిలో ఎస్‌సి కౌలుచేస్తున్న (ధనిక) రైతు. రైస్‌మిల్ కలిగిన వారు ఒకరు రెడ్డి (ఒసి) కులానికి చెందినవారు

స్కూటర్, మోటారు సైకిల్ సౌకర్యం అగ్రకులాలలో 50% కుటుంబాలకు ఉంది దళితులలో కేవలం 12 కుటుంబాలకు మరియు ఎస్సీల కంటే వెనుకబడి బిసిలకు కేవలం 10% కుటుంబాలకు మాత్రమే ఈ సౌకర్యం కలిగి వున్నారు. కారు సౌకర్యం అగ్రకులాలలో 11% కుటుంబాలకు ఉంది ఇతరులకు ఎవరికీ లేవు కార్లు వున్నవారు భూముల కలిగి వుండటంతోపాటు కంట్రాక్ట్ పనులు, వ్యాపారాలు చేస్తూన్నారు టి వి సౌకర్యం గల కుటుంబాలు గ్రామంలో 53% మాత్రమే ఉన్నాయి. సామాజిక తరగతులుగా చూస్తే ఒసీ కుటుంబాలలో 86% కుటుంబాలకు ఈ సౌకర్యం ఉంటే, బిసిలలో 58%, దళితులలో కేవలం 30% కుటుంబాలకు మాత్రమే టీవీ సౌకర్యం వుంది

# మెదక్ జిల్లా

## మాయికోడ్

సుందరయ్య విజ్ఞాన కేంద్రం నిర్వహించిన గ్రామీణ ఆర్థిక, సామాజిక సర్వేలో భాగంగా మెదక్ జిల్లా మాయికోడ్ గ్రామ సర్వే 2013 డిశంబరు నెలలో తొలి దఫా, 2014 జూన్‌లో మలి దఫా సర్వే నిర్వహించాము ఈ గ్రామం మనూర్ మండలంలో, మండల కేంద్రానికి 15కి మీ. దూరంలో వుంది ఈ గ్రామానికి దగ్గరగా 20 కి.మీ దూరంలో వున్న పట్టణం నారాయణఖేడ్. జాతీయ రహదారి యన్ హెచ్44 సమీపంలో వుంటుంది దగ్గర ప్రయాణాలకు బస్సులు, ఆటోలు వాడతారు గ్రామానికి విద్యుత్ సరఫరా, రక్షిత మంచినీటి పథకము, ప్రజాపంపిణి కేంద్రం, ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలలు, అంగన్‌వాడీ కేంద్రం, పంచాయితి భవనం వున్నాయి. గ్రామానికి ఫ్లోరైడ్ సమస్య వుంది

గతకాలపు సామాజిక వ్యవస్థ దోపిడీ రూపాలు కొనసాగుతున్నాయి ప్రతి పనికి చెల్లింపులు ధాన్యరూపంలోనే వున్నాయి. యంత్రాల అద్దె కూడా అనేక సందర్భాల్లో ధాన్యరూపంలోనే చెల్లించబడుతున్నది ప్రత్తి సాగుకు సంబంధించిన దున్నకం పనులు చేసిన వారికి పత్తి దిగుబడిలో 25శాతం యిస్తున్నారు యంత్రాలు కూడా యెక్కువగానే వాడుతున్నారు పెత్తందారీతనం చాలా యెక్కువగా వున్నట్లు చెప్పారు రెండు గ్లాసుల పద్ధతి, వివక్ష అమలు జరుగుతూ వుంది వలసలు యెక్కువగా వున్నాయి. కూలిపనులు దొరక్కపోతే పస్తులు అనివార్యమని చెప్పారు

**జనాభా**

గ్రామ జనాభా 1736 అందులో పురుషులు 927 మంది స్త్రీలు 809 మంది వున్నారు. స్త్రీ,పురుష నిష్పత్తి 873 అంటే, ప్రతి 1000 మంది పురుషులకు 873 స్త్రీలు

వున్నారు స్త్రీల సంఖ్య చాలా తక్కువగా వుంది 2011 ప్రభుత్వ లెక్కల ప్రకారం మెదక్ జిల్లాలో ఈ నిష్పత్తి 1000 రాష్ట్రంలో అది 988 సామాజిక తరగతుల వారీగా పరిశీలిస్తే ఒ సి లలో స్త్రీ,పురుష నిష్పత్తి అందరికంటె యెక్కువగా 910 వుంది అయినా యిది రాష్ట్ర, జిల్లా నిష్పత్తులకంటె తక్కువే ఈ గ్రామంలో యస్ సి, యస్ టి లలో ఈ నిష్పత్తి చాలా తక్కువగా 874, 762గా వుంది

**సామాజిక తరగతుల పొందిక**

గ్రామంలో మొత్తం కుటుంబాలు 357 గ్రామాన్ని సామాజిక తరగతుల వారీగా విభజిస్తే ఇక్కడ యస్ సి , యస్ టి., బి సి మరియు ఒ.సి లు వరుసగా 88, 27, 216 మరియు 26 కుటుంబాలు వున్నాయి శాతాల వారీగా చూస్తే యస్ సి లు 25శాతం, యస్.టి లు 8 శాతం, బి సి లు 61 శాతం, ఒ సి లు 7 శాతం కుటుంబాలవారున్నారు గ్రామంలో బిసిలే అత్యధికంగా వున్నారు యస్.సి.లు రాష్ట్రంలో 15 శాతం, మెదక్ జిల్లాలో 18 శాతం వుండగా ఈ గ్రామంలో వారు యింకా యెక్కువగా 25 శాతం కుటుంబాల వారున్నారు అట్లాగే యస్ టి లు కూడా ఈ గ్రామంలో ఎక్కువే మెదక్ జిల్లాలో వారు 6శాతం వుండగా ఇక్కడ 8 శాతం వున్నారు అత్యధికంగా 94 శాతం హిందువులే వున్నారు క్రైస్తవులు 5 6 శాతం, ముస్లింలు 0 56%కుటుంబాలు వున్నాయి

కులాల వారీగా చూస్తే సంఖ్య రీత్యా యెక్కువగా మాల కుటుంబాలు వున్నాయి 54 మాల, 41 లంబాడ, 35 ముదిరాజు, 34 మాదిగ కుటుంబాలు వున్నాయి మిగిలిన కులాలు యాదవ, రెడ్డి, నాయీ బ్రాహ్మణ, పద్మసాలి, రజక, విశ్వబ్రాహ్మణ, ముస్లిం, మున్నూరు కాపు, కురుమ, గౌడ, యితర కులాలు వున్నాయి

**జీవనోపాధులు**

మొత్తం 357 కుటుంబాల్లో సేద్యంపై అధారపడ్డ కుటుంబాలు 229 మొత్తం కుటుంబాల్లో 64శాతం వ్యవసాయ కార్మిక కుటుంబాలు 34 పది శాతం కంటే తక్కువ వ్యయసాయేతర ఉపాధిపై అధారడపడ్డ కుటుంబాలు 53 అంటే అవి దాదాపు 19 శాతం కుటుంబాలు 14 కుటుంబాలు వివిధ ఉద్యోగాలు చేస్తున్న కుటుంబాలు ఉన్నాయి. 10 కుటుంబాలు వృత్తిదారులు, తొమ్మిది కుటుంబాలు వ్యాపారస్తులు ఉన్నాయి. గ్రామంలో మహిళల యాజమాన్యంలో వున్న కుటుంబాలు 44 లేదా 12 శాతం

## విద్య

ఈ గ్రామంలో అక్షరాస్యులు 52శాతం మంది వున్నారు పురుషులలో అది 60శాతం వుంటే స్త్రీలలో అది 41శాతం మాత్రమే వుంది అక్షరాస్యతలో బి.సి లే ముందున్నారు. బి సి లలో అక్షరాస్యత 57శాతం, ఒ సి లు 53శాతం, యస్ సి.లు 44శాతం, అందరికంటె తక్కువ యస్ టి లలో అది 38శాతం మాత్రమే వుంది మొత్తం మీద స్త్రీలలో 41శాతం అక్షరాస్యులు వుంటే యస్ సి, యస్ టి స్త్రీలలో అది మరింత తక్కువగా 32శాతం, 30శాతం మాత్రమే వుంది కాని రాష్ట్రంలో ప్రభుత్వ లెక్కల ప్రకారం అక్షరాస్యత 67శాతం, మెదక్ జిల్లాలో అది 61శాతం వుంది కాబట్టి రాష్ట్రంలో యీ జిల్లా అక్షరాస్యతలో వెనకబడి వుంటే, యీ జిల్లాలో యీ గ్రామం యింకా వెనకబడి వుంది అంతేకాదు యస్ సి,యస్ టిల అక్షరాస్యతలో కూడా యీ గ్రామం జిల్లా సగటు కంటె వెనకబడే వుంది జిల్లాలో యస్ సి,యస్.టి.ల అక్షరాస్యత 53శాతం, 45శాతం వుంటే గ్రామంలో యింకా తక్కువగానే వున్నాయి

10 తరగతి వరకు చదివిన వాళ్లు గ్రామంలో 21శాతం వున్నారు వారిలో బి.సి లు 25శాతంతో అందరికంటె ముందు వున్నారు అందరికంటె తక్కువ 14శాతం యస్ టి, యస్ సి లలో వున్నారు డిగ్రీ చదువులు చదివినవారు, 5శాతం వున్నారు ఇందులో ఒ.సి లు, బి సి.లు 6శాతంతో సమానంగా వున్నారు కాని గ్రామంలో 10వ తరగతి నుండి డిగ్రీకి వచ్చేటప్పటికి చదివినవారి శాతం 21 నుండి 5 శాతానికి పడిపోవడం గమనించవచ్చు పై చదువులు ప్రజలకు యెంత దూరమైపోయాయో దీనిని బట్టి అర్ధమౌతుంది పోస్టుగ్రాడ్యుయేట్ చదువులు చదివినవారు యింకా తక్కువ. వారు గ్రామంలో 0.35శాతం మాత్రమే వున్నారు. ఈ చదువులు చదివినవారు యస్.సి లలోనే మిగిలిన తరగతులకంటె ఎక్కువ కనిపిస్తున్నారు ఈ గ్రామంలో పి హెచ్ డి చేసిన వారు ఎవరూ లేరు.

## ఆయు ప్రమాణం

16 నుండి 60 సంవత్సరాల వరకు పని చేసే వయస్సు అనుకుంటే ఆ వయస్సులో వున్నవారు గ్రామంలో 67శాతం వున్నారు. అంటే మూడింట రెండువంతుల జనాభా పనిలో వున్నట్లు అవుతుంది 16 సంవత్సరాలనుండి 40సంవత్సరాల వయసుగల యువకులు 47శాతం వున్నారు. 10నుండి 20, 20నుండి30 ఈ విధంగా పది

సంవత్సరాల వ్యవధిలో వున్న వారిని పరిశీలిస్తే వారి సంఖ్య ప్రతి 10 సంవత్సరాల వ్యవధిలో 40 సంవత్సరాల వయస్సు వచ్చే వరకు దాదాపు 20 శాతంగా నమోదైంది తరువాత అది క్రమంగా 14 శాతం, 10 శాతం, 8శాతం, 5 శాతం – ఇట్లా తగ్గిపోతూ వచ్చింది 70 సంవత్సరాలు పైబడి వయస్సు గలవారు యస్.టి లలో 2శాతం వుంటే, బి సి లలో 1 66 శాతం, యస్ సి.లలో 1 62 శాతం, అందరికంటె తక్కువగా ఒ సి లలో 0 78 శాతం వున్నారు ఈ క్రమం మిగిలిన గ్రామాలకంటే భిన్నంగా వుంది

## వ్యవసాయం

మొత్తం 1208 49 ఎకరాల సాగు భూమి స్వంత యాజమాన్యం కింద నమోదైంది అందులో 153 8ఎకరాలకు, అంటే 13శాతం భూమికి మాత్రమే సాగునీరు అందుతుంది. మిగిలినదంతా వర్షాధారభూమే. సాగునీటికి కొద్దిగా బావులు, బోరుబావులు వున్నాయి సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 3 38 ఎకరాలు 1328 34 ఎకరాలు నికర సాగు భూమిగా నమోదైంది. యిది స్వంత భూమి 1208 49 ఎకరాలకంటె యెక్కువరాకూడదు ఎక్కువ వచ్చింది కాబట్టి కౌలుకిచ్చిన వారు కొంతమంది కౌలుకిచ్చినట్లుగా చెప్పలేదని అనుకోవాలి భూమిలేని కుటుంబాలు 74 లేదా 21శాతం కౌలు సేద్యం కింద ఉన్న భూమిలో 110.5 ఎకరాలు మెట్ట, మిగిలింది మాగాణి భూమి. గ్రామంలో పత్తి, మొక్కజొన్న, చెరకు, వరి, పెసర, కంది, మినుము పంటలు పండిస్తారు యాంత్రీకరణ ఎక్కువగా వుంది. వర్షాధార భూములు కాబట్టి వ్యవసాయంలో నష్టాలు ఎక్కువగా వస్తున్నాయని చెబుతున్నారు కొద్దో, గొప్పో భూమి కలవాళ్లు కూడా దానిని వదలి పట్టణాలకు వలస పోతున్నారు. కరువు కాలాల్లో కూలీలు పస్తులు తప్ప వంటున్నారు ఇది బాగా వెనకబడ్డ గ్రామం

## ఆర్థిక తరగతులు

ఈ గ్రామంలో 357 కుటుంబాలను సాగుభూమి, శ్రమల ఆధారంగా 9 ఆర్థిక తరగతులుగా విభజించటం జరిగింది. సేకరించిన సమాచారం ప్రకారం భూస్వాములు లేరు. 9 లేదా 2 5శాతం ధనిక రైతు కుటుంబాలు, 39లేదా 11శాతం మధ్య తరగతి, 97 లేదా 27శాతం చిన్నకారు, 117 లేదా 33శాతం సన్నకారు రైతు కుటుంబాలు వున్నాయి అవిగాక 11 లేదా 3శాతం భూమిగల వ్యవసాయ కార్మిక కుటుంబాలు, 30 లేదా 8 శాతం భూమిలేని వ్యవసాయ కార్మిక కుటుంబాలు, 25 లేదా 7 శాతం

వ్యవసాయేతర కార్మిక కుటుంబాలు వున్నాయి వీరుగాక వృత్తిదార్లు, ప్రయివేటు మరియు ప్రభుత్వ వుద్యోగులు, వ్యాపారులు, యితరులు - వీరంతా కలిసి 29 లేదా 8శాతం కుటుంబాల వారున్నారు

ఈ గ్రామంలో మధ్య తరగతి, చిన్నకారు, సన్నకారు రైతులు కలిసి 71 శాతం కుటుంబాలు వున్నాయి కాని యిక్కడ ప్రధానంగా శ్రమశక్తిని అమ్ముకొని బ్రతికే కుటుంబాలు చాలా తక్కువగా 18శాతం కుటుంబాలు మాత్రమే వున్నాయి కాని కూలి పనులు చేసే కుటుంబాలు సన్నకారు, చిన్నకారు రైతుల్లో యెక్కువగా వున్నాయి (కౌలు రైతులు కూడా రైతాంగంలో కలిసే వున్నారు ) ఈ కుటుంబాలన్నిటినీ కలిపితే అప్పుడు వ్యవసాయ కార్మిక కుటుంబాలు మొత్తం కుటుంబాలలో సగమైనా వుంటాయి మొత్తం కుటుంబాలను వ్యవసాయ, వ్యవసాయేతర కుటుంబాలుగా విభజిస్తే వ్యవసాయ కుటుంబాలు 303 లేదా 84 8శాతం, మిగిలినవి వ్యవసాయేతర కుటుంబాలు అంటే వ్యవసాయేతర కుటుంబాలు 54 లేదా 15శాతం అవుతాయి

**కౌలు సేద్యం**

కౌలు చేస్తున్న కుటుంబాలు 61 వున్నాయి. మొత్తం కుటుంబాల్లో వీరు 17 శాతం. వ్యవసాయదార్ల కుటుంబాల్లో 23శాతం వున్నారు వీరు 238 ఎకరాలు కౌలు సేద్యం చేస్తున్నారు చిన్నకారు రైతులు 92 ఎకరాలు సాగుచేస్తుంటే, మధ్యతరగతి రైతులు 66ఎకరాలు, ధనిక రైతులు 50 ఎకరాలు, సన్నకారు రైతులు 30 ఎకరాలు కౌలుచేస్తున్నారు. సామాజిక తరగతుల వారీగా చూస్తే మొత్తం కౌలురైతుల్లో బిసిలు 36 కుటుంబాలు 129 ఎకరాలను కౌలుకు చేస్తున్నారు ఇందులో 15కుటుంబాలు సన్నకారు రైతులే ఎస్సిలు 15 కుటుంబాలు 66 ఎకరాలు, ఎస్టిలు ఏడు కుటుంబాలు 29 ఎకరాలు, ఓసిలు ముగ్గురు 13 ఎకరాలు కౌలుసాగు చేస్తున్నారు. కౌలురైతుల్లో ఎక్కువ కుటుంబాలు బిసి తరగతులే వున్నాయి

**భూ కేంద్రీకరణ**

ఎగువన ఉన్న ఐదు శాతం కుటుంబాల్లో 23శాతం భూమి వుంటే దిగువన ఉన్న 60శాతం కుటుంబాలకు 20శాతం భూమి వుంది గ్రామంలో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 3.38 ఎకరాలు కాగా ఎగువన ఉన్న ఐదు శాతం కుటుంబాల్లో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 15 71 ఎకరాలు దిగువన ఉన్న 60 శాతం కుటుంబాల్లో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 1 10 ఎకరాలు మాత్రమే ఎగువన ఉన్న ఐదు శాతం

కుటుంబాల్లో ఒకే ఒక్కటి రెడ్డి కులానికి చెందినది కాగా ఒకటి మాదిగలు, నాల్గు సుగాలి కుటుంబాలు మిగిలినవి వెనకబడిన తరగతులకు చెందిన కుటుంబాలు

మొత్తం స్వంత భూమిలో 11శాతం భూమి మాత్రమే ధనిక రైతుల స్వంత భూమిగా వుంది దానికి తోడు యీ గ్రామంలో భూస్వాములు లేరని లెక్కలు చెబుతున్నాయి ప్రధానంగా యీ రెండు వర్గాల వద్దనే భూమి కేంద్రీకరణ జరుగుతుంది. అలాంటిదేమి యీ గ్రామంలో కనిపించలేదు దానికి తోడు మధ్య తరగతి, చిన్నకారు, సన్నకారు రైతులు కలిసి 71శాతం కుటుంబాలవారు వున్నారు వారికున్న స్వంత భూమి మొత్తం భూమిల్లో 81శాతం వుంది అంటే నూటికి 81ఎకరాలు 71శాతం కుటుంబాలుగల పేద రైతుల మధ్యనే పంపిణి అయింది మరొక ప్రక్క యీ గ్రామంలో భూమిలేని కుటుంబాలు కూడా 21శాతం వున్నాయి. దీనిని బట్టి యీ గ్రామంలో భూకేంద్రీకరణ పెద్దగా వుందని చెప్పలేము

**వసతులు – ఆర్థిక తరగతులు**

స్వంత యిళ్లు దాదాపు అందరికి వున్నాయి భూమిలేని వ్యవసాయ కార్మికుల్లో 80శాతం కుటుంబాలకు, వ్యవసాయేతర కార్మికుల్లో కూడా 80శాతం కుటుంబాలకు మాత్రమే స్వంత యిళ్లు వున్నాయి మిగిలిన 20శాతం కుటుంబాలకు లేవు పక్కా ఇళ్లు మాత్రం ధనిక రైతులు, మధ్య తరగతి రైతులకు మిగిలిన తరగతులకంటె యెక్కువగా వున్నాయి అవి ధనిక రైతులకు 78శాతం, మధ్య తరగతి రైతులకు 77శాతం కుటుంబాలకు వున్నాయి భూమిలేని వ్యవసాయ కార్మికులలో అవి 50శాతం కుటుంబాలకే వున్నాయి వ్యవసాయేతర కార్మికులకు అవి 44శాతం కుటుంబాలకు మాత్రమే వున్నాయి

స్కూటర్లు, మోటారుసైకిళ్లు కలిసి యీ గ్రామంలో 61కుటుంబాలకు వున్నాయి అంటే 17శాతం కుటుంబాలకు మాత్రమే వున్నాయి కాని ధనిక రైతులకు ఇవి 56 శాతం కుటుంబాలకు వున్నాయి భూమిలేని వ్యవసాయ కార్మికులు, వ్యవసాయేతర కార్మికులకు మాత్రం 3శాతం మరియు 8శాతం కుటుంబాలకు మాత్రమే వున్నాయి టి వి లు భూమిలేని వ్యవసాయ కార్మికులలో 20శాతం కుటుంబాలకు, వ్యవసాయేతర కార్మికులలో 16శాతం కుటుంబాలకు మాత్రమే వున్నాయి

లెట్రిన్ సౌకర్యం గ్రామంలో చాలా తక్కువగా కేవలం 12శాతం కుటుంబాలకు మాత్రమే వుంది భూ మిలేని వ్యవసాయ కార్మికులకు ఈ సౌకర్యం పూర్తిగా లేదు

### వసతులు - సామాజిక తరగతులు

భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 23% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 20% భూమి మాత్రమే వుంది. 21% కుటుంబాలకు సెంటు భూమి లేదు.

90శాతం కుటుంబాలకు మించే స్వంత యిళ్లు అన్ని తరగతులకు వున్నాయి పక్కా ఇళ్లలో మాత్రం తేడాలు వున్నాయి యస్ టి లలో అత్యధికంగా 78శాతం కుటుంబాలకు పక్కా ఇళ్లు వున్నాయి అత్యల్పంగా ఒ.సి లలో 46శాతం కుటుంబాలకు మాత్రమే వున్నాయి ఆవులు, గేదెలు ఒ.సి లలో 54శాతం కుటుంబాలకు వున్నాయి అత్యల్పంగా యస్ సి లలో 22 శాతం కుటుంబాలకు మాత్రమే వున్నాయి స్కూటర్లు, మోటరుసైకిల్లు కలిసి 17శాతం కుటుంబాలకు వున్నాయి అందులో 22శాతం కుటుంబాలతో యస్ టి లు ముందు వున్నారు ఒ.సి లలో 8శాతం కుటుంబాలకు మాత్రమే వాహనాలు వున్నాయి ఆటోలు గ్రామంలో 8 వున్నాయి అందులో సగం బి సి లకే వున్నాయి టి వి లు బి సి.లలో ఎక్కువ కుటుంబాలకు అంటే 54% కుటుంబాలకు వున్నాయి అవి యస్ సి లకు 34% మాత్రమే. గ్రామం మొత్తం మీద కూడా టి.వి లు తక్కువగానే 47% కుటుంబాలకు మాత్రమే వున్నాయి విద్యుత్ సరఫరా 86% కుటుంబాలకు వుంది ఒ సి, బి.సి. కుటుంబాలకు 90శాతానికి పైగా యస్ సి, యస్.టి.లలో 70% కుటుంబాలకు పైగా ఈ సౌకర్యం వుంది సెల్‌ఫోన్లు 80% కుటుంబాలకు వున్నాయి. దీనిలో కూడా ఒ సి, బి సి లు ముందు వున్నారు. యస్.సి లలో 67% కుటుంబాలకే వుంది.

లెట్రిన్ సౌకర్యం చాలా తక్కువగా 12% కుటుంబాలకే వుంది మిగిలిన తరగతులకంటే 17శాతంతో బి సి లే కొంత మెరుగ్గా వున్నారు వంట గ్యాస్ కల్గివున్న కుటుంబాలు తక్కువే 34శాతానికి మాత్రమే వుంది ఇక్కడ కూడా 47శాతంతో బి.సి లే కొంత మెరుగ్గా వున్నారు. యస్ టి లకు అత్యల్పంగా 4% కుటుంబాలకు మాత్రమే వుంది.

# కరీంనగర్ జిల్లా

## నందారం

**ముఖచిత్రం**

సుందరయ్య విజ్ఞాన కేంద్రం 2013-14 లో నిర్వహించిన గ్రామీణ సామజిక ఆర్థిక సర్వేలో భాగంగా కరీంనగర్ జిల్లా నందారం గ్రామాన్ని 2013 డిసెంబరులో తొలి విడత, 2014 ఫిబ్రవరిలో మలి విడత సర్వే చేయటం జరిగింది గ్రామాన్ని సెన్సెస్ మరియు శాంపిల్ సర్వే చేశాం సెన్సస్ సర్వేలో వెల్లడైన అంశాలను పేర్కొంటున్నాం

ఉత్తర తెలంగాణ ప్రాంతంలోని కరీంనగర్ జిల్లా హుస్నాబాద్ మండలంలో నందారం గ్రామం వున్నది మండల కేంద్రం 18 కిలోమీటర్ల దూరంలో వుంటుంది ఈ గ్రామం ఏడు లంబాడీతండాల సముదాయంగా వుంటుంది అలాగే ఒక దళిత కాలనీ, అగ్రకుల నివాసాలు ఇమిడి వుంటాయి అన్నింటికంటే పెద్ద తండా కఫ్రునాయక్ తండా మొత్తం గ్రామంలో ఎస్టీ సామాజిక తరగతి ఎక్కువగా వున్నది గతంలో ఈ గ్రామం పరిధిలోనే పోతారం, ధర్మారం గ్రామాలు కూడా వుండేవి ప్రస్తుతం వాటిని సెపరేట్ చేశారు. బస్సు, ఆటోలు రవాణా సౌకర్యంగా వున్నాయి గ్రామంలో పోస్టాఫీసు, విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్, రక్షిత మంచినీటి పథకం, ప్రాథమిక పాఠశాల, పంచాయితీ భవనం, చౌకధరల దుకాణం, అంగన్వాడీ కేంద్రం వున్నాయి తండాల సముదాయంగా వున్నప్పటికీ ఆరోగ్యకేంద్రం లేకపోవడం గమనార్హం ఇంగ్లీష్ మీడియం స్కూలు వున్నది.

తండాల్లో నాయక్‌లు మెజార్టీగా వున్నారు సంఖ్యరీత్యా ఎస్టీలు (సుగాలీ) అధికంగా వున్నప్పటికీ రెడ్డి సామాజిక తరగతిదే ఆర్థిక - రాజకీయ అధికారం, ఆధిపత్యం

కల్గివున్నది గ్రామంలో ఒక తండాలో ప్రత్యేకత వున్నది పూసల తండాలో మద్యం వాడరు. అలాగే మాంసం, చికెన్ తినడం లేదు చివరకు గుడ్లు కూడా వాడటం లేదు అనాదిగా ఇది సంప్రదాయంగా వస్తున్నదని చెపుతారు గ్రామంలో రజకులు బట్టలు వుతికితే 'మేరలు' ఇచ్చే పద్ధతి వున్నది అంటే ఇంకా ఫ్యూడల్ అవశేషాలు వున్నాయి.

**జనాభా వివరాలు**

మా సెన్సస్ సర్వే ప్రకారం గ్రామంలో మొత్తం కుటుంబాలు276 వున్నాయి. మొత్తం జనాభా 1224 ఇందులో పురుషులు 608 స్త్రీలు 616 స్త్రీ పురుష నిష్పత్తి 1013 అంటే ప్రతి వెయ్యి మంది పురుషులకు 1013 మంది స్త్రీలు వున్నారు 2011 ప్రభుత్వ జనాభా లెక్కల ప్రకారం తెలంగాణ రాష్ట్రసగటు స్త్రీ పురుష 988 అంటే రాష్ట్ర సగటుకు మించి స్త్రీల సంఖ్య వున్నది స్త్రీల సంఖ్య ఎస్‌సిలలో ఎక్కువగా వున్నది తర్వాత బిసి సామాజిక తరగతిలో కన్పడుతుంది కరీంనగర్ జిల్లా లింగ నిష్పత్తి 1015. జిల్లా నిష్పత్తి కంటే గ్రామ నిష్పత్తి స్వల్పంగా తక్కువగా వున్నది.

**సామాజిక పొందిక**

మతాల వారీగా చూస్తే హిందువుల కుటుంబాలు 269 (97%), ఒక ముస్లిం కుటుంబం (0.36%), ఐదుగురు క్రిస్టియన్ కుటుంబాలు (2%) ఇతరులు ఒకరు (0 36%) వున్నారు

ఈ గ్రామంలో వున్న 276 కుటుంబాల్లో ఎస్‌సి కుటుంబాలు 39 (14%), ఎస్‌టి కుటుంబాలు 140 (51%), బిసి కుటుంబాలు 76 (28%), ఓసి కుటుంబాలు 20 (7%), ఇతరులు ఒకరు (0 36%) వున్నారు అంటే మొత్తం జనాభాలో ఎస్‌టి సామాజిక తరగతే సగం మంది వున్నారు గ్రామంలో మొత్తం 13కులాలు వున్నాయి ఎస్టీలైన సుగాలీలే ఎక్కువగా వున్నారు. ప్రభుత్వ లెక్కల ప్రకారం రాష్ట్ర ఎస్‌సి జనాభా 15 45%, ఎస్‌టి జనాభా 9.08% వుంటే, జిల్లాలో ఎస్‌టి 2 83%, ఎస్‌సి 18 8%గా వున్నది. కులాల వారీగా కుటుంబాలను పరిశీలిస్తే సుగాలి 140 కుటుంబాలు, కురుమ 32 కుటుంబాలు, మాదిగ 35 కుటుంబాలు, మాల ఒకరు, మున్నూరు కాపు 18 కుటుంబాలు, ఒకరు ముస్లిం బిసి, రెడ్డి 17 కుటుంబాలు, నాయీబ్రాహ్మణ 10 కుటుంబాలు, కుమ్మరి6 కుటుంబాలు ,పద్మశాలి రెండు, రజక 6, ఒకరు విశ్వబ్రాహ్మణ, ముగ్గురు వైశ్య, ఇతరులు 4 వున్నారు.

## జీవనోపాధి

గ్రామంలో వ్యవసాయమే ప్రధానంగా చేస్తున్న కుటుంబాలు 208 వున్నాయి. వ్యవసాయ కూలీలుగా వున్నవి 48 కుటుంబాలు వున్నాయి అంటే వ్యవసాయంరంగంపై ఆధారపడ్డ కుటుంబాలు 80శాతం వున్నాయి ఊర్లో వున్న ఒకే ధనిక రైతుకుటుంబం సుగాలీ కులానికి చెందినది 140 కుటుంబాలుగా వున్న సుగాలీలలో 120 కుటుంబాలు రైతుకుటుంబాలుగా వున్నారు మున్నూరు కాపు 18 కుటుంబాల్లో ఒకరు ప్రయివేటు ఉద్యోగిగా వుంటే మిగిలిన వారు వ్యవసాయం చేస్తున్నారు మాదిగ కుటుంబాలు 35 వుంటే అందులో 25 కుటుంబాలు అంటే 70శాతం సన్నకారు రైతుకుటుంబాలు ఐదు కుటుంబాలు బిల్డింగ్ పనులు చేస్తున్నారు కుమ్మరి ఆరు కుటుంబాలత్లో ఒకరు సన్నకారు రైతుగా వుంటే, మిగిలిన వారు ఎలక్ట్రీషియన్‌లుగా స్వయం ఉపాధితో బ్రతుకుతున్నారు రెడ్డి కులానికి చెందిన 17 కుటుంబాల్లో 13 కుటుంబాలు రైతుకుటుంబాలుగాను, రెండు కుటుంబాలు భూమిలేని వ్యవసాయ కార్మికులుగా వున్నారు కురుమ కుటుంబాలతు 32 వుంటే ఒకరు హమాలిగాను, ఇద్దరు స్వయం ఉపాధి లోను, ఆరుగురు వ్యవసాయంతో పాటు వృత్తిని చేస్తున్నారు. ఒక కుటుంబంగా వున్న విశ్వబ్రాహ్మణ టైలర్ వృత్తి చేస్తున్నారు నాయీబ్రాహ్మణ 10 కుటుంబాల్లో ముగ్గురు వృత్తిలో వున్నారు రజక కుటుంబాలు ఆరు వుంటే అందులో ఇద్దరు మాత్రమే వృత్తి చేస్తున్నారు మూడు కుటుంబాలుగా వున్న వైశ్యులు వ్యాపారం చేస్తున్నారు. మాలలో వున్న ఒకే కుటుంబం మధ్యతరగతి రైతుగా వున్నది మొత్తం కుటుంబాల్లో స్త్రీల యాజమాన్యంలో వున్నవి 27 (10%) వున్నాయి

## అక్షరాస్యత

గ్రామంలో 53శాతం మంది చదువుకున్న వారు వున్నారు 2011 ప్రభుత్వ జనాభా లెక్కల ప్రకారం రాష్ట్ర అక్షరాస్యత సగటు 66 54%. కరీంనగర్ జిల్లా అక్షరాస్యత శాతం 64% వీటితో పోలిస్తే 10-13శాతం తక్కువగా వున్నది. జిల్లాలో వున్న ఎస్‌సిలలో 59శాతం, ఎస్‌టిలలో 51శాతం అక్షరాస్యత వున్నట్లు ప్రభుత్వం చెపుతోంది ఈ గ్రామంలో ఎక్కువ జనాభా కల్గి వున్న ఎస్టీలలో 49% మాత్రమే వున్నది గ్రామ సగటు కంటే ఎస్‌టిలలో బాగా తక్కువగా వున్నది దీనర్థం సగం కంటే ఎక్కువ మంది ఎస్‌టిలు చదువుకు దూరంగా వున్నట్లు అర్థమౌతున్నది బిసి, ఎస్‌లలో అక్షరాస్యత దాదాపు ఒకేవిధంగా 54% వున్నది ఓసి కుటుంబాల్లో అక్షరాస్యత 78%వున్నది

స్త్రీ, పురుష అక్షరాస్యత చూస్తే 63%పురుషులు, 44శాతం స్త్రీలు చదువుకున్న వారు వున్నారు. ఆందోళనకలిగించే విషయమేమంటే ఎస్‌టి స్త్రీల అక్షరాస్యత కేవలం 40శాతం వుండటం ఊర్లో సెకండరీ విద్య వరకు చదువుకున్న వారు 22% మంది వున్నారు. ఇంటర్ వరకు చదువుకున్న వారు 6శాతం వున్నారు డిగ్రీస్థాయి వరకు చూస్తే 5 శాతం వున్నారు విశేషమేమంటే ఎస్‌టిలలో ఇద్దరు పిజి వరకు విద్యను అభ్యసించడం చెప్పాలి బిసిలలో పిజి చేసిన వారు అసలు లేరు ఓసిలలో పిజి చేసిన వారి సంఖ్య ఎక్కువగా వున్నది అయితే ఓసి సామాజిక తరగతి విద్యలో అన్నిస్థాయిల్లో ముందంజలోనే వున్నారు పిహెచ్‌డి చేసినవారు లేరు

**ఆయుఃప్రమాణం**

గ్రామ జనాభాలో యువత (16-40 సం.వరకు) 46శాతం వున్నట్లు సర్వేలో సేకరించాం 46శాతం వున్న 65 శాతం మంది శ్రమ చేయగల్గిన వారు (16 సం నుండి 60 వరకు ) వున్నారు. గ్రామంలో మొత్తంగా చూస్తే ఓసి, బిసిలలో ఆయుఃప్రమాణం ఎక్కువగాను, ఎస్‌సిలలో తక్కువగాను సర్వేలో తేలింది 61 నుండి 70 సంవత్సరాలు, ఆపైన వున్న వారు ఓసి లలో ఎక్కువ శాతం వున్నారు. ఇది ఎస్‌సిలలో తక్కువ శాతం కన్పడుతున్నది 70 సంవత్సరాలకు పైబడి వున్నవారు ఎస్‌టిలలో బాగా తక్కువగా వున్నారు 51 నుండి 60 సంవత్సరాల మధ్య వయస్సు వారి ఆయుఃప్రమాణాలను పరిశీలించినా ఓసి, బిసి లలో ఎక్కువగా వుంటే, ఎస్‌సి, ఎస్‌టిలలో తక్కువగా వుంటోంది.

**పశుసంపద**

గ్రామంలో 65 కుటుంబాలకు 125 ఎద్దులు వున్నాయి అందులో సగం ఎస్‌టి కుటుంబాలే కల్గివున్నాయి గేదెలు, ఆవులు 93 కుటుంబాలకు వుంటే, అందులో సగం కంటే ఎక్కువగా ఎస్‌టిలకే వున్నాయి గొర్రెలు 33 కుటుంబాలకు 447 వున్నాయి అందులో బిసి, ఎస్‌టిల కుటుంబాలే అత్యధికంగా కల్గివున్నారు పశుసంపదలో ఎక్కువ భాగం మధ్యతరగతి, చిన్న సన్నకారు రైతాంగానికే వున్నాయి యాంత్రీకరణ పెద్దగా లేదనే చెప్పాలి మొత్తం 10 ట్రాక్టర్స్ వున్నాయి ఇందులో 9 సుగాలీలకు చెందినవి కాగా, ఒకటి రెడ్డి సామాజిక తరగతికి చెందినది. మధ్యతరగతి రైతువర్గానికి 4, చిన్నకారు రైతులకు 3 ట్రాక్టర్స్ వున్నాయి. రైస్‌మిల్లులు రెండు వున్నాయి ఈ రెండు ఓసిలవే

## వ్యవసాయం

సర్వే వివరాలు ప్రకారం మొత్తం సాగుభూమి 844 ఎకరాలు సాగునీటి వసతి కల్గిన భూమి 373 66 ఎకరాలు మెట్టభూమి 516 ఎకరాలు. ఇక పడావు భూమి 31 06 ఎకరాలు వున్నది కౌలుకు చేస్తున్న సాగునీటి వసతి కల్గిన భూమి 46 ఎకరాలు, మెట్టభూమి 93 75 ఎకరాలుగా వున్నది కౌలుకు ఇచ్చినట్లు నమోదైన భూమి చూస్తే సాగునీటి వసతి కల్గిన భూమి 40 ఎకరాలు, మెట్ట భూమి 29.75 ఎకరాలుగా నమోదైంది నికర భూమి, కౌలుకు చేస్తున్న భూమి, కౌలుకు ఇచ్చిన భూమి వివరాలను పరిశీలిస్తే విస్తీర్ణంలో వ్యత్యాసం కన్పిస్తుంది అంటే కౌలుకు ఇచ్చిన కుటుంబాలన్నీ పూర్తి వివరాలు చెప్పలేదని అర్ధమౌతున్నది ఇరుగుపొరుగు గ్రామాల పరిధిలో వున్న భూమిని కౌలుకు చేస్తున్నట్లయితే సాగు విస్తీర్ణంలో తేడా కన్పించే అవకాశం వుండొచ్చు. ఊర్లో పంటలకు బోరుబావులు, వర్షపునీరే ప్రధాన వనరు వరి, మొక్కజొన్న, కంది, పత్తి ముఖ్యమైన పంటలు కూరగాయలు, ఉల్లి, మిర్చి, జొన్న, అలసందలు కూడా పండిస్తారు. మామిడి తోటలు కూడా వున్నాయి. రెండు చెరువులు వున్నాయి. గ్రామ త్రాగునీటి అవసరాలకు మాత్రమే వినియోగిస్తున్నారు వ్యవసాయానికి బోరుబావులే ప్రధాన నీటివనరు.

## కౌలు సేద్యం

కౌలు కుటుంబాలను పరిశీలిస్తే మొత్తం 276 కుటుంబాల్లో 54 కుటుంబాలు కౌలు చేస్తున్నాయి అంటే 20శాతం కుటుంబాలు వీరు 140 5 ఎకరాలు సాగు చేస్తున్నారు సాగుచేస్తున్న కుటుంబాల్లో చూస్తే కౌలు కుటుంబాలు 23 శాతం వున్నారు కౌలు భూమి విస్తీర్ణం 17శాతంగా వున్నది వీరిలో ఆర్థిక తరగతుల వారీ పరిశీలిస్తే మధ్యతరగతి రైతులు 14 మంది, చిన్నకారు రైతులు 27 మంది, సన్నకారు రైతులు 12 మంది, వ్యవసాయ కార్మికులు ఒక్కరు వున్నారు కౌలు భూమిలో అధిక భాగం చిన్నకారు రైతులే 66 ఎకరాలు (47%) చేస్తున్నారు. మధ్యతరగతి రైతులు 56 ఎకరాలు (40%) సాగు చేస్తున్నారు సన్నకారు రైతులు 13% భూమిని కౌలుకు తీసుకున్నారు వ్యవసాయ కార్మికులు నామమాత్రంగా కౌలుచేస్తున్నారు.

కౌలు కుటుంబాలలో సామాజిక తరగతుల వారీ చూస్త చిన్న, సన్నకారు రైతుల్లో సుగాలీలే ఎక్కువగా కౌలురైతులుగా వున్నారు మధ్యతరగతి రైతుల్లో కురుమలు, సుగాలీలు ఎక్కువగా కౌలురైతులు వున్నారు సుగాలీలే ఎక్కువమంది 25 కుటుంబాలు

వుంటే, తర్వాత కురుమలు 12 మంది వున్నారు మిగిలిన వారు మున్నూరు కాపు 5, మాదిగ 6, రెడ్డి, మాల, నాయీ బ్రాహ్మణ, కుమ్మరి తరగతులు వున్నారు

**వర్గపొందిక ఎలా వుంది?**

గ్రామంలో భూస్వాములు లేరని మా సర్వేలో తెలుస్తోంది అబ్సెంటీ భూస్వాములు కూడా లేరు. చిన్న, సన్నకారు రైతుల సంఖ్య ఎక్కువగా వున్నది ధనిక రైతులు ఒకరు అంటే 0 36% వున్నారు. మధ్యతరగతి రైతులు 25 మంది (9 06%), చిన్నకారు రైతులు 70 (25%) మంది, సన్నకారు రైతులు 112 మంది(41%) వున్నారు. వ్యవసాయ కార్మికులు 48 మంది (17%), వ్యవసాయేతర కార్మికులు ముగ్గురు 1%, స్వయం ఉపాధి కార్మికులు ఏడుగురు 3%, వ్యాపారం, వడ్డీవ్యాపారులు ఇద్దరు 0 72%, అలాగే ఉద్యోగులు ఇద్దరు 0 72%, వృత్తిదారులు ఒక్కరు 0 36%, ఇతరులు ఐదుగురు 1.81% వున్నట్లు సర్వేలో వెల్లడైంది

వివిధ ఆర్థిక తరగతుల మధ్య భూకేంద్రీకరణను పరిశీలించాం వర్గాలను నిర్ణయించేటపుడు ఆయా కుటుంబాల చేతుల్లో వున్న నికర సాగుభూమి విస్తీర్ణాన్ని ప్రాతిపదికగా తీసుకున్నాం అందువల్ల వివిధ వర్గాల చేతుల్లో వున్న నికర భూమిగా చూసినపుడు 0 36శాతంగా వున్న ధనిక రైతు చేతిలో 4శాతం భూమి వున్నది 9శాతంగా వున్న మధ్యతరగతి రైతుల చేతుల్లో 26% భూమి వుంది 66శాతంగా వున్న చిన్న, సన్నకారు రైతుల చేతుల్లో69శాతం భూమి వున్నది ఇక 17శాతంగా వున్న వ్యవసాయ కార్మిక కుటుంబాల చేతుల్లో కేవలం 1 55 శాతం భూమి మాత్రమే వున్నది

గ్రామంలో వృత్తిదారులు, వ్యవసాయేతర కార్మికులు, స్వయం ఉపాధి, ఉద్యోగులు తక్కువగా వున్నట్లు అవగతమౌతున్నది మధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతాంగం వ్యవసాయ రంగంలో గణనీయంగా వున్నారు

**భూకేంద్రీకరణ**

భూమి కేంద్రీకరణ విషయంలో స్వంత భూమిని ప్రాతిపదికగా తీసుకున్నాం మొత్తం స్వంత భూమి 780ఎకరాలు వున్నది. గ్రామంలోని 276 కుటుంబాల్లో 250 కుటుంబాలకు (91%) స్వంత భూమి వున్నది 26 కుటుంబాలు అంటే

9% మందికి భూమి లేకపోవడం చూస్తాం భూమి వున్న పైస్థాయి 5శాతం కుటుంబాలకు 18% భూమి వుంటే, క్రింది స్థాయి నుండి 60శాతం కుటుంబాలకు 27% భూమి కల్గివున్నారు ఆర్థిక తరగతుల్లో చూస్తే ధనిక రైతుగా వున్న ఒకరికి 30 ఎకరాలు వున్నది. మధ్యతరగతికి 6 6 ఎకరాలు వుంటే, సన్నకారు రైతువర్గానికి సుమారు 2ఎకరాలు వున్నది ఇక వ్యవసాయకార్మిక వర్గానికి 0.76 సెంట్లు వున్నది. సామాజిక తరగతుల వారీగా చూస్తే ఎస్‌సిలలో 12శాతం, ఎస్‌టిలలో 4శాతం, బిసిలలో 13శాతం, ఓసిలలో 25 శాతం మందికి భూమిలేనట్లు కన్పడుతున్నది. భూమి లేని కులాలలో సుగాలీలు 6 కుటుంబాలు, కుమ్మరి 3, మాదిగ 4, రెడ్డి రెండు కుటుంబాలు వున్నాయి

గ్రామంలో సామాజిక తరగతుల వారీగా భూకేంద్రీకరణను పరిశీలించాము ఎస్‌టిలకు 452 77 ఎకరాలు, ఎస్‌సిలకు 57 33 ఎకరాలు, బిసిలకు 206 61 ఎకరాలు, ఓసిలకు 64 25 ఎకరాలు వున్నది మొత్తం సాగుభూమి 844 ఎకరాలు సగటు కుటుంబ కమతం విస్తీర్ణం ఎలా వుందో పరిశీలిస్తే ప్రతి కుటుంబానికి 3 ఎకరాలు భూమి వుండాలి కానీ 9 శాతం కుటుంబాలకు భూమి లేదు. అయినా వ్యవసాయ కుటుంబాలకు సగటు లెక్కిస్తే ఒక్కో కుటుంబానికి 3 6 ఎకరాలు వుండాలి కానీ అలా లేదు. ఒక ధనిక రైతు కుటుంబానికి 38 ఎకరాలు వున్నది మధ్యతరగతి రైతు కుటుంబానికి సగటు 11ఎకరాలు వుంటే, చిన్నకారు రైతులకు సగటు 6ఎకరాలు, సన్నకారు రైతులకు సగటు 2 6ఎకరాలు వున్నట్లు సర్వేలే తేలింది వ్యవసాయకార్మికులకు సగటు భూమి 0 64 ఎకరాలు వుంది

### గృహాలు - మౌలిక సదుపాయాలు

ఊర్లో 98%మందికి స్వంత ఇళ్లు వున్నాయి పక్కా గృహాలు 74శాతం మందికి వుంటే ఎస్‌టిలలో 66 శాతం మందికే వున్నాయి ఓసి సామాజిక తరగతికి 90% వుండటం గమనించాలి. ఆర్థిక తరగతుల వారీగా చూస్తే చిన్నకారు రైతులకు 82%, సన్నకారు రైతులకు 67% కుటుంబాలకే పక్కాగృహాలు వున్నవి

వినియమ వస్తువులు సౌకర్యాల విషయాలను పరిశీలిస్తే మధ్యతరగతి, చిన్న సన్నకారు రైతు వర్గాలే ఎక్కువగా కల్గివున్నారు. సైకిల్స్ 103, స్కూటర్స్ 23, బైక్‌లు 67 వున్నాయి ఎస్‌టి, బిసిలకు దాదాపు ఒకే విధంగా వున్నాయి 77శాతం వీరి వద్ద

వున్నాయి. ఒక కారు వున్నది అది ఓసి ల వద్ద వున్నది. ఆటోలు 7 వున్నాయి. బిసి, ఎస్‌టిల వద్ద 85శాతం వున్నాయి టివిలు 67 శాతం కుటుంబాలకు వున్నాయి ఓసిలకు 90 శాతం మందికి వున్నాయి. ఎస్‌సి లలో చూస్తే కేవలం 56 శాతం మందికి వున్నట్లు లెక్కలు చెపుతున్నాయి అలాగే 97 శాతం గృహాలకు విద్యుత్ సౌకర్యం వున్నది. ఎస్‌సి లలో చూస్తే 95శాతం మందికి వున్నది

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 18% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 27% భూమి మాత్రమే వుంది. 9% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

మరుగుదొడ్లు 36% కుటుంబాల వారే కల్గివున్నారు. అదే సమయంలో ఓసి సామాజిక తరగతిలో 90% కుటుంబాలకు మరుగుదొడ్లు వున్నాయి. ఊర్లో ఎక్కువ కుటుంబాలున్న ఎస్టీలలో కేవలం 20% మందికి మాత్రమే ఈ సౌకర్యం వున్నది సెల్‌ఫోన్స్ 80 శాతం కుటుంబాల వారు కల్గివున్నారు వంటగ్యాస్ సౌకర్యాన్ని 25శాతం కుటుంబాల వారు కల్గివుంటే, ఎస్‌టిలలో కేవలం 7 శాతం మాత్రమే కల్గి వున్నారు. అయితే ఎస్‌సిలలో 31శాతం మందికి, ఓసిలలో 90 శాతం మందికి ఈ సౌకర్యం వున్నది

# మహబూబ్‌నగర్ జిల్లా

## కేతి_డ్డ_ల్లి

### గ్రామ స్వరూపం

సుందరయ్య విజ్ఞాన కేంద్రం 2013-2014 సంవత్సరంలో నిర్వహించిన గ్రామీణ సామాజిక ఆర్థిక సర్వేలో భాగంగా కేతిరెడ్డిపల్లి గ్రామాన్ని రెండుసార్లు సర్వే నిర్వహించడం జరిగింది

దక్షిణ తెలంగాణ ప్రాంతంలోని మహబూబ్‌నగర్ జిల్లా బాలనగర్ మండలంలో ఈ గ్రామం ఉంది. గ్రామానికి దగ్గర నుండే జాతీయ రహదారి ఉంది గ్రామానికి మండలం కేంద్రం 8, జడ్చర్ల పట్టణం సుమారు 20 కిలోమీటర్ల దూరంలో ఉన్నాయి ప్రధానంగా రవాణా ఆటోల ద్వారానే జరుగుతుంది. బస్సులు హైవే వరకే వస్తాయి. గ్రామంలోనికి రావు వ్యవసాయానికి ప్రధానంగా బోరుబావులే ఆధారం. చెరువు ద్వారా కూడా కొంత భూమి సాగుచేస్తున్నారు. ఈ గ్రామ పంచాయితీలో 3 లంబాడితండాలు (ఎర్రగుంట తాండా, చింతకుంట తాండా, పలుగు తాండా) మరియు గాలిగుడెం అనే ఒక పల్లె కలిసి ఉన్నాయి వీటిలో దేనికి కూడా బస్సు సౌకర్యం లేదు. ముఖ్య గ్రామానికి 3 నుండి 5 కిలోమీటర్ల దూరంలో వుంటాయి చుట్టుపక్కల గ్రామాలలో ఫ్యాక్టరీలు వున్నాయి. గ్రామం, లంబాడి తాండాలు, పల్లె నుండి ఫ్యాక్టరీలలోకి కార్మికులు వెళ్తున్నారు

గ్రామంలో చెలకభూములే ఎక్కువగా ఉన్నాయి. ప్రధానంగా వరి, మొక్కజొన్న, మామిడి, జామ పండ్ల తోటలు, జొన్న, వేరుశెనగ, ప్రత్తి పంటలు పండిస్తారు.

ఇండ్ల మధ్యలోనే స్మశానం వుంది  కొత్తగా ఇండ్లు కట్టుకోవడానికి కూడ స్థలం లేదు చుట్టు తోటలు, పంటభూములే వున్నాయన్నారు. ఒక గ్రామ వ్యాపారి వడ్డీకి అప్పులు ఇస్తాడు

పిహెచ్‌సి సెంటర్ మండల కేంద్రంలోనే ఉంది  గ్రామంలో ప్రాథమిక పాఠశాల ఉంది  మంచి ఆటస్థలం, మంచినీటి బోరు, ప్రహారిగోడ, టాయిలెట్ సౌకర్యాలు ఉన్నా విద్యార్థుల కొరత ఉంది  ప్రయివేట్ స్కూల్స్‌కు వెళ్తున్నారు  పంచాయితీ ఆఫీసు, అంగన్‌వాడీ కేంద్రం, ప్రజా పంపిణీ కేంద్రం, పాలకేంద్రం ఉన్నాయి

**జనాభా వివరాలు**

సర్వే వివరాల ప్రకారం గ్రామ జనాభా 1691  పురుషులు 911, స్త్రీలు 780 మంది ఉన్నారు సామాజిక తరగతుల వారిగా జానాభాను పరిశీలిస్తే ఎస్సీ 18%, ఎస్టీ 38%, బిసిలు 33%, ఓసీ లు 12% ఉన్నారు  గ్రామంలో  ప్రతి వెయ్యి మంది పురుషులకు 856 మంది స్త్రీలు మాత్రమే ఉన్నారు  ఎస్టీలలో అత్యంత దారుణంగా 792 మాత్రమే ఉన్నారు. ఇదే తరహాలో ఇతర సామాజిక తరగతుల్లో కూడా తక్కువగానే ఉన్నారు  ఇది రాష్ట్ర నిష్పత్తి (988) కంటే 132 మంది, జిల్లా నిష్పత్తి (977) కంటే 121 మంది స్త్రీలు తక్కువగా ఉన్నారు  ఇది చాలా ప్రమాదకరం  ఇది స్త్రీలపై లింగ వివక్షతకు నిదర్శనంగా చెప్పవచ్చు

గ్రామంలో 16 నుండి40 మధ్య వయస్సు ఉన్న యువత 47% ఉన్నారు ఎస్సీలలో యువత అధికంగా 50% ఉంది  పనిచేయగల వయస్సు 16 నుండి 60 మధ్య వయస్సుగల వారు 64% ఉన్నారు.

**సామాజిక పొందిక**

గ్రామంలో స్త్రీ యాజమాని గల కుటుంబాలు 44 (12%) వున్నాయి. 367 కుటుంబాలను సామాజికంగా చూస్తే ఎస్సీ 67, ఎస్టీ 136, బిసి 129, ఓసీలు 35 కుటుంబాలు ఉన్నాయి  కులాల వారి పరిశీలిస్తే  లంబాడ 136(37%), ముదిరాజ్ 38(10%), వడ్డెర 12(3%), రెడ్డి 21(6%), యాదవ 55(15%), ముస్లిం 8, విశ్వబ్రాహ్మణ 5, రజక 4, వైశ్య, మున్నూరుకాపు, నాయిబ్రాహ్మణ, ఒక్కొక్కటి, ఇతరులు 11(3%) కుటుంబాలు ఉన్నాయి  గ్రామం మొత్తంగా హిందువులు 98% ముస్లింలు 2%(8) కుటుంబాలు ఉన్నాయి.

## జీవనోపాధి

వ్యవసాయం ప్రధానం గల కుటుంబాలు 96, వ్యవసాయకూలి కుటుంబాలు 106, వ్యవసాయేతర కార్మికులు 63, ప్రవేటు ఉద్యోగులు 34, ప్రభుత్వ ఉద్యోగులు 7, వృత్తిదారులు 13, ఆటోడ్రైవర్లు 13, పాలేర్లు 8, వ్యాపారులు 7, టైలర్, విలేకరి, కాంట్రాక్టర్, కౌలు, వడ్డీవ్యాపారులు ఒక్కొక్కరు చొప్పున వున్నారు ఇతరులు 15 కుటుంబాలు వున్నాయి

## పశుసంపద

సర్వేకు తెలిపిన సమాచారం ప్రకారం గ్రామంలో పశుసంపద 803 ఉంది. వీటిలో ఎద్దులు 43, గేదెలు, ఆవులు 231 మరియు గొర్రెలు, మేకలు 529 ఉన్నాయి వీటిలో 34 ఆవులు, గేదెలు మినహా పశుసంపద మొత్తం ఎస్సీ, ఎస్టీ, బిసిలదే ఎస్టీ, బిసిలు ఆవులు, గేదెలను మరియు గొర్రెలను ఎక్కువ కలిగి ఉన్నారు ఎస్టీలు కూడా గొర్రెలను పెంచుతున్నారని సర్వే లెక్కలు నిర్ధారిస్తున్నాయి మొత్తం 44 కుటుంబాలు గొర్రెలను కలిగివుంటే అందులో కేవలం 9కుటుంబాలు సాంప్రదాయంగా గొర్రెలకాపరులవి ఎస్సీ, ఎస్టీ, బిసీలలోని ఇతర కులాలవి. వీరందరు మధ్య, చిన్న,సన్నకారు రైతులు మరియు వ్యవసాయకార్మికులు, వృత్తిదారులకు చెందినవారే వున్నారు. ఓసీలు మినహా ఇతర తరగతులు పశువులను కుటుంబ ఆర్థిక వెసులుబాటు కోసం పెంచుకుంటున్నారు

## సాగుభూమి

గ్రామంలో మొత్తం నికర సాగుభూమి 814 5 ఎకరాలు ఉంది సాగునీటి వసతి గలది 272, వర్షాధార భూమి 543 55 ఎకరాలు ఉంది. గ్రామంలో నికరంగా సాగు అవుతున్న భూమిలో ఒకే కుటుంబం గల భూస్వామి 4% పైగా, మరియు ఒక శాతం వున్న ధనిక రైతులు 9% భూమిని నికరంగా సాగుచేస్తున్నారు సుమారు ఒక శాతం గల పైరెండు వర్గాలు 13% భూమిని సాగు చేస్తున్నాయి శ్రమ ప్రధానంగా వున్న మధ్య తరగతి రైతులు, చిన్నకారు రైతులు, సన్నకారు రైతులు కలిపి 65% వుంటే 85% భూమిని సాగుచేస్తున్నారు 17% గల వ్యవసాయ కార్మికులు కేవలం 2% భూమినే సాగుచేస్తున్నారు

### కౌలు వ్యవసాయం

మొత్తం 367 కుటుంబాలలో కౌలుకు చేస్తున్న కుటుంబాలు 26 అంటే కౌలు కుటుంబాలు 7శాతం వారు సాగుచేస్తున్న భూమి 74 యకరాలు కౌలుకు చేస్తున్న భూమిలో 91% భూమి మధ్యతరగతి, చిన్న,సన్నకారు రైతులు సాగు చేస్తున్నారు. వ్యవసాయ కార్మికులు కేవలం ఒక శాతం సాగుచేస్తున్నారు ఇక్కడ వారికి ఉన్న భూమి సరిపోవడం వల్ల కొంత ఆదాయం వస్తుందని నమ్మకం ఉంటే వారు కౌలుకు చేస్తున్నట్లు తెలుస్తుంది కౌలుకు చేస్తున్నవారిని కులాలవారిగా చూస్తే మాదిగ 42%, లంబాడ 15% యాదవులు 15 శాతం చొప్పన వున్నారు కౌలుకిచ్చిన వారిలో కూడా భూస్వాములు, ధనికరైతులు లేరని సర్వేలో వెల్లడైంది

### గ్రామంలో వర్గపొందిక

గ్రామంలోని మొత్తం కుటుంబాలను వర్గాలుగా పరిశీలించినపుడు నికర సాగుభూమిని ప్రామాణికంగా తీసుకొని వర్గాలను నిర్ణయించాం ఆ ప్రకారం చూసినపుడు భూస్వాములు ఒకరు, ధనిక రైతులు నలుగురు ఉన్నారు మధ్యతరగతి రైతులు (18)5%, చిన్నకారు రైతులు (65)18%, సన్నకారు రైతులు (156)42%, వ్యవసాయ కార్మికులు(63)17% వ్యవసాయేతర కార్మికులు(15)4% వృత్తిదారులు 6, స్వయం ఉపాది 2, ప్రయివేటు ఉద్యోగులు (23)6%, ప్రభుత్వ ఉద్యోగులు 2, వ్యాపారస్తులు 4, ఇతరపనులు చేసేవారు 8 కుటుంబాలు ఉన్నాయి గ్రామంలో సన్న, చిన్నకారు రైతుల సంఖ్య అధికంగా వున్నది అలాగే వ్యవసాయ కార్మిక కుటుంబాలు తక్కువగా వున్నాయి. ప్రయివేటు ఉద్యోగులు ఎక్కువ ఉండడానికి కారణం ఇది పారిశ్రామిక ప్రాంతం కావడంతో ఫ్యాక్టరీలలో పనిచేసే ఉద్యోగులు పట్టణానికి దగ్గరే గ్రామం వుండటంతో వ్యవసాయేతర కార్మికులు గణనీయంగా వున్నారు

### భూకేంద్రీకరణ

గ్రామంలో భూకేంద్రీకరణను స్వంత భూమి ఆధారంగా పరిశీలించాం. భూమి వున్న కుటుంబాల్లో పై స్థాయిలో మొదటి 5% కుటుంబాలకు 27% భూమి వుంటే, చివరి 60% కుటుంబాలకు 20% భూమి మాత్రమే వుంది అదే సందర్భంలో 24% కుటుంబాలకు సెంటుభూమి లేదు అంటే గ్రామంలో భూకేంద్రీకరణ కొంతమేరకు వుందని అర్థమౌతున్నది వివిధ వర్గాలు ఎంతెంత స్వంత భూమిని కలిగి ఉన్నాయో

పరిశీలిస్తే ఒక్క భూస్వామి 4% కంటే ఎక్కువ, ఒక శాతం గల ధనికరైతులు 9% భూమి కలిగి ఉన్నారు ఒక శాతం గల భూస్వామ్య, ధనిక రైతు వర్గాలు మొత్తం భూమిలో 13% భూమిని తమ గుప్పెట్లో పెట్టుకున్నాయి. అధిక శ్రమచేసే మధ్యతరగతి, చిన్నకారు, సన్నకారు రైతులు 65శాతం వుండగా 85శాతం భూమిని కలిగి వున్నాయి వ్యవసాయ కార్మికులు 17% ఉంటే 2% మరియు, 6%గల ప్రయివేటు ఉద్యోగులు ఒక్క శాతం భూమిని కలిగి ఉన్నారు మిగిలిన వ్యవసాయేతర, వృత్తిదారులు, స్వయం ఉపాధి, ప్రభుత్వ ఉద్యోగులు, వ్యాపారస్తులు , ఇతరులకు దాదాపుగా స్వంతభూములు లేవని చెప్పవచ్చు ఇక్కడ మరొక విషయం గమనించాలి సన్నకారు రైతులు (42%) వ్యవసాయ కార్మికులు (17%) కలిపి 59% గ్రామంలో ఉన్నారు మధ్యతరగతి,చిన్నకారు రైతులలో కూడా ఎక్కువ మంది కూలిపనులు చేసేవారే వీరితోపాటు వృత్తిదారులు, వ్యవసాయేతర కార్మికులు, ఇతరులు, ఫ్యాక్టరీలలో పనిచేసే సంఖ్య శ్రమను అమ్ముకుంటున్న వారే ఉన్నారు

సామాజిక తరగతుల వారీగా పరిశీలిస్తే 18% కుటుంబాలు గల ఎస్సీలు 10% భూమిని మాత్రమే కలిగి ఉన్నారు 35% కుటుంబాలు గల బిసిలకు 31% భూమి వుంది 10% మాత్రమే ఒసి కుటుంబాలు ఉంటే 23% భూమి వారికి ఉంది ఇతర సామాజిక తరగతులతో పోలిస్తే ఓసి సామాజిక తరగతిలో భూమి ఎక్కువగా వున్నవాళ్ల సంఖ్య అధికంగా వున్నదని తెలుస్తున్నది

### అక్షరాస్యత

గ్రామ అక్షరాస్యత 58% ఇది జిల్లా అక్షరాస్యత 51% కంటే ఎక్కువే కాని, రాష్ట్ర (66 54%) కంటే తక్కువగా ఉంది. పురుషులలో 66%, స్త్రీలలో 48% అక్షరాస్యత ఉంది స్త్రీల అక్షరాస్యత 33%తో ఎస్టీలు అత్యంత వెనకబడి వున్నారు సామాజిక తరగతులలో అక్షరాస్యత పరిశీలిస్తే ఎస్సీలు 64%, బిసిలలో(63%) ఉంది అత్యంత వెనుకబడిన ఎస్టీలలో 47% మాత్రమే ఉంది అన్ని తరగతుల కంటే ఒసి తరగతిలో జిల్లా, రాష్ట్ర స్థాయిల కంటే కూడా ఎక్కువ 78%తో ముందున్నారు

గ్రామంలో ఇంటరు చదివినవారు 9శాతం వున్నారు ఒసిలలో 13% వుంటే ఎస్సీలలో 11శాతం వున్నారు బిసిలు ఎస్సీల కంటే కూడా వెనకబడి కేవలం 10శాతం

మాత్రమే ఇంటర్ చదివిన వారు వున్నారు. ఎస్టీలు అత్యంత వెనకబడి 6% మాత్రమే ఇంటర్ చదివిన వారు వున్నారు డిగ్రీ చదివిన వారు అన్ని తరగతులలో తగ్గినప్పటికి ఇదే మాదిరిగా తారతమ్యాలు కొనసాగాయి పిజి చదవినవారు ఒసిలు 2%తో ముందు వుండగా ఆ తర్వాత ఎస్సీలు వున్నారు బిసి, ఎస్టీలలో ఒక్కొక్కరు మాత్రమే వున్నారు.

**ఆయుఃప్రమాణం**

70 సంవత్సరాల పై బడి ఉన్నవారు ఓసీలలో ఎస్టీలకంటే రెట్టింపు, బిసిల కంటే రెండు రెట్లు, దళితుల కంటే ఆరు రెట్లు ఎక్కువగా ఉన్నారు 60 నుండి 70 మధ్య వయస్సు వారిని పరిశీలించినా ఓసీలలో బిసిలకంటే ఒకటిన్నర రెట్లు, ఎస్టీల కంటే రెండు రెట్లు, ఎస్సీల కంటే మూడు రెట్లు ఎక్కువ ఉన్నారు దీన్ని బట్టి అన్ని తరగతుల కంటే ఎక్కువ కాలం జీవిస్తున్నవారు ఓసీ తరగతుల వారే వున్నారని అర్థమౌతున్నది

**మౌలిక సౌకర్యాలు**

గ్రామంలో పక్కా ఇల్లు 76% కుటుంబాలకు ఉన్నాయి ఎస్సీలకు మాత్రం కేవలం 63% కుటుంబాలకు మాత్రమే ఉన్నాయి 15 ట్రాక్టర్లు ఉండగా 8 ఓసీలలోని రెడ్డి సామాజిక తరగతికే ఉన్నాయి. మరో 4 ట్రాక్టర్లు ఎస్టీలలోని లంబాడిలకు, 3 ట్రాక్టర్లు వెనుకబడిన తరగతులకు ఉన్నాయి. వారిలో రెండు ముదిరాజ్ లకు, ఒక్కటి యాదవులకు ఉంది

గ్రామంలో స్కూటర్, మోటర్ సైకిల్ సౌకర్యం 31% కుటుంబాలకు ఉంది. తక్కువగా ఎస్సీలలో 21% కుటుంబాలకు మాత్రమే ఈ సౌకర్యం ఉంటే, ఎస్టీలలో 24%, బిసిలలో 35%, ఓసీలలో 60% కుటుంబాలకు ఈ సౌకర్యం కలిగి ఉండటం గమనించవచ్చు ఊరిలో మొత్తం 6 కార్లు, ఒక జీపు ఉన్నాయి వాటిలో ఓసీలలోని రెడ్లకు 4, వైశ్య, ఎస్టీలలోని లంబాడీలకు ఒక్కొక్క కారు వుంది కార్లు అన్నికూడా స్వంతగా వాడుకునేవే. ట్యాక్సీ కోసం నడిపేవి కావు బిసిలలోని ముదిరాజ్‌లకు జీపు వుంది ఇది మాత్రం ట్యాక్సీకోసం నడుపుతున్నారు ఇదే వారి జీవనాధారం

గ్రామంలో మొత్తం 18 ఆటోలు ఉంటే బిసిలకు 3 ఉంటే రెండు ముదిరాజ్‌లవి కాగా, ఒక్కటి యాదవులకు ఉంది. ఎస్టీలకు 15 ఆటోలు ఉన్నాయి అన్నీ లంబాడీలకు

చెందినవే ఇవి అన్నీ కూడా బ్రతుకుదెరువు కోసం నడుపుకునే ఆటోలే ఇతరులకు ఒసి,ఎస్సీలకు ఆటోలు లేవు గ్రామంలో టివి సౌకర్యం గల కుటుంబాలు 68% ఉన్నాయి సామాజిక తరగతుల వారిగా అత్యంత తక్కువ ఎస్సీలు 57% కుటుంబాలు మాత్రమే ఈ సౌకర్యం కలిగి ఉన్నాయి ఎస్టీలు 62%, బిసిలు 77% కలిగి ఉండగా ఒసిలు ఇతరులకంటే ఎక్కువగా 86% కుటుంబాలు కలిగి ఉన్నాయి మరుగుదొడ్డి సౌకర్యం 30% కుటుంబాలకు ఉంది ఓసీలలో 69%, బిసిలలో 53% కుటుంబాలకు ఉంటే, ఎస్సీలలో కేవలం 19%, ఎస్టీలలో అత్యంత తక్కువ 4% కుటుంబాలకే మరుగుదొడ్డి సౌకర్యం ఉంది సెల్ ఫోన్ సౌకర్యం గల కుటుంబాలు బిసి,ఓసీ లలో 90% పైగా ఉంటే ఎస్టీలలో 77%, ఎస్సీలలో 67% కుటుంబాలకు మాత్రమే వుంది వంటగ్యాస్ లేని కుటుంబాలు ఇంకా 67% ఉన్నాయి ఎస్సీలలో 85%, ఎస్టీలలో 82% కుటుంబాలకు లేదు. బిసిలలో 53% కుటుంబాలకు, ఒసిలలో 31% కుటుంబాలకు మాత్రమే ఈ సౌకర్యం లేదు.

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 27% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 20% భూమి మాత్రమే వుంది. 24% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

## వరంగల్ జిల్లా

# ఓబులకేశ్వాపురం

### స్థూల చిత్రణ

సుందరయ్య విజ్ఞాన కేంద్రం 201-2014 సంవత్సరంలో నిర్వహించిన గ్రామీణ సామాజిక ఆర్థిక సర్వేలో భాగంగా వరంగల్ జిల్లా ఓబులకేశ్వాపూర్ గ్రామంలో 2013 డిశంబరులో తొలి దఫా, 2014 ఫిబ్రవరిలో మలి దఫా సర్వే నిర్వహించాము వరంగల్ జిల్లాలో మండల కేంద్రం జనగామకు 15 కిలోమీటర్ల దూరంలో ఉన్నది ఈ గ్రామం గ్రామానికి చేరటానికి బస్, ఆటోలే ప్రధాన రవాణా సాధనాలు బావులపై ఆధారపడి సేద్యం చేసే ఈ గ్రామంలో పండించే ప్రధాన పంటలు వరి, గోధుమ, మినుములు, పెసలు, పత్తి గ్రామంలో పోస్టాఫీసు, పంచాయితీ భవనం, విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్, రక్షిత మంచినీటి సరఫరా పథకం, ప్రాథమిక మరియు ఉన్నత పాఠశాలలు, రేషన్ దుకాణం, అంగన్‌వాడీ కేంద్రం ఉన్నాయి

### జనాభా పొందిక

468 కుటుంబాలు కలిగిన ఈ గ్రామంలో 999 మంది పురుషులు 974 మంది స్త్రీలు 974 లైంగిక నిష్పత్తితో ఈ గ్రామం 2011 నాటి జనగణన ఆధారంగా అంచనా వేసిన జిల్లా సగటు లైంగిక నిష్పత్తి (999)తో దగ్గరగా ఉంది దళితులు, అగ్రకులాల్లో లైంగిక నిష్పత్తి దాదాపు సమానంగా, గ్రామ సగటు కంటే తక్కువగా ఉంది దళితుల్లో 951గా ఉంటే అగ్రకులాల్లో 950గా ఉంది వెనకబడిన తరగతుల్లో

997గా ఉంది గిరిజనుల్లో లైంగిక నిష్పత్తి 1000గా ఉండటం ప్రత్యేకంగా ప్రస్తావించాల్సిన అంశం గిరిజన కుటుంబాలు మొత్తం గ్రామ జనాభాలో కేవలం రెండు శాతం మాత్రమే కనుక ఈ తరగతిలో లైంగిక నిష్పత్తిని ప్రమాణంగా తీసుకోవటం సాధ్యంకాదు

**సామాజిక పొందిక**

మొత్తం కుటుంబాల్లో 50%వెనకబడిన తరగతులు, 28%దళితులు, 20%అగ్రకులాలు, మిగిలిన రెండు శాతం గిరిజన కుటుంబాలు ఉన్నాయి జిల్లాలో సగటు దళిత జనాభా నిష్పత్తితో పోల్చిచూసినపుడు ఈ గ్రామంలో వీరి నిష్పత్తి దాదాపు 10%అదనంగా ఉంది జిల్లాలో ఎస్సీ జనాభా 17 శాతం గ్రామంలోని వివిధ కులాలు ఇలా ఉన్నాయి అత్యధిక సంఖ్యలో 130 మాదిగ కుటుంబాలు ఉన్నాయి మొత్తం గ్రామంలో వీరిది 28 శాతం. వీరి తర్వాత సంఖ్యాపరంగా ఎక్కువగా వున్న కులం రెడ్డి కులం 87 కుటుంబాలు(18 50%) ముదిరాజు 42 కుటుంబాలు, గౌడ కులస్తులు 40 కుటుంబాలు (మొత్తం కుటుంబాల్లో 8 5 శాతం), 29 కుటుంబాలు కురుమలు, 25 యాదవ కుటుంబాలు (5 శాతం) 21 కుమ్మరి కుటుంబాలు (4 శాతం), 17 విశ్వబ్రాహ్మణ, 16 కుటుంబాలు మున్నూరుకాపు, ఎనిమిది పద్మశాలి, 14 రజక, ఎనిమిది ఒడ్డెర, నాలుగు ఎరుకల కులాలకు చెందిన కుటుంబాలు, మూడు నాయీబ్రాహ్మణ, రెండు వైశ్య, మరో రెండు మాల కుటుంబాలు ఒక్క కాపు కుటుంబం ఉన్నాయి కేవలం ఎనిమిది కుటుంబాలు ముస్లిం కుటుంబాలు ఉన్నాయి కులం పేరు చెప్పని కుటుంబాలు ఏడు మరో నాలుగు కుటుంబాలు ఇతర కులాలకు చెందినవి ఉన్నాయి మొత్తం కుటుంబాల్లో 79 కుటుంబాలు (17%) స్త్రీల యాజమాన్యంలో వున్నాయని సర్వేలో వెల్లడైంది గ్రామంలో పురుషులు గణనీయమైన స్థాయిలో బతుకుదెరువు కోసం వలసలు వెళ్లటంతో సర్వే సమయానికి 17 శాతం కుటుంబాలు స్త్రీల యాజమాన్యంలో ఉన్న కుటుంబాలుగా తేలాయి

**ఆయుఃప్రమాణం**

గ్రామంలో ఐదేళ్ల లోపు వయసు కలిగిన జనాభా 7 శాతం ఉంటే పాఠశాలకెళ్లే వయసులో ఉన్న జనాభా (6-15 సంవత్సరాలు) 16 శాతంగా ఉంది మొత్తం జనాభాలో 68 శాతం పనిచేయగలిగిన వయసులో ఉన్నారు గ్రామ జనాభా 50 శాతం వాటా కలిగిన వెనకబడిన తరగుతులు శ్రమశక్తిలో తమ జనాభా వాటా నిష్పత్తిని మించి

70 శాతం వాటా కలిగి ఉన్నారు. 60 సంవత్సరాలకు పైబడి జీవిస్తున్న జనాభా మొత్తం గ్రామంలో తొమ్మిది శాతం ఉంటే వారిలో నాలుగు శాతం వెనకబడిన తరగతులకు చెందిన వారే దళితులు, గిరిజనులు, అగ్రకులాల్లో 60 ఏళ్ల పైబడిన జనాభాలో మిగిలిన ఐదు శాతం పంపిణీ అయి ఉన్నారు ఈ గ్రామంలో మొత్తం జనాభాలో 47 శాతం యువత వున్నది

జీవనోపాధి

సెన్సెస్ సర్వే పత్రంలో ప్రధమ ప్రాధాన్యత కలిగిన ఉపాధి, ద్వితీయ ప్రాధాన్యత కలిగిన ఉపాధి, తృతీయ ప్రాధాన్యత కలిగిన ఉపాధిల గురించిన సమాచారాన్ని తెలుసుకునే ప్రయత్నం చేశాము ఈ గ్రామంలో ప్రధాన జీవనోపాధిలో ఎంతో వైవిధ్యం ఉంది. సెన్సెస్‌లో వెల్లడించిన వివరాల ప్రకారం మొత్తం గ్రామ జనాభా 50 రకాల పనులు చేస్తూ కుటుంబ పోషణ సాగిస్తున్నారు. గ్రామంలో 263 కుటుంబాలకు వ్యవసాయమే ప్రధాన జీవనాధారం వీరి నిష్పత్తి మొత్తం కుటుంబాల్లో 56శాతం వీరిలో 19 కుటుంబాలకు కౌలు సేద్యం జీవనాధారంగా ఉన్నారు మరో 113 మంది వ్యవసాయ కూలీ శ్రమపై ఆధారపడిన కుటుంబాలు ఉన్నాయి మొత్తం 24 శాతం అంటే 80 శాతం కుటుంబాలకు వ్యవసాయమే జీవనాధారం ఈ రెండు ఉపాధుల తర్వాత 20 శాతం వరకు కుటుంబాలు వివిధ వ్యవసాయేతర వృత్తులపై ఆధారపడి జీవనం సాగిస్తున్నాయి. వీరు అంగన్‌వాడీ ఆయా మొదలుకొని వివిధ రకాల భవన నిర్మాణ కార్మికులు, ప్రైవేటు ఉద్యోగాలు చేసేవారు ఉన్నారు 15 కుటుంబాలు సాంప్రదాయ వృత్తులపై ఆధారపడి జీవనం కొనసాగిస్తున్నాయి మిగిలిన వృత్తులపై ఆధారపడ్డవాల్లు పరిమిత సంఖ్యలో ఉన్నారు.

సాగుభూమి

గ్రామంలో మొత్తం 1107 ఎకరాల సాగు భూమి ఉంటే అందులో 432 ఎకరాలకు సాగు నీటి వసతి ఉన్నది. 488 ఎకరాలు సాగునీటి వసతి లేని భూమి పడావు భూమి 187 ఎకరాలు అంటే మొత్తం భూమిలో కేవలం 39 శాతం భూమికి మాత్రమే సాగునీటి వసతి ఉంది మరో 17 శాతం పడావు పెట్టిన భూమి ఉంది. నికర సాగు భూమి 1165 ఎకరాలుగా సెన్సెస్ గణాంకాల పరిశీలనలో వెల్లడైంది. ఇందులో స్వంత భూమి కలిగిన కుటుంబాలు కౌలుకు ఇచ్చిన భూమి వివరాలు తప్పుగా

చెప్పటం వల్ల వచ్చిన వ్యత్యాసం ఇది. గ్రామంలో 137 ఎకరాలు కౌలు సేద్యం కింద ఉన్నది గంగదేవి పల్లిలో ధనిక రైతులు కౌలు సేద్యంలో సింహభాగం వాటా కలిగి ఉంటే దీనికి భిన్నంగా మెట్ట గ్రామంగా వర్గీకరించగలిగిన ఈ గ్రామంలో ధనిక రైతాంగం, భూస్వాములు కౌలు సేద్యం జోలికి పోకపోవటాన్ని గమనించవచ్చు ఈ రెండు గ్రామాల్లో కౌలు సేద్యాన్ని పోల్చి చూసినపుడు ఒక నిర్ధారణకు రావచ్చు సాగునీటి వనరు అందుబాటులో ఉండి పంటల వైవిధ్యం, వాణిజ్య పంటల సాగు జరిగే గ్రామాల్లో రివర్స్ కౌలు ఒక ధోరణిగా ఉంది దీనికి భిన్నంగా ఆధారపడగలిగిన సాగునీటి వసతి లేని గ్రామాల్లో సాధారణ కౌలు పద్ధతి అమల్లో ఉంది రివర్స్ కౌలు అంటే స్వంత భూమి కలిగిన పై తరగతులు చిన్న సన్నకారు రైతుల నుండి భూమిని కౌలుకు తీసుకోవటం సాధారణ కౌలు పద్ధతి అంటే భూమి లేని కుటుంబాలు, ఉన్న కొద్ది పాటి భూమి చాలదని భావించే చిన్నసన్నకారు రైతు కుటుంబాలు పై తరగతుల నుండి భూమిని కౌలుకు తీసుకోవటం.

### సాగుదారులు – కౌల్దారులు

మొత్తం గ్రామంలో 292 సాగుదారుల కుటుంబాలు ఉన్నాయి. మొత్తం గ్రామంలోని కుటుంబాలతో పోల్చినపుడు 62 శాతం ఇతర గ్రామాలతో పోల్చినపుడు సాగుదారుల నిష్పత్తి ఈ గ్రామంలో ఎక్కువగా ఉందనే చెప్పాలి. వీరిలో స్వంత భూమి సాగు చేస్తున్న కుటుంబాలు 285 ఉన్నాయి. కేవలం 37 కుటుంబాలు మాత్రమే కౌలు చేస్తున్నాయి స్వంత భూమి లేని కౌల్దారులు కేవలం ఎనిమిది కుటుంబాలు మాత్రమే వీరి చేతుల్లో సాగవుతోంది కేవలం 17 ఎకరాలు మిగిలిన 120 ఎకరాలు ఎంతో కొంత స్వంత భూమి కలిగిన కుటుంబాలు సాగు చేస్తున్నదే. గ్రామంలో 26 శాతంగా ఉన్న మాదిగ కుటుంబాల్లో సాగుదారులు 85 కుటుంబాలు స్వంత భూమి కలిగిన కుటుంబాలు ఉన్నాయి వీరి చేతుల్లో 189 ఎకరాల సాగు భూమి ఉన్నది. ఇది మొత్తం స్వంత భూమిలో 17 శాతం వీరి తర్వాత గ్రామంలో సంఖ్య రీత్యా ఎక్కువగా వున్నది రెడ్డి కులం వీరికి 184 స్వంత భూమి ఉంది 12 మాదిగ కులానికి చెందిన కుటుంబాలు 34 5 ఎకరాలు కౌలు భూమి సాగు చేస్తుంటే, రెడ్డి కులానికి చెందిన తొమ్మిది కుటుంబాలు 24 ఎకరాలు సాగు చేస్తున్నాయి ఏడు ముదిరాజు కుటుంబాలు 21 5 ఎకరాలు కౌలు కింద సాగు చేస్తున్నాయి. ఈ గ్రామంలో కౌలు సేద్యం పరిశీలిస్తే మధ్యతరగతి, చిన్న రైతులు మొత్తం కౌలు భూమిలో 84 శాతం కౌలు భూమిని సాగు చేయటం ప్రత్యేకతగానే చెప్పుకోవాలి.

## ఆర్థిక తరగతుల పొందిక

నికర సాగు విస్తీర్ణాన్ని, స్వంత శ్రమ, కూలికి వెళ్లిన శ్రమ వంటి అనేక ప్రమాణాలను మేళవించి గ్రామంలోని కుటుంబాలను వివిధ ఆర్థిక వర్గాలుగా విభజించటం జరిగింది ఈ ప్రమాణాన్ని పాటించినపుడు గ్రామంలో అత్యధికశాతం కుటుంబాలు సన్నకారు రైతు కుటుంబాలుగా వర్గీకరించబడ్డాయి ఈ తరగతికి చెందిన కుటుంబాలు 164 ఉన్నాయి మొత్తం కుటుంబాల్లో ఈ తరగతి 35 శాతం తర్వాతి స్థానం 15 శాతంతో చిన్నరైతులు ఉన్నారు భూమి లేని వ్యవసాయ కార్మిక కుటుంబాలు 14 శాతంతో తర్వాతి స్థానం ఆక్రమించగా 13 శాతంతో వ్యవసాయేతర కార్మికులు సంఖ్యరీత్యా నాల్గో స్థానం ఆక్రమించి ఉన్నారు భూమి కలిగిన వ్యవసాయ కార్మికులు 6 శాతం ఉండగా మధ్యతరగతి రైతులు చాలా పరిమితంగా ఉంది గ్రామంలో ఈ తరగతికి చెందిన రైతాంగం కేవలం నాల్గున్నర శాతం మాత్రమే ఉన్నారు మరో ఐదు శాతం ప్రభుత్వ, ప్రైవేటు ఉద్యోగస్తులు ఉంటే ధనిక రైతులు కేవలం ఐదుగురు ఉన్నట్లు నమోదు అయ్యింది వృత్తిదారులు 3 శాతం ఉండగా వ్యాపారస్తుల కుటుంబాలు రెండు శాతం ఉన్నాయి. ఆర్థిక తరగతుల వారీగా సాగు భూమి పంపిణీని పరిశీలించినపుడు గ్రామంలో ఉన్న ఒక్క భూస్వామి కుటుంబం మొత్తం నికర సాగు భూమిలో ఏడు శాతం భూమిని సాగు చేస్తోంది ఒక్క శాతంగా ఉన్న ధనిక రైతాంగం ఏడు శాతం భూమిని సాగు చేస్తున్నారు 4 శాతంగా ఉన్న మధ్యతరగతి రైతాంగం 20 శాతం భూమిని సాగు చేస్తున్నారు 15 శాతంగా ఉన్న చిన్నరైతులు నికర సాగు భూమిలో 32 శాతం భూమిని సాగు చేస్తున్నారు 35 శాతంగా ఉన్న సన్నకారు రైతాంగం జనాభా నిష్పత్తి కంటే తక్కువగా 30 శాతం భూమిని మాత్రమే సాగు చేస్తున్నారు

## భూకేంద్రీకరణ

ఆర్థిక తరగతుల నిర్ధారణకు నికర సాగు భూమి ప్రమాణంగా తీసుకుంటే భూకేంద్రీకరణ విశ్లేషణకు స్వంత భూమిని ప్రమాణంగా తీసుకున్నాము గ్రామంలో 1107 ఎకరాలు స్వంత సేద్యం ఉంది. పైన ఉన్న ఐదుశాతం మంది చేతుల్లో 373 5ఎకరాలు కేంద్రీకృతమై ఉంది అంటే 34శాతం మొత్తం గ్రామంలోని స్వంత భూమిలో 33.7 శాతం అట్టడుగున ఉన్న 60 శాతం చేతుల్లో కేవలం 144.55 ఎకరాలు మాత్రమే ఉంది మొత్తం స్వంత భూమిలో ఇది 13 శాతం పైన ఉన్న ఐదు

శాతం కుటుంబాల్లో సగం రెడ్డికులానికి చెందిన కుటుంబాలే వీరి చేతుల్లో 200 ఎకరాలు కేంద్రీకృతమై ఉంది భూస్వామ్య తరగతిగా వర్గీకరించబడిన ఏడు కుటుంబాల చేతుల్లో 174 ఎకరాల భూమి కేంద్రీకృతమై ఉండటాన్ని గమనించవచ్చు మొత్తం గ్రామంలో స్వంత కమతాల్లో ఇది 15 శాతం ఐదు శాతం కుటుంబాల చేతుల్లో ఉన్న భూమి 373 ఎకరాలన్న విషయాన్ని గమనంలోకి తీసుకుంటే మిగిలిన 16 కుటుంబాల చేతుల్లో మిగిలిన 199 ఎకరాల భూమి కేంద్రీకృతమై ఉందని నిర్ధారించవచ్చు అంటే భూ కేంద్రీకరణలో సైతం శీర్షస్థానంలో ఉన్న కుటుంబాల మధ్య అపారమైన అంతరాలు ఉన్నాయని ఈ విశ్లేషణ రుజువు చేస్తోంది

**ఆర్థిక సామాజిక తరగతుల్లో భూకేంద్రీకరణ తీవ్రత**

భూ కేంద్రీకరణ తీవ్రతను అంచనా వేయటానికి స్వంత భూమిని ప్రమాణంగా తీసుకుని సగటు కుటుంబ కమతం విస్తీర్ణం నిర్ధారించి సగటు కుటుంబ కమంత కంటే ఎక్కువ భూమి కలిగిన కుటుంబాల శాతాన్ని లెక్కించే ప్రయత్నం చేశాము ఈ పద్ధతిన జరిపిన పరిశీలనలో గ్రామంలో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 2 35 ఎకరాలుగా తేలింది. ఉన్నత స్థానంలో ఉన్న ఐదు శాతం కుటుంబాల సగటు కుటుంబ కమతం విస్తీర్ణం 16 23 ఎకరాలు ఇది గ్రామ సగటు కుటుంబ కమతం విస్తీర్ణం కంటే దాదాపు ఎనిమిది రెట్లు ఎక్కువ మొత్తం కుటుంబాల్లో భూమి లేని కుటుంబాలను మినహాయిస్తే 260 భూమి కలిగిన కుటుంబాలు చేతుల్లో ఉన్న కుటుంబ కమతాలు గ్రామ సగటు కుటుంబ కమతం విస్తీర్ణం కంటే తక్కువ విస్తీర్ణం ఉన్న కమతాలు అత్యధికంగా భూస్వామి కుటుంబానికి ఉన్న కమతం గ్రామ సగటు కుటుంబ కమతం విస్తీర్ణంతో పోల్చినపుడు 34 రెట్లు అధికంగా ఉంది వ్యవసాయ కార్మికవర్గపు కుటుంబాల సగటు కుటుంబ కమతం విస్తీర్ణంతో పోల్చిచే ఇది 160 రెట్లు ఎక్కువ వ్యవసాయకార్మిక కుటుంబాలకు గల సగటు కుటుంబ కమతం విస్తీర్ణం కేవలం ఐదు సెంట్లు భూస్వామి కుటుంబానికి ఉన్న కమతం విస్తీర్ణం 80 ఎకరాలు భూస్వామ్య వర్గం మొత్తంగా పరిశీలించినపుడు ఈ వర్గపు సగటు కుటుంబ కమతం 24 ఎకరాలు ఇది కూడా గ్రామ సగటు కుటుంబ కమతం కంటే పది రెట్లు ఎక్కువ ఈ వివరాలు గ్రామంలో భూకేంద్రీకరణ తీవ్రతను తేటతెల్లం చేస్తున్నాయి అగ్రకులాల్లో సగటు కుటుంబ కమతం విస్తీర్ణం దాదాపు ఐదెకరాలుగా (4.93 ఎకరాలు) ఉంది. ఇది గ్రామ సగటు కుటుంబ కమతం విస్తీర్ణం కంటే రెండు రెట్లు ఎక్కువ. బిసిల్లో ఈ సగటు 2 01 ఎకరాలుగా ఉంటే ఎస్సీల్లో ఇది 1 51 ఎకరాలుగానూ, గిరిజనుల్లో 60 సెంట్లుగానూ ఉంది

## అక్షరాస్యత

ప్రాథమిక విద్యతో సరిపెట్టిన వాళ్లు 15 శాతం ఉండగా ఉన్నత పాఠశాల విద్యతో సరిపెట్టిన వాళ్లు 27 శాతం ఉన్నారు గ్రామ జనాభాలో 12 శాతం ఇంటర్మీడియట్ పూర్తి చేసిన వారు, మరో ఎనిమిది శాతం డిగ్రీ పూర్తి చేసిన వారు ఉన్నారు యూనివర్సిటి స్థాయి విద్య పూర్తి చేసిన వారు మూడు శాతం ఉన్నారు ప్రాథమిక విద్య పూర్తి చేసిన జనాభా పొందికలో సామాజిక తరగతుల మధ్య పెద్దగా వ్యత్యాసం లేకపోయినప్పటికీ ఉన్నతపాఠశాల విద్య స్థాయికి వచ్చే సరికి ఈ వ్యత్యాసాలు గమనించదగ్గ స్థాయిలో ఉన్నాయి గ్రామ జనాభాలో సంఖ్యాపరంగా ఆధిపత్యం కలిగి వెనకబడిన తరగతుల వారే అన్ని విద్యా స్థాయిల్లోనూ మిగిలిన తరగతుల కంటే ముందంజలో ఉన్నారు ప్రాథమిక విద్యాభ్యాసం పూర్తి చేసిన వారి జనాభా ఎస్సీ, బిసి ఒసీల్లో దాదాపు సమపాళ్లల్లో ఉన్నప్పటికీ ఉన్నత పాఠశాల విద్యాభ్యాసం స్థాయికి వచ్చేసరికి అగ్రకులాలకు చెందిన కుటుంబాలు మూడో స్థానంలో ఉన్నాయి 12 శాతంతో బిసి కుటుంబాలు మొదటి స్థానంలో ఉంటే ఎనిమిదిశాతం తో ఎస్సీ కుటుంబాలు రెండో స్థానంలో ఉన్నాయి. అగ్రకులాలకు చెందిన కుటుంబాల్లో ఉన్నత పాఠశాల విద్య పూర్తి చేసిన వారి నిష్పత్తి ఐదు శాతానికి మించలేదు గణనీయమైన సంఖ్యలో ఈ గ్రామం నుండి బయటకు వలస వెళ్లిన కుటుంబాలు ఉండటంతో ఆయా కుటుంబాల అక్షరాస్యత వివరాలు తెలుసుకోవటం సాధ్యం కాలేదు స్త్రీ పురుషుల అక్షరాస్యత రేటు విషయంలో అన్ని సామాజిక తరగతుల్లోనూ పెద్దఎత్తున అంతరాలు ఉన్నాయి దళితుల్లో స్త్రీల అక్షరాస్యత పురుషుల అక్షరాస్యత కంటే 22 శాతం తక్కువగా ఉండే బిసిల్లో 20 శాతం, ఒసీల్లో 16 శాతం ఎస్టీల్లో 14 శాతం తక్కువగా ఉంది.

## గృహవసతులు

గ్రామంలో 91%కుటుంబాలకు స్వంత ఇల్లు ఉన్నాయి అందులో పక్కా నివాసాలు కలిగిన కుటుంబాలు 67 శాతం మాత్రమే అంటే 33%కుటుంబాలకు పక్కా ఇళ్లు నిర్మించుకునే సామర్థ్యం లేదు. పక్కా ఇళ్లు కలిగిన కుటుంబాల్లో సామాజిక తరగతుల వారీగా పరిశీలించినపుడు ఎస్సీలు ముందంజలో ఉన్నారు. ప్రభుత్వం సాంఘిక సంక్షేమ పథకాల్లో భాగంగా ఇళ్లు నిర్మించేపథకం కింద వీరు లబ్ధిదారులు కావటమే దీనికి ముఖ్య కారణంగా చెప్పవచ్చు వెనకబడిన తరగతుల కుటుంబాల్లో 64 శాతం మాత్రమే పక్కా గృహాలు కలిగి ఉన్నాయి. నివాసాల తర్వాత ముఖ్యమైన గృహవసతి

లెట్రిన్లు, విద్యుత్ మరియు వంటగ్యాస్ కనెక్షన్లు. గ్రామంలో సగం కుటుంబాలకు లెట్రిను సౌకర్యం లేదు 92 శాతం కుటుంబాలకు విద్యుత్ కనెక్షన్ ఉంటే 70 శాతం కుటుంబాలు టివి కలిగి ఉన్నాయి. వంటగ్యాస్ కనెక్షన్లు మాత్రం కేవలం 55 శాతం కుటుంబాలకు మాత్రమే ఉన్నాయి

**భూమి వున్న ఎగువ 5% కుటుంబాల చేతిలో 34% భూమి వుండగా, చివరి 60% కుటుంబాలకు కేవలం 13% భూమి మాత్రమే వుంది. 35% కుటుంబాలకు సెంటుభూమి లేదు.**

## వ్యవసాయోపకరణాలు - పశుసంపద

సర్వేలో వెల్లడైన ప్రధాన వ్యవసాయో పకరణాలు ట్రాక్టర్లు, ఎద్దులు. వ్యవసాయానికి అనుబంధంగా ఉన్న పశుసంపద ఈ గ్రామంలో ఏడు ట్రాక్టర్లు ఉంటే అందులో నాలుగు వెనకబడిన తరగతుల కుటుంబాల్లోనూ మిగిలిన మూడు అగ్రకులాలకు చెందిన కుటుంబాల్లోనూ ఉన్నాయి. మెట్టసేద్యపు స్థితిగతులకు అనుగుణంగానే ఈ గ్రామంలో గణనీయమైన స్థాయిలో పశుసంపద ఉన్నది 20 ఎద్దులు, 306 ఆవులు, గేదెలు, 532 గొర్రెలు, మేకలు ఉన్నాయి దళిత సామాజిక తరగతికి చెందిన కుటుంబాల్లో కూడా గొర్రెలు, మేకలు చెప్పుకోదగ్గ సంఖ్యలో ఉన్నాయి

## వినిమయ వస్తువులు

గ్రామంలో 38 శాతం కుటుంబాలకు సైకిళ్లు ఉంటే 19 కుటుంబాలకు స్కూటర్లు ఉన్నాయి. 23 శాతం కుటుంబాలకు మోటారుసైకిళ్లు ఉన్నాయి. ఏడు కుటుంబాలకు కార్లు, మరో 10 కుటుంబాలకు ఆటోలు ఉన్నాయి 70 శాతం కుటుంబాలకు టివి సెట్లు ఉన్నాయి గ్రామంలో 79 శాతం కుటుంబాలు సెల్‌ఫోన్లు కలిగి ఉన్నట్లు నమోదు అయ్యింది



## గ్రామంలో సామాజిక పొందిక కుటుంబాల వారీ - అక్షరాస్యత

| గ్రామం | మొత్తం కుటుంబాలు | ఎస్సీ | % | ఎస్టీ | % | బీసి | % | ఓసి | % | ఇతరులు | % | గ్రామంలో అక్షరాస్యత % |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆచార్యులగూడెం | 321 | 66 | 21 | – | – | 207 | 64 | 48 | 15 | – | – | 69 |
| అక్కెనపల్లి | 288 | 61 | 21 | – | – | 219 | 76 | 8 | 3 | – | – | 58 |
| బుడిమి | 329 | 54 | 16 | 1 | 0 3 | 238 | 72 | 33 | 10 | 3 | 1 | 50 |
| బూర్గుపాడు | 373 | 44 | 12 | 183 | 49 | 88 | 24 | 56 | 15 | 2 | 1 | 51 |
| చిన్నమరూరు | 236 | 55 | 23 | 1 | 0 4 | 130 | 55 | 50 | 21 | – | – | 67 |
| గగ్గుపల్లి | 299 | 113 | 38 | 1 | 0 3 | 159 | 53 | 23 | 8 | 3 | 1 | 59 |
| గంగదేవిపల్లి | 297 | 1 | 0 3 | 9 | 3 | 269 | 91 | 18 | 6 | – | – | 65 |
| జమిస్తాపూర్ | 179 | 60 | 34 | 1 | 1 | 90 | 50 | 28 | 16 | – | – | 53 |
| కేతిరెడ్డిపల్లి | 367 | 67 | 18 | 136 | 37 | 129 | 33 | 35 | 10 | – | – | 58 |
| కిష్టాపూర్ | 388 | 165 | 43 | 4 | 1 | 204 | 53 | 13 | 3 | 2 | 1 | 56 |
| కొత్తూరు | 481 | 39 | 8 | 109 | 23 | 325 | 68 | 5 | 1 | 3 | 1 | 56 |
| మయికోడ్ | 357 | 88 | 25 | 27 | 8 | 216 | 61 | 26 | 7 | – | – | 51 |
| నాగంపేట్ | 463 | 83 | 18 | 34 | 7 | 257 | 56 | 89 | 19 | – | – | 55 |
| నందారం | 276 | 39 | 14 | 140 | 51 | 76 | 28 | 20 | 7 | 1 | 0 4 | 53 |
| ఓబులకేశాపురం | 468 | 132 | 28 | 10 | 2 | 230 | 49 | 95 | 20 | 1 | 0 2 | 67 |
| రాయిపల్లి-డి | 294 | 150 | 51 | 8 | 3 | 91 | 31 | 45 | 15 | – | – | 59 |
| రసూల్‌పుర | 198 | 62 | 31 | 2 | 1 | 99 | 50 | 35 | 18 | – | – | 60 |
| సీతారంపురం | 479 | 195 | 41 | 189 | 40 | 75 | 16 | 16 | 3 | 4 | 1 | 60 |
| సుజాతానగర్ | 510 | 65 | 13 | 38 | 7 | 288 | 56 | 117 | 23 | 2 | 0 4 | 71 |
| వెంకటాపూర్ | 297 | 100 | 34 | 5 | 2 | 159 | 54 | 33 | 11 | – | – | 59 |
| వెంకేపల్లి | 387 | 170 | 44 | 1 | 0 3 | 130 | 34 | 85 | 22 | 1 | 0 3 | 61 |
| విప్పలమడక | 375 | 154 | 41 | 2 | 0 5 | 123 | 33 | 95 | 25 | 1 | 0 3 | 61 |

## సెన్సెస్ గ్రామాల్లో సాగుభూమి వివరాలు (ఎకరాలలో)

| గ్రామం | మొత్తం | స్వంతభూమి | | | కౌలుకు తీసుకున్నది | | | కౌలుకు ఇచ్చినది | | | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | కుటుంబాలు | మాగాణి | మెట్ట | మొత్తం | మాగాణి | మెట్ట | మొత్తం | మాగాణి | మెట్ట | మొత్తం | నికర సాగు |
| ఆచార్యులగూడెం | 321 | 531 | 8 | 539 | 163 | 2 | 165 | 78 | 1 2 | 79 2 | 624 8 |
| అక్కెనపల్లి | 288 | 219 | 203 | 422 | 59 | 112 | 171 | 28 | 25 | 53 | 540 |
| బుడిమి | 329 | 382 | 186 | 568 | 26 | 43 | 69 | 32 | 21 | 53 | 584 |
| బూర్గుపాడు | 373 | 340 | 277 | 617 | 118 | 99 | 217 | 42 | 20 | 62 | 772 |
| చిన్నమరూరు | 236 | 619 | 158 | 777 | 333 | 49 | 382 | 227 | 43 | 270 | 889 |
| గగ్గుపల్లి | 299 | 328 | 90 | 418 | 35 | 42 | 77 | 35 | 5 | 40 | 455 |
| గంగదేవిపల్లి | 297 | 339 | 216 | 555 | 111 | 124 | 235 | 18 | 21 | 39 | 751 |
| జమిస్తాపూర్ | 179 | 241 | 515 | 756 | 77 | 124 | 201 | 24 | 61 | 85 | 872 |
| కేతిరెడ్డిపల్లి | 367 | 272 | 544 | 816 | 16 | 58 | 74 | 8 | 15 | 23 | 867 |
| కిష్టాపూర్ | 388 | 172 | 51 | 223 | 79 | 11 | 90 | 36 | 9 | 45 | 268 |
| కొత్తూరు | 481 | 536 | 75 | 611 | 157 | 16 | 173 | 20 | 2 | 22 | 762 |
| మయికోడ్ | 357 | 154 | 1055 | 1209 | 32 | 207 | 239 | 9 | 10 | 19 | 1429 |
| నాగంపేట్ | 463 | 329 | 279 | 608 | 80 | 32 | 112 | 32 | 32 | 64 | 656 |
| నందారం | 276 | 328 | 453 | 781 | 46 | 94 | 140 | 40 | 37 | 77 | 844 |
| ఓబులకేశాపురం | 468 | 432 | 675 | 1107 | 70 | 67 | 137 | 34 | 41 | 75 | 1169 |
| రాయిపల్లి-డి | 294 | 569 | 216 | 785 | 60 | 35 | 95 | 7 | 5 | 12 | 868 |
| రసూల్‌పుర | 198 | 395 | 242 | 637 | 26 | 16 | 42 | 7 | 11 | 18 | 661 |
| సీతారంపురం | 479 | 397 | 286 | 683 | 152 | 56 | 208 | 47 | 20 | 67 | 824 |
| సుజాతానగర్ | 510 | 213 | 160 | 373 | 113 | 145 | 258 | 74 | 41 | 115 | 516 |
| వెంకటాపూర్ | 297 | 286 | 375 | 661 | 26 | 19 | 45 | 19 | 10 | 29 | 677 |
| వెంకేపల్లి | 387 | 402 | 531 | 933 | 55 | 85 | 140 | 23 | 45 | 68 | 1005 |
| విప్పలమడక | 375 | 418 | 96 | 514 | 312 | 42 | 344 | 57 | 9 | 65 | 793 |

# సెన్సెస్ గ్రామాల్లో వర్గ పొందిక

| గ్రామం పేరు | కుటుంబాల సంఖ్య | భూస్వామి | శాతం | ధనిక రైతు | శాతం | మధ్యతరగతి రైతు | శాతం | చిన్నకారు రైతు | శాతం | సన్నకారు రైతు | శాతం | భూమి వున్న వ్యవసాయ కార్మికులు | శాతం | భూమి లేని వ్యవసాయ కార్మికులు | శాతం | వృత్తిదారులు | శాతం | స్వయం ఉపాధి | శాతం | ప్రైవేట్ ఉద్యోగాలు | శాతం | ప్రభుత్వ ఉద్యోగాలు | శాతం | వ్యాపారులు | శాతం | వడ్డీ వ్యాపారులు | శాతం | వ్యవసాయేతర కార్మికులు | శాతం | ఇతరులు | శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అచార్యులగూడెం | 321 | 10 | 3.12 | 27 | 8.41 | 38 | 11.84 | 39 | 12.15 | 55 | 17.13 | 3 | 0.93 | 78 | 24.30 | 7 | 2.18 | 4 | 1.25 | 13 | 4.05 | 10 | 3.12 | 7 | 2.18 | 1 | 0.31 | 8 | 2.49 | 21 | 6.54 |
| అశ్వినపల్లి | 288 |  | 0.00 | 11 | 3.82 | 47 | 16.32 | 67 | 23.26 | 50 | 17.36 | 4 | 1.39 | 63 | 21.88 | 5 | 1.74 | 3 | 1.04 | 5 | 1.74 | 10 | 3.47 | 3 | 1.04 |  | 0.00 | 4 | 1.39 | 16 | 5.56 |
| బుడిమి | 329 | 4 | 1.22 | 11 | 3.34 | 56 | 17.02 | 90 | 27.36 | 72 | 21.88 | 19 | 5.78 | 48 | 14.59 | 1 | 0.30 | 1 | 0.30 | 2 | 0.61 |  | 0.00 | 6 | 1.82 |  | 0.00 | 4 | 1.22 | 15 | 4.56 |
| బుర్గుపాడు | 373 | 6 | 1.61 | 15 | 4.02 | 30 | 8.04 | 48 | 12.87 | 69 | 18.50 | 26 | 6.97 | 133 | 35.66 | 6 | 1.61 | 2 | 0.54 | 7 | 1.88 | 2 | 0.54 | 10 | 2.68 |  | 0.00 | 5 | 1.34 | 14 | 3.75 |
| చిన్నమరూర్ | 236 | 11 | 4.66 | 23 | 9.75 | 38 | 16.10 | 33 | 13.98 | 31 | 13.14 | 1 | 0.42 | 56 | 23.73 |  | 0.00 | 1 | 0.42 | 15 | 6.36 | 1 | 0.42 | 8 | 3.39 |  | 0.00 | 12 | 5.08 | 6 | 2.54 |
| గగ్గపల్లి | 299 | 2 | 0.67 | 9 | 3.01 | 17 | 5.69 | 31 | 10.37 | 47 | 15.72 | 16 | 5.35 | 80 | 26.76 | 12 | 4.01 | 6 | 2.01 | 12 | 4.01 | 1 | 0.33 | 5 | 1.67 |  | 0.00 | 41 | 13.71 | 20 | 6.69 |
| గంగదేవిపల్లి | 297 |  | 0.00 | 19 | 6.40 | 53 | 17.85 | 45 | 15.15 | 47 | 15.82 | 12 | 4.04 | 56 | 18.86 | 6 | 2.02 | 7 | 2.36 | 15 | 5.05 | 5 | 1.68 | 6 | 2.02 | 1 | 0.34 | 7 | 2.36 | 18 | 6.06 |
| జమిస్తాపూర్ | 179 | 1 | 0.56 | 13 | 7.26 | 24 | 13.41 | 41 | 22.91 | 48 | 26.82 | 10 | 5.59 | 23 | 12.85 | 4 | 2.23 |  | 0.00 | 3 | 1.68 | 1 | 0.56 |  | 0.00 |  | 0.00 | 7 | 3.91 | 4 | 2.23 |
| ఖేర్రెడ్డిపల్లి | 367 | 1 | 0.27 | 4 | 1.09 | 18 | 4.90 | 65 | 17.71 | 156 | 42.51 | 33 | 8.99 | 30 | 8.17 | 6 | 1.63 | 2 | 0.54 | 23 | 6.27 | 2 | 0.54 | 4 | 1.09 |  | 0.00 | 15 | 4.09 | 8 | 2.18 |
| కిష్టాపూర్-ఆదిలాబాద్ | 388 | 1 | 0.26 | 2 | 0.52 | 6 | 1.55 | 23 | 5.93 | 71 | 18.30 | 66 | 17.01 | 108 | 27.84 | 35 | 9.02 | 4 | 1.03 | 11 | 2.84 | 2 | 0.52 | 11 | 2.84 |  | 0.00 | 19 | 4.90 | 29 | 7.47 |
| కొత్తూరు | 481 | 1 | 0.21 | 5 | 1.04 | 65 | 13.51 | 97 | 20.17 | 131 | 27.23 | 22 | 4.57 | 86 | 17.88 | 7 | 1.46 | 7 | 1.46 | 7 | 1.46 | 2 | 0.42 | 5 | 1.04 |  | 0.00 | 15 | 3.12 | 31 | 6.44 |
| మాయికోడ్ | 357 |  | 0.00 | 9 | 2.52 | 39 | 10.92 | 97 | 27.17 | 117 | 32.77 | 11 | 3.08 | 30 | 8.40 | 7 | 1.96 |  | 0.00 | 2 | 0.56 | 8 | 2.24 | 6 | 1.68 |  | 0.00 | 25 | 7.00 | 6 | 1.68 |
| నాగంపేట | 463 |  | 0.00 | 5 | 1.08 | 52 | 11.23 | 101 | 21.81 | 81 | 17.49 | 9 | 1.94 | 71 | 15.33 | 31 | 6.70 | 4 | 0.86 | 7 | 1.51 | 5 | 1.08 | 7 | 1.51 |  | 0.00 | 64 | 13.82 | 26 | 5.62 |
| నందారం | 276 |  | 0.00 | 1 | 0.36 | 25 | 9.06 | 70 | 25.36 | 112 | 40.58 | 26 | 9.42 | 22 | 7.97 | 1 | 0.36 | 7 | 2.54 | 1 | 0.36 | 1 | 0.36 | 2 | 0.72 |  | 0.00 | 3 | 1.09 | 5 | 1.81 |
| ఓబులకేశవాపురం | 468 | 1 | 0.21 | 5 | 1.07 | 21 | 4.49 | 72 | 15.38 | 164 | 35.04 | 29 | 6.20 | 66 | 14.10 | 13 | 2.78 | 5 | 1.07 | 19 | 4.06 | 3 | 0.64 | 9 | 1.92 |  | 0.00 | 33 | 7.05 | 28 | 5.98 |
| రాయిపల్లి-డి | 294 | 7 | 2.38 | 27 | 9.18 | 91 | 30.95 | 83 | 28.23 | 37 | 12.59 | 2 | 0.68 | 29 | 9.86 | 1 | 0.34 | 2 | 0.68 | 3 | 1.02 | 1 | 0.34 | 1 | 0.34 |  | 0.00 | 7 | 2.38 | 3 | 1.02 |
| రసూల్‌పుర | 198 | 7 | 3.54 | 26 | 13.13 | 40 | 20.20 | 32 | 16.16 | 24 | 12.12 | 5 | 2.53 | 44 | 22.22 |  | 0.00 | 1 | 0.51 | 3 | 1.52 | 2 | 1.01 | 1 | 0.51 |  | 0.00 | 5 | 2.53 | 8 | 4.04 |
| సీతారాంపురం-ఖమ్మం | 479 |  | 0.00 | 7 | 1.46 | 22 | 4.59 | 96 | 20.04 | 117 | 24.43 | 22 | 4.59 | 150 | 31.32 | 11 | 2.30 | 12 | 2.51 | 7 | 1.46 | 2 | 0.42 | 6 | 1.25 | 1 | 0.21 | 16 | 3.34 | 10 | 2.09 |
| సుజాతానగర్ | 510 | 5 | 0.98 | 11 | 2.16 | 23 | 4.51 | 22 | 4.31 | 42 | 8.24 |  | 0.00 | 133 | 26.08 | 32 | 6.27 | 21 | 4.12 | 43 | 8.43 | 6 | 1.18 | 73 | 14.31 | 4 | 0.78 | 57 | 11.18 | 38 | 7.45 |
| వెంకటాపూర్ | 297 | 1 | 0.34 | 1 | 0.34 | 15 | 5.05 | 90 | 30.30 | 104 | 35.02 | 21 | 7.07 | 12 | 4.04 | 13 | 4.38 | 3 | 1.01 | 6 | 2.02 | 4 | 1.35 | 5 | 1.68 |  | 0.00 | 12 | 4.04 | 10 | 3.37 |
| వెంకేపల్లి | 387 | 2 | 0.52 | 15 | 3.88 | 41 | 10.59 | 69 | 17.83 | 84 | 21.71 | 22 | 5.68 | 52 | 13.44 | 4 | 1.03 | 4 | 1.03 | 19 | 4.91 | 2 | 0.52 | 4 | 1.03 |  | 0.00 | 28 | 7.24 | 41 | 10.59 |
| విప్పలమడక | 375 | 5 | 1.33 | 12 | 3.20 | 37 | 9.87 | 53 | 14.13 | 87 | 23.20 | 6 | 1.60 | 134 | 35.73 |  | 0.00 | 3 | 0.80 | 3 | 0.80 | 5 | 1.33 | 7 | 1.87 |  | 0.00 | 8 | 2.13 | 15 | 4.00 |












ఇంతకు ముందు కూడా గ్రామ సర్వేలు అనేకం జరిగాయి. అవి ప్రధానంగా అకడమిక్ పరిశోధకుల అధ్వర్యంలో జరిగాయి. ఒకటి రెండు గ్రామాలకు పరిమితం అయిన పరిశోధనలు జరిగాయి. కానీ ఇప్పటి సర్వే విస్తృతంగా జిల్లాలు, ప్రాంతాల్లో వ్యవసాయ పద్ధతులను పరిగణనలోకి తీసుకుని జరిగింది. అంతేకాక విషయ జ్ఞానం కోసమే పరిమితం కాకుండా గ్రామీణ ప్రాంత ఉద్యమాలకు తోడ్పడేందుకు ఈ సర్వే ఉద్దేశించింది. అందుకే సర్వే ప్రక్రియలో అన్ని దశల్లోనూ ఉద్యమ కార్యకర్తలు భాగస్వాములు అయ్యారు. సుందరయ్య విజ్ఞాన కేంద్రంతో పాటు అఖిల భారత వ్యవసాయ కార్మిక సంఘం, అఖిల భారత కిసాన్ సభ కార్యకర్తలు అన్ని దశల్లోనూ భాగస్వాములు అయ్యారు. ఉద్యమ శ్రేయోభిలాషులు అయిన మేధావులు ఈ కృషికి ప్రత్యక్షంగా, పరోక్షంగా తోడ్పడ్డారు. అనుభవజ్ఞులైన మేధావుల నైపుణ్యం, కార్యకర్తల క్షేత్రస్థాయి పరిజ్ఞానం మేళవింపబడటం ఈ సర్వే విశేషమే కాక సర్వే ఫలితాలు మరింత ప్రయోజనాత్మకంగా ఉండేందుకు తోడ్పడింది. విశ్లేషణ ఫలితాలను పరిశీలించిన వారెవరైనా ఈ విషయాన్ని గమనిస్తారు.

**- బి.వి. రాఘవులు**